# చైతన్య భగవద్గీత

## అథ చతుర్దశోఽధ్యాయః - పద్నాల్గవ అధ్యాయము

## గుణత్రయ విభాగ యోగః - గుణత్రయ విభాగ యోగము

**జగత్కారణత్వము**

పుట్టేది ఏదైనా అది క్షేత్ర క్షేత్రజ్ఞుల సంయోగము వల్లనే పుడుతూ ఉంది అని పదమూడవ అధ్యాయంలో తెలుసుకున్నాం *( 13 వ అ - 26 వ శ్లో ).* ఈ రెండిటి సంయోగము వలన సృష్టి ఉత్పన్నమైంది అంటే, జగదుత్పత్తికి క్షేత్రక్షేత్రజ్ఞులే, అంటే ప్రకృతి పురుషులే హేతువులా? అనే ప్రశ్న పుడుతుంది. క్షేత్రక్షేత్రజ్ఞులు స్వతంత్రులై సృష్టికి హేతువు లవుతున్నారా? కాదు. ప్రకృతి పురుషులకు స్వతంత్ర జగత్కారణత్వము లేదు.

క్షేత్రము ఎలా వికారయుతమో *( 13 వ అ - 5, 6 శ్లో ),* క్షేత్రజ్ఞుడు దానిని ఎలా ప్రకాశింప చేస్తున్నాడో కూడా స్పష్టంగా తెలుసుకున్నాం *( 13 వ అ - 33 వ శ్లో ).* కనుక వికారయుతమైన క్షేత్రము ఆది కలది. ప్రకాశ స్వరూపుడైన క్షేత్రజ్ఞుడు ఆది లేని వాడు. వీరిద్దరు స్వతంత్రులై సృష్టి కారణ మయ్యారు అని చెప్పడం నిర్హేతుకం. ఈశ్వరాధీనులైన క్షేత్ర క్షేత్రజ్ఞులకే జగత్కారణత్వము సిద్ధిస్తుంది గాని స్వతంత్రులైన ప్రకృతి పురుషులకు మాత్రం కానే కాదు. ఈ విషయం సుస్పష్టం కావలసి ఉంది.

పుడుతున్న ప్రతిదీ క్షేత్రక్షేత్రజ్ఞుల సంయోగము వల్లనే పుడుతూ ఉంది ***(సర్వమ్ ఉత్పద్యమానం క్షేత్ర క్షేత్రజ్ఞ సంయోగాత్ ఉత్పద్యతే ఇత్యుక్తం)*** అని చెప్పబడింది. అది ఎలా ***(కథం)?*** అనే ప్రశ్న పడినపుడు, ఈశ్వరాధీనులైన క్షేత్రక్షేత్రజ్ఞుల సంయోగము వల్లనే పుట్టేది పుడుతూ ఉంది అని వేదాంతం ప్రవచిస్తూ ఉంటే, ప్రకృతి పురుషులు స్వతంత్రులై జగదుత్పత్తికి హేతువు లవుతున్నారు అని సాంఖ్య మతము చెబుతూ ఉంది. ఇది వాస్తవం కాదు.

అవిద్య చేత, ప్రకృతికి వశమై ఉన్న గుణాలతో పురుషునికి ఏర్పడిన ఆధ్యాసిక సంబంధమే సంసారానికి కారణము అని మనం తెలుసుకొని ఉన్నాం *( 13 వ అ - 21 వ శ్లో ).* కాని, కొన్ని ప్రధానమైన విషయాలను చర్చిస్తే గాని ఈ విషయం బోధ పడదు. క్షేత్రక్షేత్రజ్ఞుల సంయోగము వల్లనే ప్రతిదీ పుడుతూ ఉంది అన్నప్పుడు, ఈ విధమైన జగత్కారణత్వము స్వతంత్రమా? పరతంత్రమా? ఈశ్వరాధీనమా? ఈశ్వర పరతంత్రమా? అనేది తెలియాలి. ఇది మొదటిది.

వేదాంతము ప్రతిపాదించే ఈశ్వరాధీనులైన క్షేత్రక్షేత్రజ్ఞుల సంయోగమే జగదుత్పత్తి హేతువు అవుతుంది గాని, సాంఖ్యులు ప్రతిపాదించే ఈశ్వర పరతంత్రులైన ప్రకృతి పురుషులు కారు అనేది నిర్ణయించిన తరువాత, ప్రకృతికి వశమైన గుణాలతో పురుషుడికి ఏర్పడిన సంగత్వమే సంసార కారణ మనేది కూడా నిర్ధారణ కావాలి. ఇది రెండవది. ప్రధానంగా ఈ రెండు విషయాలను సుస్పష్టం చేయడానికే ప్రస్తుత అధ్యాయము. అదే గుణత్రయ విభాగ యోగము.

**కాపిల సాంఖ్యము - వేదాంతము**

ప్రకృతికి సంబంధించిన గుణాలు ఒకటి మరొక దానితో కలియడం చేత ఇరవై నాలుగు తత్త్వాలు ***(చతుర్వింశతి తత్త్వాః)*** ఏర్పడ్డాయని సంఖ్యలో లెక్కిస్తారు కనుక వారిని సాంఖ్యులు అన్నారు. ఈ సాంఖ్య

దర్శనాన్ని ఆవిష్కరించిన వాడు కపిల మహర్షి కావడం చేత దీనికి కాపిల సాంఖ్యము అనే పేరు వచ్చింది.

ఈ సాంఖ్యమత బీజాలు శ్వేతాశ్వతరోపనిషత్తు - ఆరవ అధ్యాయంలో ఉన్నాయి. ప్రకృతి పురుషులు స్వయంభువులు అంటారు సాంఖ్యులు. వారిరువురు స్వతంత్రంగా జగదుత్పత్తి హేతువులు అనేది సాంఖ్య సిద్ధాంతము.

ప్రకృతి త్రిగుణాత్మకము. జడరూపము. ప్రకృతి యొక్క త్రిగుణములు ఒక దానితో ఒకటి కలియడం చేత ఇరవై నాలుగు తత్త్వాలు ఏర్పడ్డాయి అంటారు సాంఖ్యులు. అవే చతుర్వింశతి తత్త్వములు. వీటి సమిష్టి రూపమే దృశ్యమాన ప్రపంచము. ఈ ఇరవై నాలుగు తత్త్వాలే దేహము ఉత్పన్నం కావడానికి కారణము.

పురుషుడు నిర్వికారుడు. చేతన స్వరూపుడు. ప్రకృతి వికారయుతము. జడరూపము. ప్రకృతి గుణాత్మకము. పురుషుడు గుణ రహితుడు. వీరిరువురి సంయోగము వల్లనే జగత్తు ఉత్పన్నమైంది అని సాంఖ్యమతము. చతుర్వింశతి తత్త్వములు మరియు పురుషుడు కలిసి ఇరవై ఐదు తత్త్వములు అంటూ వాటిని పంచవింశతి తత్త్వములు అని కూడా వారు పిలుస్తారు. దేహీ దేహములు ఈ ఇరవై ఐదు తత్త్వముల సంయోగమే నని సాంఖ్యుల అభిప్రాయము. వారి దృష్టిలో ప్రకృతి పురుషులు ఇరువురూ సత్యమే.

గుణ రహితుడు, శుద్ధ చైతన్య రూపుడు అయిన పురుషుడు త్రిగుణాత్మకమైన ప్రకృతి సంయోగము వలన గుణ సహితుడుగా తెలుస్తాడు. ఇదే బంధము. పురుషుడు ప్రకృతి బంధము నుండి విడి పడటమే మోక్షము అనేది సాంఖ్యుల సిద్ధాంతము.

జ్ఞానము వల్లనే మోక్షము ప్రాప్తిస్తుంది అని సాంఖ్యులు కూడా చెబుతారు (***జ్ఞానాన్ముక్తిః*** *- సాంఖ్య సూత్రము: 3 - 2*). ఇక్కడ జ్ఞానము అంటే, త్రిగుణాత్మకమైన ప్రకృతి కంటే తాను వేరు అని తెలియడమే.

ప్రకృతిని స్వతంత్ర మైనదిగా, స్వయంభువుగా వేదాంతము అంగీకరించదు. అలాగే, వేదాంతము ప్రతిపాదించే పురుషుడు ఒక్కడే గాని సాంఖ్యము చెప్పినట్లు అనేకులు కారు. ప్రకృతి పురుషుల సంయోగము వల్లనే జగత్తు ఉత్పన్నమైంది అని సాంఖ్యులు చెబితే, బ్రహ్మము నుండే జగత్తు ఉత్పన్నమైంది అని వేదాంతులు చెబుతారు.

## సందర్భము

క్షేత్రక్షేత్రజ్ఞుల సంయోగము చేతనే సృష్టి ఉత్పన్నమైంది అని పదమూడవ అధ్యాయంలో చెప్పబడింది *(13 వ అ - 26 వ శ్లో )*. మరి, జగత్కారణంగా తెలుస్తూ ఉన్న ఈ క్షేత్రక్షేత్రజ్ఞులు లేక ప్రకృతి పురుషులు సాంఖ్యులు చెబుతున్నట్లు స్వతంత్రులా? లేక, వేదాంతులు చెబుతున్నట్లు ఈశ్వరాధీనులా? అనే విషయం సుస్పష్టం కావాలి. అది ఈ పద్నాల్గవ అధ్యాయంలో విశద మవుతుంది.

అలాగే, ప్రకృతి గుణాలతో సంగత్వము ఏర్పడటమే పురుషుని సంసారానికి హేతువు అని కూడా చెప్పబడింది *(13 వ అ - 21 వ శ్లో )*. ఈ గుణ సంగము కూడా స్పష్టం కావలసి ఉంది.

ఏ గుణము నందు ఏ విధమైన సంగము ఏర్పడుతుంది (***కస్మిన్ గుణే కథం సంగః***) ? అసలు గుణాలు అంటే ఏమిటి? అవి ఏవి (***కేవా గుణాః***)? గుణాలు ఎలా బంధిస్తాయి (***కథం వా తే బధ్నన్తి***)? ఈ గుణాల నుండి విముక్తిని పొందేది ఎలా (***గుణేభ్యః చ మోక్షణం కథం స్యాత్***)? ముక్త పురుషుని యొక్క లక్షణా లేమిటి (***ముక్తస్య చ లక్షణం వక్తవ్యం***)? ఇవన్నీ తెలియ దగినవి. వీటి నన్నిటిని చెప్పవలసిన అవసరం ఉంది. అందుకే ఈ గుణత్రయ విభాగ యోగము అనే పద్నాల్గవ అధ్యాయము ఆరంభ మవుతూ ఉంది.





## గుణ సంగము - గుణాతీతము

వికారాలు, గుణాలు ప్రకృతి సంభవాలని ఇప్పటికే తెలుసుకున్నాం *( 13 వ అ - 19 వ శ్లో )*. కార్యాన్ని కారణం విడిచి పెట్టదు. కారణాన్ని విడిచి కార్యం ఉండలేదు. ప్రకృతి వలన ఏర్పడిన గుణాలలో ప్రకృతి లక్షణాలే ఉంటాయి. ప్రకృతి బంధహేతువు. కనుక, ప్రకృతి సంభవాలైన గుణాలు కూడా బంధహేతువులే.

గుణము అంటే ముడి లేక త్రాడు అని కూడా అర్థము. ఏదయితే పురుషుని సంసారానికి బంధిస్తూ ఉందో అదే గుణము. ఇలా చూచి నపుడు ఇది గుణమో, దోషమో కూడా అర్థం కాదు. గుణ సంగమే సంసార కారణము (***కారణం గుణసంగోఽస్య***). గుణ సంగం చేత పురుషుడు బద్ధు డయ్యాడు. కనుక గుణ విముక్తితో ముక్తు డవుతాడు.

అర్జునా! వేదము నందలి కర్మకాండ సమస్తమూ త్రిగుణ మిళితమైన సంసారాన్ని గూర్చే చెబుతూ ఉంది. **నిస్త్రైగుణ్యో భవ** - అర్జునా! నువ్వు గుణాల నుండి విడిపడిపో! గుణాతీతుడవు కా! ఆత్మజ్ఞానివి కా! అని గీత - రెండవ అధ్యాయం సాంఖ్యయోగం, నలభై ఐదవ శ్లోకంలో ఆదేశించిన భగవంతుడు, అట్టి స్థితిని పొంది తరించే దెలాగో ప్రస్తుత అధ్యాయంలో బోధిస్తాడు.

## గుణ భేదము - అభేద తత్త్వము

జీవు లందరూ ఒకే చైతన్యము నుండి ఆవిర్భవించి నపుడు, అందరూ ఒకే విధంగా లేకపోవ డానికి, వారి ప్రవర్తనములో వ్యత్యాసాలు గోచరించ డానికి కారణ మేమిటి? కార్యము నందు ఉన్నది కారణమే అయినపుడు, ఒకే కారణము నుండి ఉత్పన్నమైన కార్యాలలో భేదాలు ఎందుకు గోచరిస్తున్నాయి? అనేది చక్కని ప్రశ్న. ఈ ప్రశ్నకు తృప్తికరమైన రీతిలో సమాధానం ఈ అధ్యాయంలో లభిస్తుంది.

జీవుల ప్రవర్తనలో భేదాలు గోచరించ డానికి ప్రకృతి జన్యమైన గుణాలే కారణము కాని ఈశ్వర చైతన్యం కారణం కాదు. గుణభేదాలే కాని, చైతన్యములో భేదాలు లేవు. చైతన్యం సదా అభేదమే. అఖండమే.

విద్యుద్దీపాలు ప్రకాశిస్తూ ఉంటాయి. కొన్ని దీపాలు శ్వేత కాంతితో, కొన్ని అరుణకాంతితో, మరి కొన్ని నీలి వర్ణంతో వెలుగుతూ ఉంటాయి. వివిధ రంగులలో కాంతి విరజిమ్మ బడటానికి ఆయా దీపాల వర్ణములే కారణం కాని విద్యుచ్ఛక్తి కాదు కదా! విద్యుచ్ఛక్తిలో రంగు ఉందా? అలాగే, వ్యక్తులలో తెలుస్తున్న భేదాలకు ప్రకృతి జన్యమైన గుణాలే కారణం కాని, చైతన్యము మాత్రము కాదు.

జీవులలో రూప భేదాలకు, క్రియా రూప భేదాలకు కూడా గుణాలే ముఖ్య కారణము. ఒక గుండ్రని గాజుపాత్రలో నీరు నింపితే, పాత్ర లోని నీరు వలయాకారంగా అగుపిస్తుంది. చతురస్రంగా ఉండే గాజుపాత్రలో నీరు నింపితే ఆ నీరు చతురస్రాకారంలో కనిపిస్తుంది. వాస్తవానికి, ఈ కనిపించే రూపాలన్నీ పాత్రలకు సంబంధించినవే గాని నీటికి సంబంధించినవి కావు. నీటికి రూపము లేదు, ఆకారము లేదు. అలాగే చైతన్యము సదా అరూపమే. రూప భేదాలు, క్రియా రూప భేదాలన్నీ గుణ సంగములే.

## గుణత్రయ విభాగము

మూడు విధాలైన గుణ వికారాలే ఈ సమస్త ప్రపంచము అని తెలుసుకొని ఉన్నాం (***త్రిభిర్గుణ మయైః భావైః***: *7 వ అ - 13 వ శ్లో* ). వికారము అంటే మార్పు. గుణాలన్నీ వికారాలే. మార్పు చెందేవే. మార్పు చెందేవి ఏవయినా అనిత్యాలే. విశేషాలే.

విశేషంగా ఏదున్నా దానికి ఆధారంగా సామాన్యం ఉండాలి. విశేష మేదైనా అది సామాన్యంలో ఉంటుందే గాని, సామాన్యం విశేషంలో ఇమడ లేదు.

కెరటం విశేషము. కడలి సామాన్యము. విశేషమైన కెరటం కడలిలో ఉంటుందే గాని, సామాన్యమైన కడలి కెరటంలో ఇమడ లేదు.

గుణ వికారాలతో విశేషంగా ఏ దృశ్య ప్రపంచము మనకు గోచరిస్తూ ఉందో, వాస్తవానికి అదంతా సామాన్యము యొక్క వికారమే. విశేషమే.

కనుక వికారాలుగా తెలిసే గుణ విశేషాలతో కూడిన ఈ ప్రపంచము సామాన్య సత్తా స్వరూపమైన చైతన్యానికి భిన్నంగా లేదు.

కాని, ప్రస్తుతం మన అనుభవం మరో విధంగా ఉంది. మనకు వికారాలు, విశేషాలు తెలుస్తున్నాయే గాని, అవి దేని విశేషాలో ఆ సామాన్యము మనకు అర్థం కావడం లేదు. కారణం, మన బుద్ధి త్రిగుణాలలో తగులుకొని ఉంది. త్రిగుణ మిళితమైన మాయ చేత కప్పబడి ఉంది. మాయ దాట శక్యం కాకుండా ఉంది ***(మమ మాయా దురత్యయా)***. మాయలో చిక్కుకున్న వారు మాయ నుండి బయట పడలేరు. వికారయుత మైన మాయను, విశేషంగా కనిపిస్తున్న ప్రపంచాన్ని, వాటికి మూలమైన సామాన్య సత్తారూప చైతన్యాన్ని అనుభూత మొనర్చుకున్నపుడే, ఈ మాయారూప ప్రపంచాన్ని విశేషంగా చూడగలం.

ప్రపంచాన్ని పరిశీలించి, పరీక్షించి అర్థం చేసుకుంటే, ఈ ప్రపంచము గుణమయంగా ఉందని, త్రిగుణమయంగా ఉందని అర్థ మవుతుంది. త్రిగుణములు అంటే సత్త్వ రజ స్తమో గుణాలు. బాహ్య ప్రపంచంలోని వస్తువులలో గాని, మన దేహేంద్రియ మనోబుద్ధులలో గాని ఉన్న వన్నీ గుణమిళితం గానే ఉన్నాయి.

**సత్త్వగుణము**

'సత్' అంటే యథార్థముగా ఉండేది, లేదా సత్యము. దానికి సంబంధించిన భావమే సత్త్వము ***(సతో భావః సత్త్వమ్, తత్ జ్ఞాన హేతుః)***. కనుక సత్త్వం అనేది జ్ఞానానికి కారణము అని తెలుస్తూ ఉంది. సత్త్వం కూడా గుణమే; కాకపోతే సుగుణము. ఇది జ్ఞానానికి, సుఖానికి మార్గాన్ని సుగమం చేస్తుంది ***(జ్ఞాన సుఖ హేతుః)***.

సత్త్వగుణము కలవారు సాధుత్వముతో ప్రకాశిస్తారు ***(సత్త్వం సాధుత్వ ప్రకాశనం)***. సత్త్వము జ్ఞాన ప్రధానమైన గుణము కనుక, దీని యందు రజోగుణ తమోగుణాలు నశిస్తాయి ***(సీదంతి అస్మిన్ గుణాదయః ఇతి సత్త్వం)***. కనుక సత్త్వగుణం కల పుణ్యాత్ములు ప్రశాంతంగా, పవిత్రంగా, ప్రకాశంతో శోభిస్తూ ఉంటారు. సత్త్వగుణము నిర్మలత్వాన్ని ప్రసాదిస్తుంది ***(సాత్త్వికం నిర్మలం ఫలం)***.

**రజోగుణము**

రజోగుణము కేవలం కర్మ ప్రధానంగా ఉంటుంది. రజస్సు అంటే ధూళి అని కూడా అర్థం. కర్మ మాలిన్యాన్ని కలిగించేది, కరిపించేది రజోగుణము. ఇది కామ ప్రధానమైన గుణము. రాగ ప్రధానంగా ఉండే గుణము ***(రజో రాగాత్మకం)***. రజోగుణమే మనిషిని రాగయుక్తుని చేస్తుంది ***(రంజయతీతి రజః)***. రాగమునకు విఘాతం కలిగి నపుడు ఆ రాగమే ద్వేషంగా మారుతుంది. ఈ విధంగా రాగద్వేషాలను కలిగించి రజోగుణము దుఃఖానికి కారణ మవుతుంది ***(రంజయతీతి రజః, తద్దుఃఖ కారణమ్!)***. రజోగుణము దుఃఖ ఫలాన్నే అందిస్తుంది ***(రజసస్తు ఫలం దుఃఖమ్)***.

**తమోగుణము**

క్రియా శూన్యతను కలిగించేది తమోగుణము. తమోగుణము వల్లనే సోమరితనము కలుగుతుంది. తమస్సు అంటే చీకటి అని అర్థము. చీకటిలో మనిషికి ఏమీ కనిపించదు. చీకటి కాలంలో మనిషి ఏదీ





చేయలేడు, నిద్రించడము తప్ప. తమోగుణము కలవాడు క్రియాశూన్యుడై, జ్ఞానహీనుడై సోమరిపోతు అవుతాడు. మోహంలో కూరుకు పోతాడు. గ్లానిని పొందుతాడు ***(తము గ్లానౌ)***. తమోగుణమే మోహ కారణము ***(తస్మోహ బీజమ్)***. అధోగతి చెందడానికి తమోగుణమే కారణము.

ప్రకృతి స్వభావాలైన ఈ త్రిగుణముల సమ్మేళనమే మనిషి. ఏ సమయంలో కూడా మనిషి ఈ గుణాల నుండి విడిపడి ఉండ లేడు. కాకపోతే, ఒక్కొక్క సమయంలో ఒక్కొక్క గుణము ప్రధానంగా గోచరిస్తూ ఉంటుంది. ఏ గుణము ప్రధాన భూమికను పోషిస్తూ ఉంటే, దానికి అనుగుణంగా మనిషి ప్రవర్తిస్తూ ఉంటాడు.

కొన్ని సమయాలలో మనిషి చక్కని ఆలోచనలతో, మహోన్నతమైన భావాలతో శోభిస్తూ ఉంటాడు. ఆ సమయంలో అతని మనస్సులో సత్త్వగుణం ప్రధానంగా ఉందని అర్థము. మిగిలిన రెండు గుణాలు అముఖ్యంగా ఉన్నాయని అర్థము.

కొన్ని పరిస్థితులలో మనిషి శక్తిమంతుడై, క్రియాశీలుడై కర్మరంగంలో పరుగులు పెడుతూ ఉంటాడు. ఆ పరిస్థితులలో అతని మనస్సులో రజోగుణం ప్రధానంగా ఉందని, మిగిలిన రెండు గుణాలు అముఖ్యంగా ఉన్నాయని అర్థము.

సాధారణంగా క్రియా శూన్యతను పొంది, నిద్ర, అలసత్వాది లక్షణాలతో కనిపించే వ్యక్తిలో ప్రధానంగా తమోగుణమే ఉంటుంది. మిగిలిన రెండు గుణాలు అముఖ్యంగా ఉంటాయి.

అలాగని ఒక వ్యక్తిలో సదా సత్త్వమే ఉంటుందని, లేదా రజస్సే ఉంటుందని, లేదా తమస్సే ఉంటుందని చెప్పలేము. అవి మార్పు చెందుతూ ఉంటాయి. ప్రకృతి ఎలా మార్పు చెందుతూ ఉంటుందో, ప్రకృతి సంభవాలైన గుణాలు కూడా మార్పు చెందుతూ ఉంటాయి.

ఈ గుణాలను అధిగమించి గుణాతీత స్థితికి చేరి పోవాలి. ఈ సాధన సోపానక్రమంగా సాగాలి. తమోగుణ ప్రధానంగా జీవించే వారు, కర్మరంగంలో ప్రవేశించి, తమస్సు నుండి రజస్సుకు ప్రాకాలి. రజోగుణ ప్రేరితులై కర్మరంగంలో పడి కొట్టుకు పోయేవాళ్ళు, సరళ స్వభావులై, సచ్చింతనాపరులై, రజస్సు నుండి సత్త్వానికి ఎగబ్రాకాలి. సత్త్వగుణ ప్రధానులైన వారు తత్త్వ విచారము ద్వారా జ్ఞానమును సముపార్జించి గుణాతీతులు కావాలి. అదెలాగో తెలిపే అధ్యాయమే గుణత్రయ విభాగ యోగము.

ప్రకృతి, లేదా మాయ అనే తల్లికి కలిగిన ముగ్గురు బిడ్డలే ఈ త్రిగుణాలు. మూడూ మాయా సంభవాలే. మాయా స్వభావాలే. తమోగుణంతో నిద్రించే వాడు కుంభకర్ణుడు. రజోగుణంతో విజృంభించే వాడు రావణుడు. సత్త్వగుణంతో శోభించే వాడు విభీషణుడు. విభీషణుడు రజ స్తమోగుణ స్వభావులైన రావణ కుంభకర్ణులను విడిచి పెట్టి, సత్త్వగుణ ప్రధానుడై భక్తి చేసి, గుణాతీతుడైన శ్రీరాముని చేరి తరించి పోయాడు. ఇదెలాగో ఈ అధ్యాయం బోధిస్తుంది.

గుణయుతుడే కర్త, గుణాతీతుడే అకర్త అనే సమ్యక్ జ్ఞానము ఈ అధ్యాయంలో ఏర్పడుతుంది. కనుక ఈ గుణత్రయ విభాగ యోగము సాధకులకు అత్యంత ఉపయుక్తమైన అధ్యాయము.

కారు నడిపే వాడు, కారు యంత్రానికి సంబంధించిన సాంకేతిక పరిజ్ఞానము కూడా కలిగిన వాడైతే, కారు చెడిపోయి, కదలకుండా ఆగిపోయినా, దానిని బాగు చేసుకొని మళ్ళీ ప్రయాణాన్ని సాగించ గలడు. అలాగే, గుణాల చేత ప్రేరితులై, పరుగు లెడుతూ, గుణదోషాల మధ్య అలమటిస్తూ సామాన్యులు ఉంటే, గుణత్రయానికి సంబంధించిన జ్ఞానము కలిగిన సాధకుడు గుణదోషాలను సరి చేసుకొని ఋజు మార్గంలో పయనించి గమ్యాన్ని చేర గలుగుతాడు. ప్రయాణం చేసే వారికి ఇంతకన్నా ఏమి కావాలి ? అయితే చదవండి.

**శ్రీ భగవానువాచ :**

పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞాన ముత్తమమ్ ।
యత్ జ్ఞాత్వా మునయః సర్వే పరాం సిద్ధి మితో గతాః ॥ 1

*పరం-భూయః-ప్రవక్ష్యామి-జ్ఞానానాం-జ్ఞానం-ఉత్తమం*
*యత్-జ్ఞాత్వా-మునయః-సర్వే-పరాం-సిద్ధిం-ఇతః-గతాః*

| | | | | | |
|---|---|---|---|---|---|
| యత్ | = | దేనిని | గతాః | = | పొందిరో |
| జ్ఞాత్వా | = | గ్రహించి | పరం | = | శ్రేష్ఠమైన |
| సర్వే | = | సమస్తమైన | జ్ఞానానాం | = | జ్ఞానములలో |
| మునయః | = | మునులు | ఉత్తమం | = | ఉత్తమ మైనది |
| ఇతః | = | ఈ సంసారమున | జ్ఞానం | = | విద్యను |
| పరాం | = | ఉత్తమమైన | భూయః | = | మరల |
| సిద్ధిం | = | సిద్ధిని | ప్రవక్ష్యామి | = | చెబుతున్నాను |

**శ్రీ భగవంతుడు చెబుతున్నాడు :**

**అర్జునా! విద్యలలో శ్రేష్ఠమైన ఉత్తమ విద్యను మళ్ళీ నీకు చెబుతున్నా. ఈ జ్ఞానాన్ని పొందినవారు ఉత్కృష్టమైన మోక్షాన్ని పొందారు.**

### వ్యాఖ్య

అర్జునుని ప్రశ్న కొరకు నిరీక్షించకుండా స్వయంగా భగవంతుడే విషయాన్ని ఆరంభించిన అధ్యాయాలలో ఇదొకటి. స్వయంగా ప్రారంభించడమే గాక, ఈ అధ్యాయంలో ప్రస్తావిస్తున్న విషయం క్రొత్త దేమీ కాదు, పూర్వం చెప్పినదే అని కూడా చెబుతున్నాడు. పూర్వం ఏదైతే చెప్పబడిందో, దానినే ప్రస్తుతం విస్పష్టంగా వివరిస్తున్నాను అంటున్నాడు *(భూయః ప్రవక్ష్యామి)*.

### ఉత్థాప్య ఉత్థాపకత్వము

భగవద్గీత శ్రీకృష్ణార్జునుల సంవాద రూపంలో సాగిపోతున్న తాత్త్విక విషయము. అర్జునుని సందేహాలను నివారిస్తూ సిద్ధాంతమును ప్రతిపాదిస్తున్న మహోత్తమ గ్రంథము. కనుక అధ్యాయ విషయ ప్రస్తావన అనేది అర్జునుడు లేవనెత్తే ప్రశ్న బీజముపై ఆధారపడి ఇంత వరకు సాగుతూ వచ్చింది. అలా కాకుండా, కొన్ని అధ్యాయాలలో అర్జునుడు ప్రశ్నించక పోయినా, అర్జునుని అంతరంగాన్ని అర్థం చేసుకొని స్వయంగా భగవంతుడే విషయాన్ని ప్రస్తావించి భాషించడము, మరి కొన్ని చోట్ల పూర్వాధ్యాయాలలో విడిచి పెట్టిన విషయాలను తిరిగి లేవనెత్తి ప్రసంగించడం కూడా చూశాం.

కాని, ఈ అధ్యాయారంభములో అర్జునుని ప్రశ్న లేదు. అలాగే అర్జునుని అంతరంగమును అవలోకించి గాని, లేదా పూర్వాధ్యాయాలలో త్యజించిన విషయమును అంది పుచ్చుకొని బోధించడం గాని లేదు. అంటే, విషయం పూర్వాధ్యాయాలలో చెప్పినదే. దానినే మళ్ళీ *(భూయః పునః)* ప్రవచిస్తున్నాడు *(ప్రవక్ష్యామి)* అని అర్థం.

చెప్పిన విషయాన్నే తిరిగి చెప్ప వలసిన అవసర మేమిటి? అలా చెప్పడం వెనుక అసలు సంగతి





ఏమిటి? నిజంగానే ఇక్కడ ఒక సంగతి ఉంది. దానినే శాస్త్రంలో **ఉత్థాప్య ఉత్థాపకత్వ రూప సంగతి** అంటారు. ఉత్థాపకము అంటే లేపడము, లేదా అభిరుచిని కలిగించడము అని అర్థము. ఉత్థాప్యము అంటే, అలా ప్రేరేపించిన దానిని పరిష్కరించడము, లేదా కలిగించిన ఆకాంక్షను పూరించడము అని అర్థము. దీనినే 'ఉత్థాప్యోత్థాపకత్వము' అని అంటారు.

ప్రస్తుతము ఏ జ్ఞానమును భగవంతుడు పూర్వాధ్యాయాలలో అనేక చోట్ల, అనేక విధాలుగా చెప్పి ఉన్నాడో ***(పూర్వేషు అధ్యాయేషు అసకృత్ ఉక్తం)*** దానినే మళ్ళీ ***(భూయః పునః)*** ప్రవచిస్తున్నాడు ***(ప్రవక్ష్యామి)***. కారణము, ఆ జ్ఞానము ఉత్థాప్యము కావడమే. ప్రస్తావించ దగినది, లేదా లేవనెత్త దగినది కావడమే. అందుకనే 'వక్ష్యామి', వచిస్తున్నాను అనకుండా 'ప్రవక్ష్యామి', ప్రవచిస్తున్నాను అంటున్నాడు. సర్వ శ్రేష్ఠమైన విషయం కావడమే అలా ప్రస్తావించడం వెనుక ప్రముఖమైన కారణము. శ్రోత యొక్క బుద్ధిలో రుచిని ప్రేరేపించడం కొరకే ఇలా చెప్పవలసి వస్తుంది ***(శ్రోతృ బుద్ధి రుచ్యుత్పాదనార్థమ్)***. ఇంతకీ పరమేశ్వరుడు ప్రస్తావిస్తున్న జ్ఞానం ఏమిటి? దానిని రెండు విశేషణాలతో చెబుతున్నాడు. ఒకటి *పరం*, రెండవది ***ఉత్తమం***.

### పరమాత్మ విషయం

'పరమ్' అంటే ఉత్కృష్ట మైనది ***(పరమే ఉత్కృష్టే)***. జ్ఞానము ఉత్కృష్ట మైనది అన్నప్పుడు ఏ జ్ఞానము? అనే ప్రశ్న పుడుతుంది. జ్ఞానము ఏదైనా అది స్పష్టతను కలిగిస్తుంది కనుక ఉత్కృష్టమే. కాని, అన్ని జ్ఞానాల లోకి ఏది ఉత్కృష్టంగా చెప్పబడిందో అదే ఇక్కడ 'పరమ్' అని, 'ఉత్తమమ్' అని చెప్పబడుతూ ఉంది ***(సర్వేషాం జ్ఞానానామ్ ఉత్తమమ్)***. అదే పరంజ్ఞానం లేదా పరావిద్య. దాని కన్నా అన్యమైనవి అపరావిద్యలు.

**ద్వే విద్యే వేదితవ్యే, పరా చైవాపరా చ !**

తెలియ దగిన విద్యలు రెండే ఉన్నాయి. ఒకటి పరవిద్య, రెండవది అపరవిద్య అని ముండకోపనిషత్తులో అంగిరస మహర్షి శౌనకునికి చెబుతాడు.

పరమాత్మకు సంబంధించిన విద్య పరవిద్య. పరవిద్య కాని ఇతర విద్యలన్నీ అపరవిద్యలే. అపర విద్య లన్నీ విషయ సంబంధ మైనవి. పరవిద్య ఒక్కటే 'విషయి'కి సంబంధించినది. కనుక అది ఆత్మ విషయం. పరమాత్మ విషయం. మోక్షమే లక్ష్యముగా గలది.

అపరావిద్య లన్నీ ప్రకృతి, లేదా క్షేత్ర సంబంధ మైనవి. ఇవన్నీ మనస్సు చేత తెలియ బడుతాయి. పరావిద్య పురుష, లేదా క్షేత్రజ్ఞ సంబంధమైన జ్ఞానమును ప్రసాదిస్తుంది. కనుక, మనస్సు చేత కాకుండా మనస్సులో తెలియ బడుతుంది. ఇది చాలా సూక్ష్మంగా గ్రహించ వలసిన విషయము. అందుకే ఈ జ్ఞానమును అన్ని జ్ఞానముల లోకి ఉత్తమమైన జ్ఞానముగా అభివర్ణించడము జరిగింది.

***అహం ఘటం జానామి*** - 'నేను కుండను తెలుసుకుంటున్నాను' అనే వాక్యమును పరిశీలిస్తే, ఇక్కడ కుండకు సంబంధించిన జ్ఞానము మనకు కలగడంలో మూడు విషయాలు చోటు చేసుకొని ఉన్నాయి. (1)'నేను' ***(అహం)*** అనే దానికి సంబంధించిన సంకల్ప విషయము (2) కుండ ***(ఘటం)*** యొక్క రూపానికి సంబంధించిన వృత్తి విషయము (3) ఘటమునకు సంబంధించిన జ్ఞానము కలుగుట ***(జానామి)*** అనే విషయము.

'నేను' అనే వృత్తి, లేదా సంకల్పము ఘటము యొక్క ఆకారమును పొందడము మొదట జరగాలి. ఇక్కడ విషయ భేదము ననుసరించి రెండు జ్ఞానములు అందుతున్నాయి. ఒకటి వృత్తి, రెండవది ఘటాకార

వృత్తి. అంత మాత్రము చేత ఘటజ్ఞానము కలుగుతుందా? ఘట ప్రకాశ ఫలరూపమైన జ్ఞానము కూడా కలగాలి. ఇదే ఫలవ్యాప్తి జ్ఞానము. ఇదే పరమాత్మ చైతన్య రూప జ్ఞానము. ఇదే జ్ఞానాలలో ఉత్తమమైన జ్ఞానము. సర్వులు దర్శింప దగిన పరమాత్మ రూప జ్ఞానము. అదే ఆత్మజ్ఞానము. దానిని దర్శించాలి.

*శ్లో ॥ పరాగర్థ ప్రమేయేషు యా ఫలత్వేన సంమతా ।*
*సంవిత్సైవేహ జ్ఞేయోఽర్థో వేదాంతోక్తి ప్రమాణతః ॥*

ఆ యా ప్రమేయ విషయాల యందు ఏ యే జ్ఞానము ఫలరూపంగా సమ్మతమో, అట్టి సంవిద్రూప చైతన్యమే ఉపనిషత్ వాక్య ప్రమాణము ద్వారా పొంద దగినది అని సురేశ్వరుల వార్తికము.

ఏ జ్ఞానమును అపరావిద్యల ద్వారా మనం పొందినా, ఆ జ్ఞానము వృత్తివ్యాప్తి, ఫలవ్యాప్తి అనేవి రెండూ ఏర్పడి నపుడే పొందు తున్నాము. కనుక అపరావిద్య లన్నీ ఫలవ్యాప్తి నిచ్చే వృత్తిజ్ఞానాలే కనుక అవి మనస్సు చేత పొందబడు తున్నాయి.

కాని, పరావిద్య దీనికి విలక్షణంగా శోభిస్తూ ఉంది. అపరావిద్యల చేత పొందబడే ఫలరూప జ్ఞానము విషయాలకు సంబంధించిన అజ్ఞానమును నివృత్తి చేస్తూ ఉందే గాని, 'విషయి'కి సంబంధించిన అజ్ఞానమును నివారించడం లేదు. ఘటద్రష్ట ఘటజ్ఞానమును పొందు తున్నాడే గాని, ద్రష్ట యైన తనకు సంబంధించిన జ్ఞానమును పొందలేక పోతున్నాడు. కనుక, స్వరూప అజ్ఞానము నుండి విముక్తిని పొంద లేకున్నాడు. స్వరూప అజ్ఞానమే బంధము. స్వరూప జ్ఞానమే మోక్షము. కనుక స్వరూప జ్ఞానమును పొంద వలసి ఉంది. ఈ జ్ఞానము విషయ జ్ఞానము లాంటిది కాదు. 'విషయి'కి సంబంధించిన జ్ఞానము. మోక్షరూప మైన జ్ఞానము. ఈ జ్ఞానమును గురువు ద్వారానే పొందాలి. గురువు అందించే ఈ జ్ఞానము కూడా ప్రమాణము ద్వారానే అందాలి. అందుకే మోక్ష జ్ఞానానికి శ్రవణమే ప్రధానమైన సాధనగా చెప్పబడింది.

**అప్రమేయ జ్ఞానము**

ఏ జ్ఞానము నైనా మనస్సు ద్వారానే పొందాలి. జ్ఞానమును పొంద డానికి మన వద్ద మరొక సాధనము లేదు. అపరా విద్యలను మనస్సు చేత పొందే విధానాన్ని, జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయ భేదము ననుసరించి (***అహం ఘటం జానామి***), వృత్తివ్యాప్తి, ఫలవ్యాప్తి అని తెలుసుకున్నాం. మరి, పరావిద్య అయిన మోక్ష విషయ జ్ఞానమును ఎలా తెలుసుకోవాలి? దేని చేత తెలుసుకోవాలి? మనస్సు చేతనే తెలుసుకోవాలి. మరో మార్గమే లేదు. అందుకనే **మనసై వానుద్రష్టవ్యం** - ఆత్మను మనస్సు ద్వారానే తెలుసుకోవాలి అన్నది బృహదారణ్యక శ్రుతి.

మనస్సు ద్వారా తెలుసుకోవడం అంటే వృత్తి జ్ఞానం కలిగి తీరాలి. వృత్తివ్యాప్తి జరిగి (***ఘటాకార వృత్తి***), ఫలవ్యాప్తి జరగడం ద్వారానే ఘట జ్ఞానము కలుగుతూ ఉంది.

ఇలాగే, ఆత్మజ్ఞానము కలగాలి అంటే, మొదట ఆత్మాకార వృత్తి ఏర్పడాలి. ఆత్మ అనే దానికి ఆకారము ఉందా? ఆకారమే లేనపుడు ఆత్మాకార వృత్తి ఎలా ఏర్పడుతుంది? ఆత్మాకార వృత్తి, లేదా బ్రహ్మాకార వృత్తి ఏర్పడ నపుడు, వృత్తి లేకుండా వృత్తి జ్ఞాన మెలా పుడుతుంది?

వృత్తి జ్ఞానము కలగాలి అంటే వృత్తి ఏర్పడక తప్పదు కనుక, ఆత్మ విషయంలో కూడా వృత్తి ఏర్పడక తప్పదు. అదే ఆత్మాకార వృత్తి. ఈ ఆత్మాకార వృత్తి ఏర్పడటానికి ఆత్మ దృశ్యరూపంలో లేదు కనుక, బోధ రూపంలో వృత్తి తయా రవుతుంది. గురువు ఆత్మ యొక్క లక్షణాలను బోధించడం ద్వారా శ్రోత యొక్క బుద్ధిలో ఆత్మాకార వృత్తి జనిస్తుంది. ఈ విధంగా ఆత్మాకారవృత్తి, లేదా బ్రహ్మాకారవృత్తి మనస్సు చేత





కాకుండా మనస్సులో కలుగుతుంది. బుద్ధి చేత చూడ బడేది కాకుండా బుద్ధిలో చూడ బడుతుంది (***మనసా ఏవ అను ద్రష్టవ్యం***).

బుద్ధి చేత చూడబడే విషయాలన్నీ (అపరా) మార్పు చెందుతూ ఉంటాయి. అవి మారుతూ ఉండినా, వాటిని దర్శించే ద్రష్ట యొక్క చైతన్యములో ఏ విధమైన మార్పు లేదు.

కాని, బుద్ధిలో ఏ ఆత్మాకార వృత్తి ఏర్పడిందో (పరా) అది విషయాల వలె మార్పు చెందేది కాదు. అది ద్రష్టకు సంబంధించిన వృత్తి. అట్టి ఆత్మాకార వృత్తిని దర్శిస్తే, ఫలవ్యాప్తి కలిగి ఆత్మజ్ఞానం పుడుతుందా? పుట్టే అవకాశం లేదు. ఆత్మాకార వృత్తిని ఎవరు దర్శించాలి? ఆత్మాకార వృత్తికి ద్రష్ట ఎవరు? ద్రష్ట వేరుగా ఉంటే, అది విషయాకార వృత్తి అవుతుందే గాని, ఆత్మాకార వృత్తి కాలేదు. కనుక, ఆత్మ విషయానికి సంబంధించిన జ్ఞానబోధ వల్ల బుద్ధిలో ఆత్మాకార వృత్తి, లేదా బ్రహ్మాకారవృత్తి ఏర్పడుతుంది.

బుద్ధిలో బ్రహ్మాకార వృత్తి ఏర్పడుతుంది. అంటే, వృత్తివ్యాప్తి జరుగుతుంది. కాని, ఫలవ్యాప్తి జరగదు. ఫలవ్యాప్తి జరగడము అంటే, 'ఇది బ్రహ్మము' (***ఇదం బ్రహ్మ***) అనే జ్ఞానము కలగడము అని అర్థం. మరి, 'ఇది బ్రహ్మము' అనే జ్ఞానం ఎవరికి కలిగింది? ఎవరికి కలిగినా, అది కలిగిన వాడు బ్రహ్మమా? అబ్రహ్మమా? అబ్రహ్మమునకు బ్రహ్మ జ్ఞానము ఎలా ప్రాప్తిస్తుంది? బ్రహ్మమునకే ప్రాప్తిస్తుంది. కనుకనే 'నేను బ్రహ్మము' (***అహం బ్రహ్మ***) అంటాడే గాని 'ఇది బ్రహ్మము' (***ఇదం బ్రహ్మ***) అని అనడు. కారణం, బ్రహ్మోపదేశం వల్ల బ్రహ్మాకారవృత్తి బుద్ధిలో ఏర్పడి నపుడు దానిని తన కన్నా వేరుగా కాకుండా తన స్వరూపం గానే అనుభూతిని పొందుతున్నాడు. ఇదే జ్ఞానవృత్తి. ఈ జ్ఞానవృత్తి అజ్ఞాన వృత్తిని నిర్మూలిస్తుంది. ఈ విధంగా స్వరూప జ్ఞానం ఎవరికి కలుగుతుందో వారు బంధ విముక్త లవుతారు. ఇక్కడే కాస్త జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. ఇక్కడ పుట్టేది జ్ఞానమే గాని ఆత్మ కాదు. ఆత్మ ఎప్పుడూ ఉన్నదే. అది తెలియక పోవడమే అజ్ఞానము. అదే బంధము. ఆత్మోపదేశం వల్ల ఆత్మజ్ఞానం కలిగితే, ఆత్మ అజ్ఞానము, అజ్ఞాన జనిత బంధము, రెండూ నశిస్తాయి. జ్ఞానం స్వప్రకాశమై తేజరిల్లుతుంది.

కేవలం జ్ఞానరూపోఽహం కేవలం పరమోఽస్మ్యహం

నేను కేవలం జ్ఞానరూపుడను. నేను కేవలం పరముడను (సర్వోత్కృష్టుడను) అని తేజోబిందూపనిషత్తు.

**పరోత్తమం**

పరావిద్య ఒక్కటే మోక్ష ప్రదాయిని. అపరావిద్య లన్నీ విద్యలే అయినప్పటికి అవి మోక్షాన్ని ప్రసాదించ లేవు (***తాని న మోక్షాయ***). కనుకనే మోక్షాన్ని ప్రసాదించే ఈ జ్ఞానాన్ని పరమని, ఉత్తమ మని భగవంతుడు స్తుతిస్తున్నాడు (***ఇదం తు మోక్షాయ ఇతి పరోత్తమ శబ్దాభ్యాం స్తౌతి***). జ్ఞానాలలో ఉత్తమమైన జ్ఞానముగా దీనిని అభివర్ణిస్తున్నాడు.

ఏదైతే ఉత్తమ ఫలాన్ని ఇస్తుందో అదే ఉత్తమ జ్ఞానము. అట్టిది ఆత్మజ్ఞానమే గాని మరొకటి కాదు. మన వద్ద ధనం ఉంటే, అది వస్తువులను పొందడానికి ఉపకరించినట్లు, అపరావిద్య లన్నీ జన్మలను పొందడానికి, నూతన దేహాలను ధరించడానికి ఉపకరిస్తాయి. కాని, ఆత్మజ్ఞానము అనే పరావిద్య, నిద్రలో భయంకర మృగాల చేత పీడింప బడుతున్న వానిని క్షణంలో లేపి, ప్రకాశమును దర్శింప చేసి ప్రమోదమును కలిగించినట్లు, అక్షయ సుఖమును అనుగ్రహిస్తుంది. కనుక, ఇట్టి ఉత్కృష్టమైన ఫలమును ప్రసాదించేది కావడం చేతనే, ఆత్మజ్ఞానము సమస్త జ్ఞానాలలో పరమ మని, ఉత్తమ మని శ్లాఘింప బడింది (***సర్వేషాం జ్ఞానానామ్ ఉత్తమమ్, ఉత్తమ ఫలత్వాత్***).

**అమృత ఫలప్రాప్తి**

ప్రస్తుతము ఉపదేశిస్తున్న జ్ఞానము పరమాత్మకు సంబంధించిన విషయం కావడం చేత *(పరమ్)* అది ఉత్తమమైన ఫలాన్ని ప్రసాదిస్తూ ఉంది *(మోక్షం)*. అదే అమృతఫల సిద్ధి. ఈ అమృత ఫలప్రాప్తిని మునులు పొందుతారు.

మునులు అంటే మననశీలురు అని అర్థం. వారే యతి పురుషులు ***(మునయః మననశీలాః)***. మునులు అంటే సర్వజ్ఞులు అని కూడా అర్థం ***(మను అవబోధనే, మన్యతే మునిః )***. సర్వ జ్ఞానమును, సర్వాత్మ జ్ఞానమును పొందుతారు కనుక వారు సర్వజ్ఞులు. ఇక్కడే వారు పూర్ణ పురుషు లవుతారు. ముక్తపురుషు లవుతారు. మరొక దానిని తెలుసుకోవాలి అనే స్పృహను కలిగించే జ్ఞానం ఉత్తమ జ్ఞానం కాలేదు. ఏదైతే సమస్త బంధాల నుండి విడిపించి, స్వరూప జ్ఞానమును కలిగిస్తూ ఉందో, అదే అమృత ఫలా న్నందించే పరోత్తమ జ్ఞానము. కనుకనే, ఈ పరమాత్మ జ్ఞానమును పొందిన వారందరు ***(యత్ జ్ఞాత్వా, యత్ జ్ఞానం జ్ఞాత్వా ప్రాప్య)*** మోక్షమనే ఉత్కృష్ట మైన సిద్ధిని పొందుతారు అంటున్నాడు భగవంతుడు ***(పరాం సిద్ధిం గతాః ప్రాప్తాః)***. వారే మునులు. ముక్త పురుషులు. సర్వత్ర బ్రహ్మదర్శనం చేయువారు. జీవన్ముక్తులు.

***జగజ్జీవాది రూపేణ పశ్యన్నపి పరాత్మవిత్ ।***
***న తత్పశ్యతి చిద్రూపం బ్రహ్మవస్త్వేవ పశ్యతి ॥***

పరాత్మను తెలుసుకున్న వాడు ప్రపంచ రూపంలో, ప్రాణుల రూపంలో సమస్తమును చూస్తున్నప్పటికీ, అతడు ఆ దృశ్యజాలమును భేదబుద్ధితో చూడడు. బ్రహ్మవస్తువు గానే దర్శిస్తాడు అన్నది పాశుపత బ్రహ్మోపనిషత్తు.

*ఇట్టి పరోత్తమమైన అమృత ఫలసిద్ధి అందరికీ సిద్ధిస్తుందా? తప్పక సిద్ధిస్తుంది. సందేహించ నవసరం లేదు. వినండి.*

ఇదం జ్ఞాన ముపాశ్రిత్య మమ సాధర్మ్య మాగతాః ।
సర్గేఽపి నోపజాయన్తే ప్రలయే న వ్యథన్తి చ ॥ 2

***ఇదం-జ్ఞానం-ఉపాశ్రిత్య-మమ-సాధర్మ్యం-ఆగతాః***
***సర్గే-అపి-న-ఉపజాయంతే-ప్రలయే-న-వ్యథంతి-చ***

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఇదం | = | ఈ | ఆగతాః | = | పొందిన వారు |
| జ్ఞానం | = | జ్ఞానమును | సర్గే అపి | = | సృష్టి కాలము నందు కూడా |
| ఉపాశ్రిత్య | = | ఆశ్రయించి | న ఉపజాయంతే | = | తిరిగి పుట్టరు |
| మమ | = | నా యొక్క | ప్రలయే | = | ప్రళయకాలము నందు |
| సాధర్మ్యం | = | స్వరూపమును | న వ్యథంతి చ | = | దుఃఖమును పొందరు |

**ఈ జ్ఞానమును ఆశ్రయించి, నా స్వరూపమును పొందిన వారు సృష్టి కాలమున జన్మించరు. ప్రళయ కాలమున దుఃఖించరు.**

**వ్యాఖ్య**

**జ్ఞాన వైభవము**

జ్ఞానమును పొందిన వారు మోక్షమును పొందుతారు, పూర్ణత్వమును సిద్ధింప చేసుకుంటారు అని పూర్వ





శ్లోకంలో చూశాం. జ్ఞానమును పొందిన వారికి పూర్ణత్వము సిద్ధించింది అంటే, జ్ఞానమును పొందక ముందు వారు పూర్ణ స్వరూపులు కారని అర్థమా? అదే నిజమైతే, పూర్ణ స్వరూపులు కాని వారు అపరిపూర్ణులే కదా? అపరిపూర్ణులు అంటే పరిమితమైన వారే కదా! అలాంటప్పుడు వారికి పూర్ణత్వము ఎలా సిద్ధిస్తుంది?

పరిమిత మైనది అపరిమిత మెలా అవుతుంది? అపరిపూర్ణము పరిపూర్ణ మెలా అవుతుంది? అంతం కలిగినది అనంత మవుతుందా? అయ్యేందుకు అవకాశమే లేదు. అది అసంభవం. అయినా అది సంభవ మైంది అంటే, అంతకు పూర్వం అది అసంభవం కాకుండా ఉండాలి. సంభవ మయ్యే ఉండాలి. అంతకు మించి మరో అవకాశం లేదు. అపూర్ణ మైనది పూర్ణం కాదు. కాలేదు. పూర్ణమైంది అంటే మాత్రం అంతకు ముందు కూడా అది పూర్ణమయ్యే ఉండాలి.

నేను పూర్ణమయ్యే ఉండి, మళ్ళీ పూర్ణుణ్ణి కావాలని ప్రయత్నిస్తున్నాను అంటే, దాని అర్థ మేమిటి? నేను పూర్ణుణ్ణి అనే జ్ఞానం నాకు లేకుండా పోవడమే. నేనే పూర్ణము అని నాకు తెలియక పోవడం చేతనే, జపమాలను మెడ లోనే ఉంచుకొని ఊరంతా వెతికినట్లు, నేను పూర్ణత్వాన్ని పొందాలని ప్రయత్నిస్తున్నాను. ఇదీ సమస్య.

ఇలా అన్వేషించే వ్యక్తి సమస్యలో నిమగ్నమై ఉన్నాడు. నిజానికి ఇక్కడ సమస్య ఉందా? వస్తువును అన్వేషిస్తూ ఆందోళన చెందుతున్నాడు కనుక సమస్య ఉన్నట్లే ఉంది. వాస్తవానికి వస్తువు దూరం కాలేదు కనుక సమస్య లేనే లేదు. లేని సమస్య ఉన్నట్లు తెలుస్తూ ఉంది. ఇదీ ఒక విధమైన సమస్యే. కాకపోతే ఇది కల్పిత సమస్యే గాని, వాస్తవమైన సమస్య కాదు.

సమస్య వాస్తవ మైనపుడు దానిని ప్రయత్నము ద్వారా పరిష్కరించుకోవచ్చు. కాని లేని సమస్య ఉన్నట్లు గోచరించి నపుడు దానిని లేని దానినిగా అర్థం చేసుకోవాలి. అంతేగాని, ఉన్న దానినిగా నిర్ధారణ చేసి కర్మ ద్వారా తొలగించే ప్రయత్నానికి పూనుకోవడం అర్థ రహితం; వ్యర్థం.

నాకు సంబంధించిన జ్ఞానం లేకపోవడమే నా సమస్య అని తేలినపుడు, నాకు సంబంధించిన జ్ఞానము నాకు కలగడమే దానికి ఏకైక పరిష్కారము. జ్ఞానమే అజ్ఞానమును నివృత్తి చేస్తుంది. నాకు సంబంధించిన సత్య జ్ఞానము నాకు కలిగితే, నాకు సంబంధించిన అజ్ఞానము, అట్టి అజ్ఞానము వలన ఏర్పడిన పరిపూర్ణ సిద్ధి కాంక్ష, రెండూ నశించి పోతాయి. కనుక పూర్ణత్వ సిద్ధికి ఏకైక తరుణోపాయము జ్ఞానమే ***(జ్ఞానాత్ మోక్షః)***. నేను పూర్ణుడను. ఎప్పుడు? ఇప్పుడే. ఇక్కడే. మరి అప్పుడు, అక్కడ? అప్పుడూ పూర్ణుడనే. ఇప్పుడూ పూర్ణుడనే. అక్కడా పూర్ణుడనే. ఇక్కడా పూర్ణుడనే ***(పూర్ణ మదః పూర్ణమిదం)***. అప్పుడు పూర్ణుడనే. కాని, పూర్ణుడను అనే జ్ఞానం లేని వాణ్ణి. ఇదే తేడా. పూర్ణుడ నైన నన్ను పూర్ణుణ్ణి చేసింది జ్ఞాన మొక్కటే. అదే జ్ఞాన మహిమ. కనుక పూర్ణ స్వరూపులై శోభించాలని ఆశించే వారు ఈ జ్ఞానమునే ఆశ్రయించాలి. ఆత్మజ్ఞానమును ఆశ్రయించిన వారు ఆత్మస్వరూపమును తప్పక పొందుతారు.

**జ్ఞానాశ్రయము**

అర్జునా! ఈ జ్ఞానమును ఆశ్రయించిన వారు ***(ఇదం జ్ఞానం ఉపాశ్రిత్య)*** నా స్వరూపాన్నే పొందుతారు ***(మమ సాధర్మ్యం ఆగతాః )*** అంటున్నాడు భగవంతుడు. జ్ఞానమును ఎలా ఆశ్రయించాలి? జ్ఞానమును ఆశ్రయించడము అంటే జ్ఞాన సాధనలను ఆశ్రయించడమే. జ్ఞానమును పొందడానికి అనువైన సాధన సామగ్రిని సంపాదించుకోవడమే. జ్ఞానాంగములను సిద్ధం చేసుకోవడమే. కనుక, జ్ఞానమును పొందడమే జ్ఞానాశ్రయము.

వెలుగు ఎన్నో కార్యాలు చేయదు. ఒకే పని చేస్తుంది. అంధకారమును అదృశ్యం చేస్తుంది. అదే

ప్రకాశము యొక్క ఏకైక కార్యము. అలాగే జ్ఞానము కూడా అజ్ఞానమును పోగొట్టడ మనే ఏకైక కార్యమును నిర్వహిస్తుంది. కనుక జ్ఞానమును పొందాలి.

జ్ఞానమును ప్రమ అంటారు. ప్రమను కలిగించేది ప్రమాణం. జ్ఞానము కలగాలి అంటే, జ్ఞానమును కలిగించే ప్రమాణము ఉండాలి. అదే శాస్త్రము. శాస్త్ర ప్రమాణము. శాస్త్రము అంటే వేదము. అదే వేద ప్రమాణము; ఉపనిష త్ప్రమాణము. ప్రమాణము ఉన్నప్పుడు ప్రమ కలగక పోయే అవకాశమే లేదు. కనుక జ్ఞానాన్ని పొందాలని అభిలషించే వారికి శ్రుతియే ప్రమాణము. శ్రుతియే శరణము (***శ్రుతి రేవ శరణ మితి***).

కనుక జ్ఞానాశ్రయము అంటే ప్రమాణ విచారమే ముఖ్య విషయముగా గలది అని అర్థము. ప్రమాణ విచార వ్యాపారములో శ్రవణ, మనన, నిదిధ్యాసనలు ప్రధాన మైనవి. వాస్తవానికి శ్రవణమే అత్యంత ముఖ్య మైనది. శ్రవణము అంగి. మనన నిదిధ్యాసనలు అంగములు. ఇవే జ్ఞాన సాధనములు. వీటిని ఆశ్రయించడం అంటే జ్ఞానమును ఆశ్రయించడ మని అర్థము (***జ్ఞానం ఉపాశ్రిత్య జ్ఞానసాధనమ్ అనుష్ఠాయ ఇత్యేతత్!***). జ్ఞానము కలిగితే మోక్షం సిద్ధిస్తుంది. బంధము తొలగి పోతుంది. నేను అపరిపూర్ణుడను అనే అజ్ఞానమే బంధానికి కారణం కనుక, నేను పూర్ణస్వరూపుడను అనే జ్ఞానము ప్రమాణం ద్వారా కలిగి నపుడు, అజ్ఞానము, అజ్ఞానము వలన ఏర్పడిన బంధము తొలగిపోయి, అద్వయమైన ఆత్మే నేను అనే అనుభూతి కలుగుతుంది. అదే స్వరూప స్థితి. ఆత్మస్వరూప స్థితి.

**స్వరూప ప్రకాశము**

జ్ఞానమును ఆశ్రయించిన వారు స్వరూపమును పొందుతారు. ఆత్మ, ఆత్మజ్ఞానము రెండు కావు. పరమాత్మ, పరమాత్మ జ్ఞానము రెండు కావు. పరమాత్మ జ్ఞానమును ఆశ్రయించిన వారు పరమాత్మ స్వరూపమును పొందుతారు. అర్జునా! ఈ జ్ఞానమును ఆశ్రయించిన వారు నా సాధర్మ్యాన్ని పొందుతారు (***మమ సాధర్మ్య మాగతాః***) అని గీతాచార్యుని మాట.

ఈ సందర్భములో 'సాధర్మ్యం' అనే మాటను జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. 'సాధర్మ్యం' అంటే సమాన మైన ధర్మాలు కలిగి ఉండటం అని కొందరు వ్యాఖ్యానించారు. అది సముచితం కాదు. సాధర్మ్యం అనే దానిని సమాన జాతి రూపాదిమత్త్వముగా గ్రహించడానికి వీలు లేదు.

ఒకే జాతికి సంబంధించిన రెండు వస్తువులలో ఒక దానికి మరొక దానికి మధ్య భేదము తెలుస్తూ ఉండినా, కొన్ని ధర్మాలు, లేదా లక్షణాలు సమానంగా ఉండే టప్పుడు దానిని సాధర్మ్యం అంటారు.

గో గవయముల మధ్య సాధర్మ్యం ఉంది. రెండూ ఒకే జాతికి సంబంధించినవి. ఆవుకు, ఎద్దుకు రెండిటికీ కొమ్ము లున్నాయి. రెండిటికీ తోక లున్నాయి. రెండిటికీ నాలుగేసి కాళ్ళు ఉన్నాయి. ఇవన్నీ సమాన ధర్మాలుగా కనిపించినా, ఆ రెండిటిలో పరస్పరం అనేక భేదా లున్నాయి. క్షీరదానము మొదలు సంతానోత్పత్తి వరకు గో గవయముల మధ్య సాధర్మ్యము లేదు.

పరమాత్మ నిర్గుణము, నిరవయవము, నిర్విశేషము, నిరాకారము. అట్టి అద్వయ పరబ్రహ్మమునకు సమాన జాతి రూపాదికాలు ఎలా సంభవిస్తాయి? కనుక, సాధర్మ్యము అంటే పూర్ణత్వము, లేదా స్వరూపము అనే అర్థమును గ్రహించాలి గాని, సమానధర్మము అనే అర్థమును గ్రహించడానికి వీలు లేదు (***సాధర్మ్యం మత్స్వరూపతామ్, ఆగతాః ప్రాప్తాః ఇత్యర్థః న తు సమాన ధర్మతాం సాధర్మ్యమ్***).

సాధర్మ్యం అంటే సమాన ధర్మాలు కలిగి ఉండటం అనే అర్థాన్ని గ్రహిస్తే, జీవేశ్వరుల మధ్య భేద దర్శనము జరుగుతుంది. అలా గ్రహించ బట్టే, కొందరు వ్యాఖ్యాతలు అద్వైతముతో విభేదిస్తూ వ్యాఖ్యలు





నడిపారు. ఈ విధమైన వ్యాఖ్యలు గీతా శాస్త్రానికి ఆమోదయోగ్యాలు కావు. క్షేత్రజ్ఞ ఈశ్వరుల మధ్య భేదాన్ని గీతాశాస్త్రము అంగీకరించదు (***క్షేత్ర జ్ఞేశ్వరయోః భేదానభ్యుప గమాత్ గీతాశాస్త్రే!***).

కనుక, 'నా సాధర్మ్యము' అంటే 'నా స్వరూపము' అనే భావము (***మమ సాధర్మ్యం మద్రూపత్వమ్*** ... శ్రీధరుని సుబోధినీ వ్యాఖ్య ). భగవద్గీత సప్తమాధ్యాయము పద్దెనిమిదవ శ్లోకంలో జ్ఞాని తానే నని భగవంతుడు స్వయంగా తెలిపి ఉన్నాడు కదా (***జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్***)!

సద్వస్తువులు రెండు ఉండ లేవు. సద్వస్తువు అద్వయమే. సద్వస్తువు అద్వయ మైనపుడు, సద్వస్తు జ్ఞానము కూడా అభేదము, అద్వైతమే గాని భేదము కాలేదు; ద్వైతము కాబోదు.

కనుక బ్రహ్మము అఖండము; బ్రహ్మజ్ఞానము కూడా అఖండమే. అదే పరమాత్మ జ్ఞానము. దానినే 'పరం' అని మొదటి శ్లోకంలో చూశాము. కనుక పరమాత్మను తెలుసుకోవాలని ప్రయత్నించే వాడు తానే పరమాత్మ అని తెలుసుకుంటాడు. ***బ్రహ్మవిదాప్నోతి పరమ్*** - బ్రహ్మమును తెలుసుకొనే వాడు తానే పరంబ్రహ్మము అని తెలుసుకుంటున్నాడు అని తైత్తిరీయ శ్రుతి అమోఘంగా ప్రవచించింది.

**జ్ఞాన ఫల ప్రశంస**

జ్ఞానమును ఆశ్రయించి, పరమాత్మ స్వరూపమును పొందిన వారు మళ్ళీ జన్మించరు (***న ఉపజాయన్తే న ఉత్పద్యన్తే***). అలాగే నశించి దుఃఖించరు (***న వ్యథన్తి వ్యథాం న ఆపద్యన్తే***).

***పునరపి జననం, పునరపి మరణం, పునరపి జననీ జఠరే శయనమ్*** అనే సంసార సాగరము నుండి బయట పడి తరిస్తారు. దేహి దేహముతో తాదాత్మ్యం చెంది ఉన్నంత వరకే జననమరణాలు ప్రాప్తిస్తూ ఉంటాయి. ప్రకృతి స్వరూపమైన క్షేత్రము నుండి విడిపడిన క్షేత్రజ్ఞుడు తానే ఈశ్వరుడు అనే జ్ఞానాన్ని పొందడం చేత దేహానికి పరిమితుడు కాడు. జననమరణాలు దేహానికే గాని దేహికి కావు కదా! అందుచేత ఆత్మజ్ఞాని పుట్టడు. అలాగే గిట్టడు. ఈ దివ్య స్థితి నుండి పతన మెరుగడు. ఈ విషయమును వేదము కూడా ప్రవచించింది. ఆత్మజ్ఞానమును దివ్యంగా ప్రశంసించింది.

***య ఏవ వేదాహం బ్రహ్మాస్మీతి స ఇదం సర్వం భవతి, సర్వస్య వశీ, సర్వస్యేశానః సర్వస్యాధిపతిః స న సాధునా కర్మణా భూయాన్, నో ఏవాసాధునా కనీయాన్,*** 'నేనే బ్రహ్మమును అని ఎవడైతే తన స్వరూపమును తెలుసుకుంటున్నాడో, వాడు ఈ సమస్త ప్రపంచము తానే అగుచున్నాడు. సర్వమును తన వశము నందు ఉంచుకుంటున్నాడు. సర్వమునకు ప్రభువు తానే అవుతున్నాడు. సమస్తమునకు తానే అధిపతి అగుచున్నాడు. అట్టివాడు పుణ్యకర్మల చేత శ్రేష్ఠుడు కాడు; పాపకర్మల చేత నికృష్టుడు కాడు' అని శ్రుతి ప్రబోధం.

*మొదటి రెండు శ్లోకాలలో జ్ఞానమును స్తుతించిన గీతాచార్యుడు, ఇక పద్నాల్గవ అధ్యాయము యొక్క కేంద్ర విషయమైన గుణత్రయము వైపు దృష్టిని పెడుతున్నాడు. గుణాలు జీవుని ఎలా బంధిస్తున్నాయో తెలిపే ఉద్దేశ్యముతో, ముందుగా క్షేత్ర క్షేత్రజ్ఞ సంయోగము ఎలా భూత కారణమో వివరిస్తున్నాడు.*

**మమ యోని ర్మహద్బ్రహ్మ తస్మి న్గర్భం దధా మ్యహమ్ ।** 3

**సమ్భవః సర్వభూతానాం తతో భవతి భారత ॥**

***మమ-యోనిః-మహత్-బ్రహ్మ-తస్మిన్-గర్భం-దధామి-అహం***

***సంభవః-సర్వభూతానాం-తతః-భవతి-భారత***

భారత = అర్జునా!

| | | | | | |
|---|---|---|---|---|---|
| మహత్ | = | గొప్పదైన | గర్భం | = | గర్భమును |
| బ్రహ్మ | = | బ్రహ్మ | దధామి | = | ఉంచుతున్నాను |
| మమ | = | నా యొక్క | తతః | = | ఆ కారణము చేత |
| యోనిః | = | కారణము | సర్వభూతానాం | = | సర్వభూతముల యొక్క |
| తస్మిన్ | = | దాని యందు | సంభవః | = | ఉత్పత్తి |
| అహం | = | నేను | భవతి | = | అవుతూ ఉంది |

**అర్జునా! గొప్పదైన ప్రకృతి నాకు గర్భస్థానము. దాని యందు నేను గర్భాధానం చేస్తాను. ఆ విధంగా సర్వ ప్రాణులు పుడుతున్నాయి.**

### వ్యాఖ్య

స్థావర జంగమాత్మకమైన ప్రాణి సముదాయ మంతా క్షేత్ర క్షేత్రజ్ఞుల సంయోగము వల్లనే పుడుతూ ఉంది అని పదమూడవ అధ్యాయంలో తెలుసుకున్నాం *( 13 వ అ - 26 వ శ్లో ).* సర్వభూతోత్పత్తి హేతుత్వము ఈశ్వరాధీనులైన క్షేత్రక్షేత్రజ్ఞులకే గాని, కాపిల సాంఖ్యము చెప్పినట్లు ఈశ్వర పరతంత్రులైన క్షేత్రక్షేత్రజ్ఞులకు లేదు అని మనం అధ్యాయ పీఠికలో చెప్పుకొనిన విషయాన్ని పరమేశ్వరుడు ఈ శ్లోకంలో సహేతుకంగా వివరిస్తున్నాడు.

### సంబోధనాశయము

సర్వభూతోత్పత్తి కారణాన్ని వివరిస్తున్న ఈ సందర్భములో అర్జునుని *భారతా!* అని సంబోధించడం గమనించ దగిన విషయం. భరత వంశము నుండి పుట్టిన వాడు కావడం చేత అర్జునుని భారతా! అని పిలుస్తున్నాడు. భవన ధర్మముల తోనే సర్వ ప్రాణులు ఉద్భవిస్తున్నాయి. అర్జునా! నీ జన్మ మెలాగో ఈ జగత్తు యొక్క పుట్టుక కూడా అలాంటిదే నంటూ, జగదుత్పత్తి కారణత్వాన్ని వివరిస్తున్నాడు.

### జననీ జనకులు

బిడ్డ తల్లి నుండి పుట్టినట్లు, ఈ ప్రపంచము ప్రకృతి, లేదా మాయ నుండి ఉద్భవించినది. మాయయే సర్వ ప్రపంచానికి జన్మస్థానము ***( యోనిః ).*** దీనిని 'నా ప్రకృతి' అంటున్నాడు అచ్యుతుడు ***( మమ యోనిః ).*** అంటే, 'నాకు సంబంధించిన ప్రకృతి' అని అర్థము. పరమేశ్వరుని ఆశ్రయించుకొని మనుగడను సాగిస్తున్న మాయ, లేదా ప్రకృతిని 'నా ప్రకృతి' అంటున్నాడు. ఏడవ అధ్యాయం - పద్నాల్గవ శ్లోకంలో కూడా **మమ మాయా** అనడం జరిగింది. ఇక్కడికే మనకు ఒక విషయం స్పష్ట మైంది. విశ్వోత్పత్తికి ఈశ్వరాధీన మైన ప్రకృతియే కారణం గాని, సాంఖ్యులు చెప్పే ఈశ్వర పరతంత్రమైన ప్రకృతి కాదు అనేది తేటతెల్ల మైంది.

ప్రకృతి, లేదా మాయను గొప్పదైన బ్రహ్మగా అభివర్ణించడం జరిగింది ***( మహద్బ్రహ్మ ).*** ఇక్కడ ***బ్రహ్మ*** అంటే త్రిగుణాత్మకమైన ప్రకృతి. ***మహత్*** అంటే గొప్పది అని అర్థము. భూతోత్పత్తి కారణంగా తెలుస్తున్న మాయ అటు ***మహత్*** శబ్దము చేత, ఇటు ***బ్రహ్మ*** శబ్దము చేత కూడా చెప్పబడుతూ ఉంది.

కార్య రూపంగా తెలుస్తున్న ఈ ప్రపంచానికి ప్రకృతి కారణము. తన నుండి పుట్టిన కార్యా లన్నిటి కంటే గొప్పది కావడం చేత, అంటే ఆకాశాది భూతాల కంటే సూక్ష్మ మైనది కావడం చేత ప్రకృతి ***మహత్*** అని పిలువ బడింది ***( సర్వ కార్యేభ్యః బృహత్త్వాత్ ).*** అట్టి మహత్తరమైన ప్రకృతి సర్వ ప్రాణులకు బృంహణముగా ఉంది. అంటే, బృంహణత్వ ధర్మముతో శోభిస్తూ ఉంది. పుట్టిన భూత ప్రపంచ వృద్ధికి కారణం కావడమే





బృంహణత్వ ధర్మము ***( భరణాత్ చ స్వవికారం ).*** గొప్పది కావడమే గాక, సర్వ కార్యాలను, వికారాలను భరించడం వల్ల ప్రకృతి **మహద్బ్రహ్మ** వాచ్యమైంది.

### జగద్బీజము

జీవోత్పత్తికి జననీజనకులు ఎలా అవసరమో, అలాగే జగదుత్పత్తికి కూడా జననీ జనకులు ఉండాలి. కర్మ బద్ధుడై ధాన్యాది రూపాలలో తన యందు ప్రవేశించి లీనమై ఉన్న జీవుని దేహధారిగా చేయడానికి పురుషుడు స్త్రీ యందు ఎలా గర్భాధానము చేస్తాడో, అలాగే అవ్యక్తంగా ఉన్న ప్రపంచము వ్యక్తం కావడానికి పరమేశ్వరుడు ప్రకృతి యందు గర్భాధానము చేస్తున్నాడు. సృష్టి కార్యాన్ని నిర్వహించడానికి ప్రకృతికి సత్తా స్ఫూర్తులను అనుగ్రహిస్తున్నాడు. ఇక్కడే జగద్బీజము, విశ్వబీజము, ఆది బీజము గోచరిస్తూ ఉంది.

కేవలం జన్మ నిచ్చే తల్లి ఉన్నంత మాత్రాన జీవోత్పత్తి జరగదు. గర్భాధానము చేసే తండ్రి కూడా ఉండాలి. అదే సృష్టి అంటే. ఉపాదాన నిమిత్త కారణాలు రెండూ ఉంటేనే సృష్టి కార్యము జరుగుతుంది. జగద్విస్తార హేతువైన విశ్వబీజమును ఉంచిన భగవంతుడు సర్వభూతోత్పత్తికి నిమిత్త కారణం కాగా, జగద్బీజమును అంకురింప చేసే ప్రకృతి ఉపాదాన కారణమైంది. జగత్తంతా ఉపాదాన కారణమైన ప్రకృతి పరిణామమే అయినా, జగత్తు నందలి జీవజ్యోతి నిమిత్త కారణమైన పరమేశ్వరునికి సంబంధించినది. మాయ, లేదా ప్రకృతి కూడా బ్రహ్మమునే ఆశ్రయించుకొని ఉన్నందున, ఈ సృష్టికి భగవంతుడు అభిన్న నిమిత్త ఉపాదాన కారణంగా తెలుస్తున్నాడు.

తైత్తిరీయ శ్రుతి ప్రవచించినట్లు, 'నేను అనేకంగా అవుతాను' ***( బహుస్యాం ప్రజాయే యేతి )*** అనే పరమేశ్వర సంకల్పమే హిరణ్యగర్భాది సమస్త భూతముల ఆవిర్భావమునకు ఆదిబీజము అని గ్రహించాలి. అంటే, ప్రపంచము విస్తరించ డానికి కారణమైన చిదాభాసమును లేదా చిచ్ఛక్తిని ప్రకృతి గర్భము నందు పరమేశ్వరుడు నిక్షిప్తం చేస్తున్నాడు ***( తస్మిన్ గర్భం అహం దధామి నిక్షిపామి ).*** ఈ విధంగా సర్వ భూతోత్పత్తి జరుగుతుంది. కేవలం మనం ప్రకృతి సంభవులమే అయితే, పగిలిన కుండ మట్టిగా మారినట్లు, చచ్చిన తరువాత శ్మశానంలో మట్టిలో మట్టిగా కలిసి పోతామే గాని, మోక్షాన్ని పొంద లేము అనే సత్యాన్ని చక్కగా అర్థం చేసుకోవాలి.

స్త్రీ గర్భము నందు పురుషుడు రేతస్సును విడుచుట చేత పిండోత్పత్తి జరిగినట్లు, ప్రకృతి యందు పరమేశ్వరుడు చేతనా రేతస్సును నిక్షిప్తం చేయడం వల్ల సమస్త భూతోత్పత్తి జరుగుతూ ఉంది. ఇక్కడే క్షేత్ర క్షేత్రజ్ఞ సంయోజనము జరిగి హిరణ్యగర్భుని ఉత్పత్తి ద్వారా సర్వభూతోత్పత్తి జరుగుతూ ఉంది ***( క్షేత్రజ్ఞం క్షేత్రేణ సంయోజయామి ఇత్యర్థః సంభవః ఉత్పత్తిః సర్వభూతానాం హిరణ్యగర్భోత్పత్తి ద్వారేణ ).*** ఈ విషయాన్నంతా ఆంధ్ర మహాభారతము - శాంతిపర్వములో పూర్వము వసిష్ఠ మహాముని జనకమహారాజుకు చెప్పిన విషయాన్ని తిక్కనామాత్యుడు ఒక కందములో అందముగా చెబుతాడు.

***క॥ నరనారీ సంబంధము వరుసగదా పురుషునకును బ్రకృతికి నన్యో***
***న్య రమణ మది సర్వజనన కర మిట్టుల శ్రుతులు సెప్పు గారుణ్యనిధీ॥***

సర్వ భూతజాలమునకు ప్రకృతియే తల్లి, పరమాత్మయే తండ్రి అనే విషయాన్ని తరువాత శ్లోకంలో కూడా వినిపిస్తున్నాడు.

సర్వయోనిషు కౌన్తేయ మూర్తయః సమ్భవన్తి యాః ।
తాసాం బ్రహ్మ మహద్యోని రహం బీజప్రదః పితా ॥ 4

**సర్వయోనిషు-కౌంతేయ-మూర్తయః-సంభవంతి-యాః**

**తాసాం-బ్రహ్మ-మహత్-యోనిః-అహం-బీజప్రదః-పితా**

| | | | |
|---|---|---|---|
| కౌన్తేయ | = అర్జునా! | మహత్ బ్రహ్మ | = గొప్పదైన ప్రకృతి |
| సర్వయోనిషు | = సమస్త యోనులందు | యోనిః | = గర్భస్థానము |
| యాః | = ఏ | అహం | = నేను |
| మూర్తయః | = రూపాలు | బీజప్రదః | = గర్భాధానము చేసే |
| సంభవంతి | = పుట్టుచున్నవో | పితా | = తండ్రిని |
| తాసాం | = వానికి | | |

**అర్జునా! పుడుతున్న ప్రాణు లన్నిటికీ జన్మ నిచ్చే తల్లి ప్రకృతి. నేను బీజ ప్రదానం చేసే తండ్రిని.**

**వ్యాఖ్య**

**మాతృ స్థానంలో ప్రకృతి**

సృష్టి లోని భూతజాలమును పరిశీలించి చూసినపుడు వాటి అవయవ నిర్మాణము, దేహ నిర్మాణ క్రమము ఒకే విధంగా కనిపించడం లేదు. దేహాలు ఏవైనా, అవయవ నిర్మాణం తోనే ఉన్నాయి. ఆ అవయవాలు కూడా ఒక విధంగా లేవు. అనేక రూపాలలో గోచరిస్తున్నాయి. అందుకే వాటిని మూర్తులు అన్నారు **(మూర్తయః)**. దేహ నిర్మాణంలో సంహతి రూపంలో కనిపిస్తున్న అవయవాలు స్థిరంగా, అంటే ఒకే విధంగా బండిచక్రము లోని ఆకుల వలె లేవు. విభిన్నమైన రీతులలో పెరుగుతూ కొన్ని, మార్పు చెందుతూ మరి కొన్ని ఉన్నాయి. కనుక దేహ నిర్మాణం లోని అంగాలన్నీ అస్పష్టం గానే ఉన్నాయి. అందుకే దేహా లనే మూర్తుల అవయవాలను ***మూర్ఛితాంగ అవయవాః మూర్తయః*** అన్నారు భాష్యంలో ఆచార్యులు. అస్పష్టంగా ఉన్న దేహాంగములు గల మూర్తులు, లేదా పెరుగుటకు, విస్తరించుటకు అవకాశమున్న శరీరావయవాలు గల మూర్తులు అని అర్థము.

మరి దేహాలు, దేహాంగాలు అనేక విధాలుగా ఉండే టప్పుడు అవి వేర్వేరు కారణాల వల్ల ఏర్పడుతున్నాయేమో అనే సందేహము కలిగే ప్రమాదం లేక పోలేదు. దేహాలు వివిధ రూపాలలో, వివిధ మూర్ఛితాంగ అవయవాలతో కనిపిస్తూ ఉండినా, అన్ని మూర్తులు ఒకే కారణం నుండి ఉద్భవిస్తున్నాయి అని ప్రస్తుత శ్లోకము నిర్ణయిస్తూ ఉంది. అన్ని దేహాలకు వాటికి సంబంధించిన కారణ రూపంగా ప్రకృతియే మాతృస్థానంలో ఉంది అంటున్నారు.

**కారణ కార్యాలు**

దేహాలన్నీ కార్య రూపంలో కనిపిస్తున్నాయి. వివిధ జాతుల నుండి ఉత్పన్న మవుతున్నాయి. దేవతలు, పితరులు, మానవులు, పశువులు, మృగాలు మొదలైన సమస్త యోనుల నుండి ఉద్భవిస్తున్నాయి ***( దేవ పితృ మనుష్య పశు మృగాది సర్వయోనిషు ).*** కాకపోతే, కొన్ని ప్రాణులు అండజాలు. పక్షి, పాము, చేప మొదలైనవన్నీ గ్రుడ్ల నుండి పుడుతాయి. కనుక అవి అండజాలు. అలాగే చెమట నుండి పుట్టే స్వేదజాలు, భూమిని ఛేదించుకొని పుట్టే ఉద్భిజాలు - ఇలా జరాయుజ, అండజ, స్వేదజ, ఉద్భిజాది భేదాలతో పుడుతూ ఉన్నందున వాటి దేహావయవ నిర్మాణాల వల్ల భేదాలు గోచరిస్తున్నాయే గాని కారణాంతరము ఉండి మాత్రము కాదు. సర్వ భూతములు ఒకే కారణము నుండి సంభవిస్తున్నాయి. ఆ కారణము ప్రకృతియే. కనుక వివిధావయవ నిర్మాణ భేదముతో గోచరిస్తున్న భూతా లన్నిటికి ***(తాసాం మూర్తీనాం)*** గొప్పదైన ప్రకృతియే ***(బ్రహ్మ మహత్)*** కారణంగా ఉంది ***(యోనిః కారణమ్).*** అర్జునా! పరమేశ్వరుడ నైన నేను ***(అహం ఈశః)*** బీజ ప్రదానము చేసి గర్భాధానము చేసే తండ్రిని ***(బీజప్రదః గర్భాధానస్య కర్తా పితా ).***





**మాతాపితలు**

కారణ భావమును పొందిన ప్రకృతిమాత మాతృ స్థానములో ఉండి సర్వభూతోత్పత్తికి హేతువుగా తెలుస్తూ ఉంది. ఉపాదాన కారణంగా శోభిస్తూ ఉంది. పరమాత్మ పితృ స్థానములో ఉండి బీజ ప్రదానం చేస్తున్నాడు. అందుకనే పరమేశ్వరుని భూతజాలానికి ఆదికర్తగా స్మృతి అభివర్ణించింది ***(ఆది కర్తా స భూతానామ్).*** బీజకర్తగా పరమేశ్వరుడు శోభిస్తున్నాడు. బీజ కారణం ఉంది కనుకనే తాను బీజకర్త అయ్యాడు ***( బీజం మాం సర్వ భూతానాం విద్ధి ; 7 వ అ - 10 వ శ్లో ).***

ఇది అర్థమైతే, సర్వ జీవులకు మాతాపితలు ప్రకృతీ పరమేశ్వరులే. జన్మకు కారణమైన వారు జననీ జనకులు అని భావిస్తూ ఉంటారు. ఇది వాస్తవం కాదు. తల్లిదండ్రులు దేహాన్ని ప్రసాదించడానికి నిమిత్తంగా ఉన్నారు. అంతే. కేవలం స్త్రీ పురుష సంయోగము వల్లనే జీవులు ఉత్పత్తి కారు. అలా అయ్యేటట్లయితే రేత స్సించనం జరిగిన ప్రతి గర్భము నందు జీవోత్పత్తి జరగాలి. అదే సంభవ మైతే సంతాన హీను లెందుకుంటారు? కనుకనే, క్షేత్ర క్షేత్రజ్ఞ సంయోజనాన్ని సర్వజ్ఞుడైన పరమాత్మే ఏర్పాటు చేస్తాడు. ఎవరు ఎక్కడ పుట్టాలో, ఎవరికి పుట్టాలో సర్వజ్ఞుడైన పరమేశ్వరునికే తెలుసు. కనుకనే, భగవంతుని అధీనంలో ఉన్న క్షేత్రక్షేత్రజ్ఞులు సర్వభూతోత్పత్తికి హేతువు లవుతున్నారు. తల్లిగా ప్రకృతి, తండ్రిగా పరమేశ్వరుడు శోభిస్తున్నారు. అర్ధనారీశ్వర తత్త్వం కూడా అదే.

***జగతః పితరౌ వన్దే పార్వతీ పరమేశ్వరౌ*** - విశ్వానికి జననీజనకు లైన పార్వతీ పరమేశ్వరులకు నమస్కారం అంటూ మంగళ శ్లోకాన్ని వినిపించి, మహాకవి కాళిదాసు జగత్కళ్యాణాన్ని వాంఛిస్తూ రఘువంశం అనే మహాకావ్యాన్ని రచించాడు.

**మాతా చ పార్వతీ దేవీ పితా దేవో మహేశ్వరః ।**
**బాంధవాః శివభక్తాశ్చ స్వదేశో భువనత్రయమ్ ॥**

పార్వతీదేవి తల్లి. పరమేశ్వరుడు తండ్రి. ఈశ్వర భక్తులే బంధువులు. స్వదేశమే త్రిభువనములు అన్నారు శ్రీ శంకర భగవత్పాదులు.

భగవంతుడే సమస్త ప్రపంచానికి తండ్రి. వాస్తవానికి ప్రకృతి, లేదా మాయ బ్రహ్మమునే ఆశ్రయించుకొని ఉన్నందున, తల్లిదండ్రు లిరువురు కూడా పరమాత్మయే. ఈ సమస్త జగత్తుకు ఆది తానే. సృష్టికర్త యైన హిరణ్యగర్భుడూ తానే. తానే తల్లి. తానే తండ్రి. తానే కర్త. తానే సృష్టికర్త ( 9 వ అ - 17 వ శ్లో ).

ఇలా సృష్టింపబడిన జీవులు గుణాల చేత ఎలా బద్ధు లౌతున్నారో చెబుతున్నాడు.

**సత్త్వం రజ స్తమ ఇతి గుణాః ప్రకృతి సమ్భవాః ।** 5
**నిబధ్నన్తి మహాబాహో దేహే దేహిన మవ్యయమ్ ॥**

**సత్త్వం-రజః-తమః-ఇతి-గుణాః-ప్రకృతి సంభవాః**

**నిబధ్నంతి-మహాబాహో-దేహే-దేహినం-అవ్యయం**

| | | | |
|---|---|---|---|
| మహాబాహో | = అర్జునా! | రజః | = రజస్సు |
| సత్త్వం | = సత్త్వము | తమః | = తమస్సు |

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఇతి | = | అనే | దేహినం | = | జీవుని |
| ప్రకృతిసంభవాః | = | ప్రకృతి వలన పుట్టిన | దేహే | = | దేహము నందు |
| గుణాః | = | గుణములు | నిబధ్నంతి | = | బంధిస్తున్నాయి |
| అవ్యయం | = | నాశరహితుడైన | | | |

**అర్జునా! జీవుడు నశించే వాడు కాదు. ప్రకృతి నుండి పుట్టిన సత్త్వ రజ స్తమో గుణాలు జీవుణ్ణి దేహంలో బంధిస్తున్నాయి.**

### వ్యాఖ్య

గుణములు ఏవి *(కేగుణాః)?* అవి పురుషుని ఎలా బంధిస్తున్నాయి *(కథం బధ్నన్తి)?* ఈ విషయాలను ప్రస్తుత శ్లోకము నుండి వరుసగా పద్నాలుగు శ్లోకాలలో వివరిస్తున్నాడు.

కార్యము యొక్క స్వభావాన్ని, లక్షణాలను పరిశీలించి నపుడు కారణము యొక్క స్వభావము కూడా మనకు అర్థ మవుతుంది. కార్యములో కారణము కన్నా అన్యమైనది ఉండదు కనుక, కారణ స్వభావమే కార్యములో వ్యక్త మవుతూ ఉంటుంది.

మట్టికుండ కార్య రూపంలో ఉంది. కుండకు మట్టి కారణము. కార్యమైన కుండ రూపంలో ఏదయితే ఉందో, అది వాస్తవానికి మట్టియే. అలాగే ప్రపంచము కార్య రూపంలో ఉంది. ప్రపంచమును పరిశీలించి, పరీక్షించి అర్థం చేసుకుంటే, ప్రపంచము త్రిగుణ మిళితముగా కనిపిస్తుంది. కార్యమైన ప్రపంచములో త్రిగుణాలు గోచరిస్తున్నాయి అంటే, అవి ప్రపంచానికి కారణమైన దానిలో కూడా ఉండి తీరాలి. కారణములో లేనిది కార్యములో ఉండదు. ఉండలేదు.

***త్రిభిర్గుణ మయైః భావైః ఏభిః సర్వమిదం జగత్ మోహితం*** - మూడు గుణముల వికార స్వభావము చేత ఈ ప్రపంచము మోహితమై ఉంది అని విజ్ఞానయోగం లోనే భగవంతుడు ప్రవచించాడు. పరమేశ్వరుని ఆశ్రయించుకొని మనుగడను సాగిస్తున్న గుణ వికారములు గల ప్రకృతి ఈ చరాచర ప్రపంచాన్ని సృష్టిస్తూ ఉంది అని ***(ప్రకృతిః సూయతే స చరాచరమ్)*** రాజవిద్యా రాజగుహ్య యోగంలో చెప్పుకున్నాం. కనుక కార్య రూప ప్రపంచములో కనిపించే గుణాలు, వికారాలు కారణమైన ప్రకృతి నుండే సంభవించాయి ***(వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతి సంభవాన్)*** అని క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగంలో తెలుసుకున్నాం. కనుక భగవంతునికి సంబంధించిన ప్రకృతి, లేదా మాయ గుణమయము ***(దైవీ హ్యేషా గుణమయీ***: 7 వ అ - 14 వ శ్లో).

**గుణాలు ప్రకృతి సంభవాలు**

అర్జునా! గుణాలు ప్రకృతి సంభవాలు ***(గుణాః ప్రకృతి సంభవాః)***. అవి సత్త్వము, రజస్సు, తమస్సు అనే పేర్లు కలవి ***(సత్త్వం రజస్తమ ఇతి)***. గుణము అనేది పారిభాషిక శబ్దం. వైశేషికులు (కణాద మతానుయాయులు) గుణాలకు, ద్రవ్యములకు భేదమును అంగీకరించారు. రూప రస గంధాదుల వలె ద్రవ్యములను గుణాలు ఆశ్రయించి ఉంటాయి అని అభిప్రాయ పడ్డారు. అంటే, నీలి వస్త్రము అన్నపుడు వస్త్రము వేరు, వస్త్రమునకు వేయబడిన నీలివర్ణము వేరు. అలాగే సత్త్వాది గుణాలు ప్రకృతి కన్నా వేరుగా ఉన్నాయి అని అర్థము. కాని, గుణి అయిన ప్రకృతికి, గుణములైన త్రిగుణాలకు భేదం ఆమోదం కాదు ***(న చ గుణగుణినోః అన్యత్వం అత్ర వివక్షితమ్)***. గుణాలు ప్రకృతికి, లేదా మాయకు వేరుగా లేవు.

ఇక్కడ మరొక సందేహము తలెత్తుతుంది. ప్రకృతి త్రిగుణాత్మక మైనపుడు, గుణములు ప్రకృతి కన్నా





వేరుగా లేనపుడు, గుణాలు ప్రకృతి నుండి పుట్టాయి ***(ప్రకృతి సంభవాః)*** అని చెప్పడం ఎలా పొసగుతుంది? అలా ప్రత్యేకంగా లేని గుణాలు పురుషుణ్ణి ఎలా బంధిస్తాయి?

ప్రకృతి, లేదా మాయ గుణమయం. గుణములు ప్రకృతి స్వభావము. కాకపోతే, త్రిగుణములు సామ్యావస్థలో ఉండే టప్పుడు దానిని ప్రకృతి అంటాము. సామ్యావస్థ అంటే మూడు గుణాలు సమానంగా ఉండట మని అర్థము.

అలా త్రిగుణాలు సామ్య స్థితిలో ఉన్నంత వరకు దానిని ప్రకృతి, లేదా మాయ అంటాము. ప్రకృతిలో సమస్థితిలో ఉన్న గుణాలు విషమంగా పరిణమించి నపుడు అవి అంగాంగీ భావంతో కనిపిస్తాయి. ఈ స్థితిలో వాటిని ప్రకృతి సంభవాలు అన వలసి వచ్చింది.

అంగాంగీభావము అంటే, ఒక గుణము ముఖ్య స్థానంలో ఉండి, మిగిలిన రెండు గుణాలు అముఖ్యంగా ఉండటమే అంగాంగీ భావము. ఏ గుణము ప్రధానంగా ఉంటుందో అది అంగి. మిగిలిన రెండు గుణాలు ఏవైతే అప్రధానంగా ఉంటాయో అవి అంగములు. ఇదే గుణాల విషమ స్థితి. కార్య రూపమైన ప్రపంచంలో గుణాలు విషమ స్థితిలో గోచరిస్తూ ఉంటే, కారణమైన ప్రకృతి, లేదా మాయలో గుణాలు సామ్య స్థితిలో ఉంటాయి. అంతేగాని, తార్కికులు అభిప్రాయ పడ్డట్లు గుణాలు ప్రకృతికి భిన్నంగా, వేరుగా ఉండవు. గుణాలు లేకుండా ప్రకృతి ఉండలేదు. సామ్య స్థితిలో ఏవైతే ప్రకృతి స్వభావంగా తెలుస్తూ ఉన్నవో, అవే విషమ స్థితిలో ప్రకృతి సంభవా లవుతున్నాయి. వాస్తవానికి గుణాలు ప్రకృతి రూపాలే. అవే ప్రపంచంలో ఉన్నాయి. అంటే ప్రపంచ మంతా ప్రకృతి మయమే. మాయామయమే. గుణాత్మకమే.

తల వెంట్రుకలను మూడు పాయలుగా చేసి, మూడు పేటలను ఒక దానితో మరొక దానిని పేడుతూ స్త్రీలు జడ వేసుకుంటారు. ప్రకృతి మహిళ జడ లోని మూడు పాయలే త్రిగుణాలు. అవి ఎప్పుడూ వేరుగా లేవు. అర్థం కావడానికే ఉపమానము. ఉపమానము ఏకదేశీయమే గాని సర్వము కాదు.

ప్రకృతి స్వభావంగా సామ్య స్థితిలో ఉండి విషమించిన గుణాలు ప్రకృతి సంభవా లయ్యాయి కనుక, ప్రపంచము లోని కార్యకరణ సంఘాతములో విషమించిన గుణాలే ఉన్నాయి. అటు విశ్వంలో గాని, ఇటు వ్యక్తిలో గాని గుణాలే దోబూచు లాడుతున్నాయి.

ప్రపంచంలో వస్తు రూపంలో విషయాకారంగా ఏ గుణా లున్నాయో, వ్యక్తి యొక్క దేహేంద్రియ ప్రాణ మనోబుద్ధులలో ఆ గుణాలే నిండి ఉన్నాయి. విషయాలు ఇంద్రియ మనస్సులను ఆకర్షించడానికి కూడా గుణములే కారణము ***(గుణా గుణేషు వర్తన్తే***: 3 వ అ - 28 వ శ్లో).

వ్యక్తుల మధ్య, వ్యక్తుల స్వభావాల మధ్య, ప్రవర్తనల మధ్య భేదం గోచరించడానికి గుణాలే కారణము. అవే సత్త్వ రజ స్తమో గుణాలు. సత్త్వగుణము జ్ఞాన ప్రధానంగా ఉంటుంది కనుక అది ప్రకాశముతో నిండి ఉంటుంది. రజోగుణము క్రియాత్మకంగా ఉద్యమిస్తూ ఉంటుంది కనుక అది ప్రవృత్తితో కూడి ఉంటుంది. తమోగుణము నిద్ర, అలసత్వాదులతో నిండి ఉంటుంది కనుక అప్రవృత్తిలో పడి ఉంటుంది. ఈ గుణములు మూడూ బంధ హేతువులే. అవి ఎలా బంధిస్తున్నాయో అర్థమైతే వాటి నుండి విడుదల పొందవచ్చు.

**గుణాలు బంధహేతువులు**

గుణాలు ప్రాకృతములు కనుక అచేతనములు. అవిద్యాత్మకములు. అందుచేత అవి స్వతంత్రములు కావు, పరతంత్రములు. పరాధీనములు. పురుషుని ఆధారం చేసుకొని మనుగడను సాగిస్తున్నాయి. పురుషుని ఆశ్రయించుకొని అస్తిత్వాన్ని పొందిన గుణాలు పురుషుణ్ణే బంధిస్తున్నాయి. ఎక్కడ బంధిస్తున్నాయి?

ప్రకృతి కార్యమైన దేహేంద్రియాది కార్యకరణ సంఘాతము నందు బంధిస్తున్నాయి ***(దేహినం దేహే నిబధ్నన్తి).***

ఇది వాస్తవమా? గుణాలు క్షేత్రజ్ఞుణ్ణి నిజంగా బంధిస్తున్నాయా? గుణబంధము సత్యమా? అదే కనుక సత్యమైతే, బంధము సత్యము అని చెప్ప వలసి వస్తుంది. బంధము సత్యమైతే, సత్యమైనది పోదు, నశించదు కనుక బంధము కూడా నశించదు. బంధము నశించని దైతే, మోక్షము అసంభవ మవుతుంది.

పైగా దేహి అవ్యయుడు అని కూడా ప్రస్తుత శ్లోకం లోనే భగవంతుడు చెబుతున్నాడు. అవ్యయుడైన క్షేత్రజ్ఞుని ***(అవ్యయమ్ దేహినమ్)*** గుణాలు క్షేత్రంలో బంధిస్తున్నాయి ***(దేహే నిబధ్నన్తి)*** అంటున్నాడు. అవ్యయుడైన దేహిని, గుణాలకు ఆశ్రయమైన నిర్గుణ స్వరూపుని గుణాలు ఎలా బంధిస్తాయి? గుణ రహితుడైన వానిని గుణాలు బంధించడ మేమిటి?

ఆది లేని వాడు, గుణ రహితుడు, అవ్యయుడు అయిన పరమాత్మ దేహము నందున్నా, కర్మలను చేసే వాడు కాడు, కర్మల చేత అంటబడే వాడూ కాడు అని పూర్వాధ్యాయంలో చెప్పుకున్నాం కదా! *(13 వ అ - 32వ శ్లో).*

కనుక అచేతనము లైన గుణాలు పురుషుని బంధించ లేవు. బంధిస్తున్నట్లు కనిపిస్తాయి, అంతే. బంధించే వాటి వలె అగుపిస్తాయి ***(నిబధ్నన్తి ఇవ)*** అన్నారు భాష్యంలో శ్రీ శంకరులు. బంధించినట్లు కనిపిస్తున్నాయే గాని నిజానికి బంధించడం లేదు. బంధింప బడక పోయినా తాను బంధింప బడినట్లు పురుషుడు భావించడమే బంధ కారణము. ఇదే అజ్ఞానము. కనుక, అజ్ఞానమే బంధము. అజ్ఞానము బంధము కనుక జ్ఞానమే మోక్షము. అందుచేతనే మోక్షానికి ప్రయత్నాలు అవసరం లేదు. నీవు గుణాతీతుడవు అని తెలుసుకోవడం చేతనే నీవు విముక్తిని పొందుతావు అని ఈ అధ్యాయం చివర భగవంతుడే తెలుపుతాడు.

**మాయా బంధము**

బంధమే లేని దేహికి బంధము ఎలా కల్పించ బడుతుంది? అదే మాయ. బంధము అనేది మాయా కార్యము. అదే మాయాబంధము. అసంభవాన్ని సంభవంగా చూపే శక్తే మాయా శక్తి ***(అఘటన ఘటనా పటీయసీ మాయా).*** క్షేత్ర క్షేత్రజ్ఞుల వివేకం లేకపోవడం చేతనే గుణాలు దేహిని బంధిస్తున్నట్లుగా ఉన్నాయి. ***కథం ఏషః బంధః ఆగతః?*** ఈ బంధము ఎలా వచ్చింది? అని ప్రశ్నించి విచారించ గలిగితే కల్పిత బంధమే కనుక, కనుమరు గవుతుంది.

గుణాలు ఏమిటో, వాటి స్వభావ స్వరూపా లేమిటో తెలియ నపుడే గుణాలు క్షేత్రజ్ఞుణ్ణి బంధిస్తాయి. బంధము తొలగాలి అంటే గుణా లేమిటో ముందుగా తెలుసు కోవాలి.

ప్రకృతి సంభవాలైన గుణాలు మూడు; అవే సత్త్వ రజ స్తమో గుణాలు. మోక్షానికి హేతువు కావడం చేత ఉత్కృష్ట మైనది కనుక సత్త్వగుణము ప్రథమంగా చెప్ప బడింది. సర్వ ప్రవృత్తికి హేతువు కావడం చేత రజోగుణము ద్వితీయ స్థానంలో పేర్కొన బడింది. రజస్సు కంటే నికృష్ట మైనది కావడం చేత తమోగుణము చివరగా చెప్పబడింది.

సూర్యునికి చీకటితో సంబంధము లేనట్లు అసంగుడైన క్షేత్రజ్ఞునకు గుణసంగము లేదు. నిష్క్రియుడు, నిర్గుణుడు అయిన క్షేత్రజ్ఞుడు, లేదా దేహి అవ్యయు డైనను ***(అవ్యయమ్ దేహినమ్),*** ప్రకృతి కార్యమైన దేహేంద్రియ కార్యకరణ సంఘాతముతో తాదాత్మ్యం చెందడం చేత, అధ్యాసాపన్ను డవుతున్నాడు. గుణాల చేత బంధింప బడినట్లు గోచరిస్తున్నాడు. ఇదే మాయా బంధము.





సూర్యుడు ఆకాశంలో అచలమై భాసిస్తున్నా, నీళ్ళల్లో ప్రతిఫలించే సూర్యబింబము చలిస్తున్నట్లు కనిపిస్తుంది. వాస్తవానికి ఈ విధమైన చలనము సూర్యునిలో లేదు. జల చలనాన్ని సూర్యుని యందు ఆరోపించడం జరుగుతుంది. ఇదే అధ్యాస. అది కాని దాని యందు అది అనే భావనే అధ్యాస ***(అధ్యాసో నామ అతస్మిన్ తద్బుద్ధిః).*** జల లక్షణమైన చలనాన్ని సూర్యుని యందు ఆరోపించడం చేత సూర్యుడు చలిస్తున్న వాని వలె ఉన్నాడు.

అలాగే రాత్రి పూట ఆకాశంలో మేఘాల మధ్య చంద్రుడు దోగాడుతున్నట్లు కనిపిస్తాడు. వాస్తవానికి అది మేఘ చలనమే గాని చంద్రునిలో చలనము లేదు. మేఘ చలనాన్ని చంద్రుని యందు ఆరోపించడం చేత అచలుడైన చంద్రుడు చలించే వాని వలె ***(ఇవ)*** కనిపిస్తున్నాడు.

అలాగే ఇక్కడ కూడా గుణ ధర్మాలను క్షేత్రజ్ఞుని యందు ఆరోపించడం చేత బంధమే తెలియని దేహి బంధింప బడిన వాని వలె ***(ఇవ)*** కనిపిస్తున్నాడు. చంద్రునికి, మేఘానికి సంబంధమే లేదని తెలియగానే చంద్రుడు అచలుడుగా తెలియునట్లు, ఇది జల చలనము అని అర్థం కాగానే సూర్యుడు చలన రహితుడని తెలిసినట్లు, గుణముల స్వభావము అర్థమైతే, క్షేత్రజ్ఞుడు గుణ రహితుడని, గుణాతీతుడని, నిత్యముక్తుడని, బంధ రహితుడని అర్థ మౌతుంది. అందుకే ఈ గుణత్రయ విభాగ యోగము అనే చతుర్దశాధ్యాయము.

కనుక అప్రవృత్తితో అజ్ఞానములో అలమటించే తమోగుణయుతుడు, ప్రవృత్తితో కూడి కర్మాచరణము నందు ప్రవర్తించి రజోగుణ యుతుడు కావాలి. కర్మలు కామ్య ప్రవృత్తితో సాగి బంధహేతువులు అవుతాయి. కనుక ఈశ్వరార్పణ బుద్ధితో కర్మలను నిష్కామంగా ఆచరించి బుద్ధిలో సత్త్వగుణాన్ని పెంపొందించు కోవాలి. సత్త్వగుణ ప్రధానుడే జ్ఞానార్హుడై తరిస్తాడు. కనుకనే 'అర్జునా! నిత్య సత్త్వస్థుడవు కా! ***(త్వం నిత్య సత్త్వస్థః భవ! సదా సత్త్వగుణాశ్రితః భవ!).*** ఎల్లప్పుడు సత్త్వగుణాన్నే ఆశ్రయించు' అని భగవంతుడు రెండవ అధ్యాయం - నలభై ఐదవ శ్లోకం లోనే బోధించాడు.

*ఇక గుణాలను వివరించే క్రమంలో మొదట సత్త్వగుణ లక్షణాన్ని చెబుతున్నాడు.*

తత్ర సత్త్వం నిర్మలత్వా త్ప్రకాశక మనామయమ్ ।
సుఖసఙ్గేన బధ్నాతి జ్ఞానసఙ్గేన చానఘ ॥ 6

***తత్ర-సత్త్వం-నిర్మలత్వాత్-ప్రకాశకం-అనామయం***
***సుఖసంగేన-బధ్నాతి-జ్ఞానసంగేన-చ-అనఘ***

| | | | | | |
|---|---|---|---|---|---|
| అనఘ | = | అర్జునా! | నిర్మలత్వాత్ | = | నిర్మల మగుట వలన |
| తత్ర | = | ఆ గుణముల యందు | సుఖసంగేన | = | సుఖాభిలాష చేత |
| ప్రకాశకం | = | ప్రకాశమును కలిగించేది | జ్ఞానసంగేన చ | = | జ్ఞానాభిలాష చేత |
| అనామయం | = | దోషాలు లేనిది | బధ్నాతి | = | బంధిస్తూ ఉంది |
| సత్త్వం | = | సత్త్వగుణము | | | |

**అర్జునా! ఈ త్రిగుణాలలో సత్త్వగుణము నిర్మల మైంది. ప్రకాశింప చేస్తుంది. దోషాలు లేనిది. సుఖాసక్తి చేత, జ్ఞానాసక్తి చేత జీవుణ్ణి బంధిస్తుంది.**

**వ్యాఖ్య**

కారణ ప్రకృతిలో సామ్యావస్థలో ఉండే త్రిగుణాలు కార్య ప్రకృతిలో ఎలా విషమిస్తున్నాయో అట్టి

గుణత్రయము యొక్క సమిష్టి కార్యాన్ని వివరించిన భగవంతుడు, ప్రస్తుతము ప్రత్యేకంగా ఒక్కొక్క గుణము యొక్క స్వరూపమును తెలుపుతూ, అది ఎలా బంధ హేతువో కూడా వివరించ డానికి ఉపక్రమిస్తున్నాడు.

**సత్త్వశోభ**

త్రిగుణాలలో మొదటి దైన సత్త్వగుణము నిర్మల మైనది ***(నిర్మలత్వాత్).*** స్వచ్ఛ మైనది. కనుక అద్దము వలె ప్రకాశవంతంగా ఉంటుంది. స్ఫటిక మణి వలె కాంతిమంతమై ఉంటుంది ***(స్ఫటిక మణిః ఇవ ప్రకాశకమ్).*** మురికి ఆవరించిన దర్పణాన్ని శుద్ధి చేసిన తరువాత అది ఎలా ప్రకాశవంతంగా ఉంటుందో, అలాగే రజస్తమో గుణాల చేత మలిన పడిన మనో దర్పణాన్ని సత్త్వగుణము శుద్ధి చేసి ప్రకాశవంతముగా ఉంచుతుంది. అందుచేత, వ్యక్తి మనస్సులో సత్త్వము ప్రధానంగా ఉండే టప్పుడు ఆ వ్యక్తి బుద్ధి వికసించి ఉంటుంది. శుద్ధమైన ఆలోచనలు కదుల్తూ ఉంటాయి. స్మృతి జ్ఞానాలతో చిత్తము తృప్తిగా, ఆహ్లాదంగా, ప్రకాశమానంగా ఉంటుంది.

***ధృతియు సంప్రీతియును ప్రసన్నతయు మరియు***
***నీదృశములగు సత్త్వ గుణోదితములు ॥***

అని సత్త్వగుణ శోభను వర్ణించింది ఆంధ్ర మహాభారతము - శాంతిపర్వము.

సత్త్వగుణ శోభితుడైన వ్యక్తి అనామయుడుగా ఉంటాడు. ఆమయము అంటే ఉపద్రవము, లేదా వ్యాధి అని అర్థము. అనామయము అంటే నిరుపద్రవము అని అర్థము. దేహ సంబంధమైన వ్యాధులు, మనో సంబంధ మైన వ్యథలు బాధించని స్థితియే అనామయ స్థితి. దేహ బాధలు, మనో వ్యథలు లేక పోవడం చేత, సత్త్వగుణము సుఖానికి, జ్ఞానానికి అనువుగా ఉంటుంది కనుక, వ్యక్తి సుఖంగా, ప్రకాశవంతంగా ఉంటాడు ***(అన్తరైః బాహ్యైః వ్యాధిభిః కర్మజైః న పీడ్యత ఇతి అనామయః).***

స్వచ్ఛమైనది ప్రకాశవంతముగా ఉండటమే గాక, ప్రతిఫలించే లక్షణాన్ని కూడా కలిగి ఉంటుంది. ప్రతిబింబము అనేది ఇటుకలో కాకుండా నీటి లోనే ఎలా ప్రతిఫలిస్తుందో అలాగే జ్ఞానము సాత్త్వికమైన బుద్ధి లోనే నిలుస్తుంది. జ్ఞానం తోనే మోక్షం ప్రాప్తిస్తుంది. కనుక బంధము నుండి విడిపడి ముక్తిని పొంది తరించా లని అభిలషించే ముముక్షువునకు సత్త్వగుణము సహకారిగా ఉంటుంది.

**సత్త్వబంధము - సుఖసంగము**

సంతోషాన్ని, ప్రియత్వాన్ని, ప్రశాంతతను కలిగించే నిర్మలమైన సత్త్వగుణము ఎలా బాధిస్తుంది? బాధించదు కాని బంధిస్తుంది. ఇదే సత్త్వబంధము. జ్ఞాన ప్రతిబంధకము. సత్త్వగుణము ఎలా బంధిస్తుంది? రెండు విధాలుగా బంధిస్తుంది. ఒకటి సుఖసంగము; రెండవది జ్ఞానసంగము. ఇవే బంధాలు. అందాల మధ్య అవరోధాలు.

సత్త్వగుణము సుఖ ప్రధాన మని చెప్పుకున్నాం. ***అహం సుఖీ -*** నేను సుఖిని, నేను సుఖ పడుతున్నాను అనే అనుభవము సుఖం వల్ల కలుగుతూ ఉంది. సుఖము అనేది విషయము. సుఖ విషయానికి సంబంధించిన చిత్తవృత్తియే ఇక్కడ సుఖంగా తెలుస్తూ ఉంది. ఇది సుఖవృత్తియే గాని సుఖ స్వరూపం కాదు. కేవలం అంతః కరణము లోని వృత్తి రూపమే ఇక్కడ సుఖంగా తెలుస్తూ ఉంది. సుఖం, దుఃఖం లాగా బాధించదు. అలాగని బంధం కాకుండా పోదు.

సుఖవృత్తి అంతఃకరణ ధర్మము. విషయానికి సంబంధించినది. మనస్సులో దుఃఖము ఎలా విషయమో సుఖం కూడా అలా విషయమే. దుఃఖము ఎలా నశిస్తుందో, సుఖం కూడా అలాగే నశిస్తుంది. మనస్సులో ఎప్పుడూ దుఃఖమే ఉంటుందని చెప్పలేము; అలాగే ఎప్పుడూ సుఖమే ఉంటుంది అని కూడా చెప్పలేము.





ఒక కారణం వల్ల దుఃఖం కలుగుతుంది. అలాగే ఒక నిమిత్తంగా సుఖం కలుగుతుంది. అందుచేత, మనస్సులో వృత్తి రూపంలో తెలిసే సుఖాలన్నీ నైమిత్తిక సుఖాలు. నిమిత్తాలు దూరమైతే, నైమిత్తిక సుఖాలు పారి పోతాయి. కనుక నశించే ఈ సుఖాలు విషయ రూపాలై క్షేత్ర ధర్మాన్ని కలిగి ఉన్నాయి.

**ఇచ్ఛా ద్వేష స్సుఖం దుఃఖం సంఘాత శ్చేతనా ధృతిః ॥**

కోరిక, ద్వేషము, సుఖము, దుఃఖము, వృత్తి జ్ఞానము, ధైర్యము - ఇవన్నీ వికారయుతము లైన కార్య విషయాలు; క్షేత్ర సంబంధ మైనవి అని పదమూడవ అధ్యాయం ఏడవ శ్లోకం లోనే అర్థం చేసుకున్నాం.

క్షేత్రజ్ఞుడు అసంగుడు. సత్త్వగుణము వలన అసంగుడైన క్షేత్రజ్ఞునికి సంగత్వము ఏర్పడుతుంది. మరొక దానితో సంగత్వము అంటే ద్వైతానుభూతి కలుగుతూ ఉంది. ద్వైత దర్శనము అద్వయ జ్ఞానానికి ప్రతి బంధకము. ఈ విధంగా సుఖసంగమును కలిగిస్తున్న సత్త్వగుణము బంధహేతువు అవుతూ ఉంది.

విషయ జన్య సుఖము ఏదీ నిత్యసుఖం కాదు. నిత్యసుఖము అనేది స్వరూప సుఖమే గాని మనస్సు లోని సుఖవృత్తి కాదు. సుఖవృత్తి మనోధర్మము. విషయ రూపము. సుఖ స్వరూపము 'విషయి'కి సంబంధించింది. ఆత్మలక్షణము. విషయ ధర్మము విషయికి సంబంధించింది కాదు కదా ***( న హి విషయ ధర్మః విషయిణః భవతి)!***

కనుక, తన ధర్మము కానిది, మనోధర్మము అయినది, శబ్దాది ప్రియ వస్తువుల యొక్క అనుభవ సంపర్కము వలన ఏర్పడే నైమిత్తిక సుఖంతో అసంగుడైన క్షేత్రజ్ఞునికి సంగత్వమును కల్పిస్తూ ఉంది కనుక సుఖప్రద మైన సత్త్వగుణము బంధహేతువు అవుతూ ఉంది. అసక్తుడైన పురుషుని యందు ఆసక్తిని, సుఖాసక్తిని కలిగిస్తూ బంధ కారణ మవుతూ ఉంది ***(అసక్తం సక్త మివ కరోతి, అసుఖినం సుఖిన మివ).*** నాకు అది లభిస్తే సుఖం, నాకు ఇది దూరమైతే సుఖం అనే రాగద్వేషాలను కూడా కలిగిస్తూ ఉంది. కాని, క్షేత్రజ్ఞుడు సుఖ స్వరూపుడు. క్షేత్రజ్ఞుని సుఖం వచ్చేది కాదు; పోయేది కాదు. రాకపోకలు గల సుఖాలు అనిత్యాలు. ఆత్మ సుఖ స్వరూపం. అది నిత్యసుఖం. నిత్యానంద స్వరూపుడైన పురుషునికి అనిత్య సుఖాలతో సంసర్గము ఏర్పడేటట్లు చేస్తూ ఉంది కనుక, ఈ విధమైన సుఖసంగమును కలిగించే సత్త్వగుణము కూడా సుఖమైన బంధమే.

**సత్త్వబంధము - జ్ఞాన సంగము**

సత్త్వగుణము సుఖ ప్రధానమే కాదు; ప్రకాశవంత మైనది కావడం చేత జ్ఞాన ప్రధానము కూడా. నేను జ్ఞానిని, తెలివి గల వాణ్ణి అనే అనుభవం కూడా సత్త్వగుణం వల్లనే కలుగుతూ ఉంది. సుఖము ఎలాగైతే అంతః కరణ వృత్తి అని తెలుసు కున్నామో, అలాగే సత్త్వ ప్రధానమైన జ్ఞానము కూడా వృత్తికి సంబంధించినదే. వృత్తి జ్ఞానమే. కనుక మనోధర్మమే.

ఇది వృత్తి జ్ఞానము కనుకనే జ్ఞానసంగము ఏర్పడుతూ ఉంది. స్వరూప జ్ఞానమైతే సంగత్వము ఎలా సాధ్య పడుతుంది? అంతఃకరణ ధర్మమైన సుఖసంగమును ఎలా జ్ఞాన ప్రతిబంధక మని తెలుసుకున్నామో, అలాగే అంతఃకరణ ధర్మమైన జ్ఞానమును కూడా ప్రతిబంధకము గానే భావించాలి ***(సుఖే ఇవ జ్ఞానాదౌ సంగః మన్తవ్యః).***

బుద్ధి లోని విషయాన్ని నువ్వు గ్రహిస్తున్నావు. బుద్ధి లోని విషయ జ్ఞానము మారుతూ ఉంది. ఒక వ్యక్తి బుద్ధిలో వైద్య జ్ఞాన ముంది. అతడు వైద్యుడు. మరొక వ్యక్తి మనస్సులో సంగీత జ్ఞాన ముంది. అతడు గాయకుడు. ఒక్కొక్కపుడు గాయకుడు కవి కూడా కావచ్చు. ఒకే వ్యక్తిలో ఉన్నా, కవిత్వమునకు సంబంధించిన

జ్ఞానము వేరు; సంగీతానికి సంబంధించిన జ్ఞానము వేరు. ఇంతకీ వీటిలో ఏది స్వరూప జ్ఞానము? ఏదీ కాదు.

ఏ జ్ఞానా లైనా క్షేత్రజ్ఞుడ వైన నీ మీదే ఆధారపడి ఉన్నాయి. నీ వల్లనే కలుగు తున్నాయి. ఆ జ్ఞానాలు బుద్ధిలో కదలి నపుడు నువ్వు వాటిని తెలుసుకుంటున్నావు. వాటికి సంబంధించిన జ్ఞానము నీకు కలుగుతూ ఉంది. ఆ జ్ఞానము కలిగి నపుడు ***అహం జ్ఞానీ*** - నేను జ్ఞానిని అంటున్నావు.

బుద్ధిలో ఎప్పుడూ ఒకే విషయం ఉండదు. విషయ వృత్తులు మారుతూ ఉంటే విషయ జ్ఞానము కూడా మారుతూ ఉంటుంది. ఒకప్పుడు ఉండి మరొకప్పుడు లేనిది, స్వయంగా ప్రకాశించ లేక మరొక దానిపై ఆధారపడి ప్రకాశించేది మిథ్యా జ్ఞానమే గాని సత్యజ్ఞానము కాదు. సత్య జ్ఞానానంద స్వరూపుడైన క్షేత్రజ్ఞుణ్ణి మిథ్యా జ్ఞానంతో కలిపే సత్త్వగుణము జ్ఞానసంగము చేత అతనిని బంధిస్తూ ఉంది. విషయ జ్ఞానమును విషయి నందు అధ్యసించడమే జ్ఞానసంగము. అద్వయ జ్ఞాన ప్రాప్తికి ప్రతిబంధకము.

***అహం కర్తా - అహం భోక్తా*** - నేను కర్తను; నేను భోక్తను అనే అనుభవము అవిద్యా కార్యము. ఇది విజ్ఞానమయ కోశమునకు సంబంధించినది. అకర్త, అభోక్త అయిన క్షేత్రజ్ఞుని యందు నేను సుఖిని - నేను జ్ఞానిని అనే అభిమానమును ఆరోపించడము జ్ఞానానికి అవరోధమే కదా! ఈ విధంగా, సుఖప్రదము, శాంతిరూపము, ప్రకాశవంతము అయిన సత్త్వము సుఖ సంగమును, జ్ఞాన సంగమును కలిగించి పురుషునికి బంధకారణ మవుతూ ఉంది. వాస్తవానికి క్షేత్రజ్ఞుడు బంధమే తెలియని వాడు. నిత్యముక్తుడు. కాని, చిత్తము లోని సుఖ జ్ఞానములు అతనికి బంధ హేతువు లవుతున్నాయి. చిత్తమే లేని చిద్రూపునికి సుఖసంగ మెలా ఉంటుంది? జ్ఞానసంగ మెలా కుదురుతుంది?

***బంధమోక్ష విహీనోఽస్మి శుద్ధం బ్రహ్మాస్మి సోఽస్మ్యహం ।***
***చిత్తాది సర్వహీనోఽస్మి పరమోఽస్మి పరాత్పరః ॥***

నాకు బంధమోక్షాలు లేవు; నేను శుద్ధమైన బ్రహ్మమును; నాకు చిత్తాదులు లేనే లేవు; నేను ఉత్కృష్ట మైన వాణ్ణి; పరమాత్మ స్వరూపుణ్ణి అని మైత్రేయోపనిషత్తు.

*ఇక రెండవది అయిన రజోగుణ స్వభావము ఎలాంటిదో, అది ఎలా బంధహేతువో వివరిస్తున్నాడు.*

రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసఙ్గ సముద్భవమ్ ।
త న్నిబధ్నాతి కౌన్తేయ కర్మసఙ్గేన దేహినమ్ ॥ 7

***రజః-రాగాత్మకం-విద్ధి-తృష్ణా సంగ సముద్భవం***
***తత్-నిబధ్నాతి-కౌంతేయ-కర్మసంగేన-దేహినం***

| | | | | | |
|---|---|---|---|---|---|
| కౌంతేయ | = అర్జునా! | | తత్ | = | అది |
| రజః | = రజోగుణము | | దేహినం | = | జీవుని |
| రాగాత్మకం | = రాగముతో కూడినది | | కర్మసంగేన | = | కర్మాసక్తి చేత |
| తృష్ణా సంగ సముద్భవం | = తృష్ణ, ఆసంగములకు కారణము | | నిబధ్నాతి | = | బంధిస్తూ ఉంది |
| విద్ధి | = తెలుసుకో! | | | | |

**అర్జునా! రజోగుణము రాగాత్మకము. తృష్ణ, ఆసక్తి దీని నుండే పుడుతాయి. కర్మసంగము చేత రజోగుణము జీవుని బంధిస్తుంది.**





**వ్యాఖ్య**

**రాగాత్మకం**

రంజింప చేస్తుంది కనుక రజోగుణము రాగాత్మకము ***(రజః రాగాత్మకం, రంజనాత్ రాగః)***. రంజనము అంటే అంటుకొనే స్వభావము. అట్టి స్వభావము కలది రాగము. రాగము అంటే రక్తి. రాగమే ఆత్మగా కలది కనుక రజోగుణము రాగాత్మకము. ఇది రంజన స్వభావము కలది. గుడ్డకు రంగు ఎలా అంటుకుంటుందో, అలా అంటుకొనే స్వభావం కలది, రాగాత్మక మైనది రజోగుణము.

సత్త్వగుణము స్వచ్ఛ మైనది, ప్రకాశవంత మైనది అని తెలుసుకున్నాం. స్వచ్ఛంగా ఉన్న శ్వేత వస్త్రముపై రంగును అద్ది నపుడు, శ్వేతవర్ణము ఎలా మరుగున పడి, వేసిన రంగు ప్రధానంగా గోచరిస్తుందో, సత్త్వ ప్రధాన మైన చిత్తము రాగాత్మకం కాగానే నూతనమైన రాగంతో రంజింప చేస్తుంది.

**తృష్ణా సంగ సముద్భవం**

రజోగుణము తృష్ణ, ఆసంగములకు కారణము. కనుక అది తృష్ణాసంగ సముద్భవము. తృష్ణ అంటే లేని దానిని పొందాలి అనే కోరిక. అదే ఆశ. తనకు ఏది ప్రియమని మనిషి భావిస్తాడో, దానినే అతడు వాంఛిస్తాడు. ప్రియమైన వస్తువు, లేదా విషయం కంట పడి నపుడు, చెవిలో వినపడి నపుడు, లేదా మనస్సులో మెదిలి నపుడు, ఆ ప్రియ వస్తువుకు సంబంధించిన ఆశ మనస్సులో కదుల్తుంది. ఆశ పడినది లభించినంత వరకు, దానిని పొందాలి అనే కోరిక ఏదయితే మనస్సులో కదుల్తూ ఉంటుందో అదే తృష్ణ. రాగాత్మకము ***( తృష్ణా అప్రాప్తాభి లాషః )***.

తృష్ణ అంటే దప్పిక అని కూడా అర్థం. రాగ మనేది ఒక తీరని దాహం. మనస్సును సదా దహించి వేసే తాపం. ఈ దప్పిక తీరేది కాదు. అలాగే రజోగుణం ఆరేదీ కాదు. మనిషికి ఏది ఉంది, ఏది లేదు అనేది ప్రక్కన ఉంచితే, ఏది ఉన్నా, ఎంత ఉన్నా, ఆ ఉన్నది లేని దానిని స్మృతికి తెచ్చి చిత్తాన్ని ఊపేస్తూనే ఉంటుంది. మనస్సును కుదిపేస్తూనే ఉంటుంది. ఇదే తృష్ణ. తీరని ఆశాదాహం.

వినింది ప్రియమైతే, దానిని చూడాలనే కోరిక కదుల్తుంది. చూడా లనుకున్నది ప్రాప్తిస్తే, దానిని చవి చూడాలని మనస్సు ఉరకలు వేస్తుంది. ఒక వైపు రాగాత్మకంగా రంగులు పడుతూ ఉంటాయి. మరో వైపు ఆశలు పొంగుతూ ఉంటాయి. ఇదంతా తృష్ణ మహిమే.

ఆశించిన వన్నీ మనిషి పొంద లేక పోవచ్చు. కొన్నిటిని పొందినా, ఆ పొందిన వాటిని పోగొట్టుకోక తప్పదు. ఆశించినవి అందుతూ ఉంటాయి. ఒక సమయంలో అందినవి మరొక సమయంలో అదృశ్యమై అందనంత దూరాలకు తరలి పోతూ ఉంటాయి. లేనివి వస్తున్నా, వచ్చినవి పోతున్నా, ఆశ మాత్రం రాకపోకలు లేకుండా స్థిరంగా ఉంటుంది. అదే తృష్ణ.

రెండవది ఆసంగము. ఆసంగము అంటే ఆసక్తి. లేని దానిని పొందాలి అనే కాంక్ష తృష్ణ అయితే, పొందిన దానిని నిలబెట్టుకోవాలి అనే ఆతురతే ఆసంగము ***( ప్రాప్తే విషయే మనసః ప్రీతి లక్షణః సంశ్లేషః )***. ప్రాప్తించిన దాని విషయంలో ప్రీతి రూపమైన సంశ్లేషము. అప్రాప్తమైన దాని యందు అభిలాష తృష్ణ అయితే, వచ్చినది పోకుండా స్థిరంగా ఉండాలనే అభిమానమే ఆసంగము. ఈ తృష్ణ, ఆసంగాలు రజోగుణం నుండి పుడతాయి. కర్మల వైపు నడిపిస్తాయి. కర్మ సంగాన్ని, ఫలసంగాన్ని అసంగుడైన పురుషునికి కలిగించి కర్మ చక్రానికి, జన్మ చక్రానికి బంధిస్తాయి. సత్త్వగుణము కలిగించే బంధాన్ని ప్రయత్నంతో త్వరగా తొలగించుకోవచ్చు.

కాని, రజోగుణము సృష్టించే బంధాన్ని తప్పించు కోవడం సులభ సాధ్యం కాదు. అందుచేత సత్త్వగుణ బంధాన్ని తెలుపుతూ పూర్వ శ్లోకంలో **బధ్నాతి** అని పలికిన పరమేశ్వరుడు, ప్రస్తుతం రజోగుణము యొక్క బంధాన్ని ప్రస్తావిస్తూ **నిబధ్నాతి** అని వక్కాణిస్తున్నాడు. రజోగుణము పురుషుని బహుముఖంగా బంధిస్తుంది.

*చ॥ బలమును శౌర్యమున్ మదముఁ బ్రాభవమున్ సుఖదుఃఖ భాగితా*
*కలనముఁ జెల్మి సేతయును గాంక్షయు నొల్లమి యుం బ్రతాపముం*
*గలహము నీర్ష్యయున్ బహువి కల్పపు భాషలుఁ గామినీ జనం*
*బుల యెడ గాఢ రాగతయు బొంకును నుబ్బు రజః ప్రభూతముల్ !*

బలము, శౌర్యము, మదము, సుఖము, దుఃఖము, కొందరితో సఖ్యము, మరి కొందరితో శత్రుత్వము, కొన్నిటిని ప్రియంగా ఆశించడము, కొన్నిటిని అప్రియంగా ద్వేషించడము, ప్రతాపాన్ని ప్రకటించడము, కలహించడము, ఈర్ష్య చెందడము, వికట భాషణములు, స్త్రీ వ్యామోహము, అసత్యము లాడుట, గర్వమును ప్రదర్శించుట - ఇవన్నీ రజోగుణ లక్షణములే అని ఆంధ్రమహాభారతము - అశ్వమేధ పర్వము.

రజోగుణము చేత ప్రభావితుడైన పురుషుడు, స్వయంగా తాను నిష్క్రియాత్మే అయినా, కర్మసంగమును, ఫలసంగమును పొంది సంసార చక్రానికి బంధింప బడుతున్నాడు.

*ఇక మూడవది అయిన తమోగుణ స్వభావము ఎలాంటిదో, అది ఎలా బంధహేతువో చెబుతున్నాడు.*

**తమ స్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్ ।**
**ప్రమాదాలస్యనిద్రాభి స్త న్నిబధ్నాతి భారత ॥** 8

***తమః-తు-అజ్ఞానజం-విద్ధి-మోహనం-సర్వదేహినాం***
***ప్రమాదాలస్య నిద్రాభిః-తత్-నిబధ్నాతి-భారత***

| | | | |
|---|---|---|---|
| భారత | = అర్జునా! | విద్ధి | = తెలుసుకో! |
| అజ్ఞానజం | = అజ్ఞానము వలన పుట్టిన | తత్ | = అది |
| తమః తు | = తమోగుణము | ప్రమాదాలస్య నిద్రాభిః | = మరపు చేత, అలసత్వము చేత, నిద్ర చేత |
| సర్వ దేహినాం | = సర్వ ప్రాణులకు | దేహినం | = దేహిని |
| మోహనం | = మోహకర మైనది | నిబధ్నాతి | = బంధించు చున్నది |

**అర్జునా! తమోగుణము అజ్ఞాన జనితము. అది సర్వులకు మోహమును కలిగిస్తుంది. విస్మృతి, అలసత్వము, నిద్రల చేత జీవుని బంధిస్తుంది.**

**వ్యాఖ్య**

సత్త్వ రజో గుణాల స్వభావ స్వరూపాలను, అవి జీవులను బంధించే విధానమును ఆరు, ఏడు శ్లోకాలలో వివరించిన వాసుదేవుడు మూడవ గుణమైన తమోగుణమును ( ***తమః తృతీయ గుణః*** ) ప్రస్తుత శ్లోకంలో వివరిస్తున్నాడు.

***గుణాఃప్రకృతి సంభవాః*** - త్రిగుణాలు ప్రకృతి నుండి పుట్టాయి అని తెలిపిన భగవంతుడు, ఈ మూడవ గుణమైన తమోగుణమును ప్రత్యేకించి అజ్ఞానం నుండి పుట్టింది అంటున్నాడు. మూడు గుణాలు అజ్ఞాన కార్యాలే అయినా, ప్రత్యేకించి తమోగుణాన్ని అజ్ఞాన కార్యంగా అభివర్ణించడంలో ప్రత్యేకత ఉంది. అజ్ఞానాన్ని





ఎప్పుడూ విడిచి పెట్టని స్వభావము తమోగుణం లోనే కనిపిస్తుంది కనుక కనిష్ట మైన, నికృష్ట మైన ఈ తమో గుణాన్ని, ఆ రెండిటి కన్నా విలక్షణంగా చెప్పడం జరిగింది. అదే **తు** శబ్ద ప్రయోగము.

**అజ్ఞాన సంతతి**

తమోగుణము అజ్ఞానానికి బిడ్డ ( ***అజ్ఞానజమ్, అజ్ఞానాత్ జాతం*** ). అజ్ఞానము వలన పుట్టిన ఈ తమోగుణము సర్వులను మోహింప చేస్తుంది ( ***మోహనం మోహకరమ్, అవివేక కరమ్*** ). మోహము అంటే అవివేకము. వివేకము లోపించిన స్థితి. వివేక హీనులకు ఉన్నది లేనట్లుగా, లేనిది ఉన్నట్లుగా గోచరిస్తుంది. అదే మోహము. అజ్ఞాన జాతం. జ్ఞానము అజ్ఞానము చేత కప్పబడి నపుడు జీవులు మోహమును పొందుతారు అని భగవంతుడు కర్మసన్యాస యోగం లోనే బోధించాడు *(5 వ అ - 15 వ శ్లో)*. ***తన్మోహ బీజమ్*** - తమోగుణము మోహ కారణము అని అమరసింహుడు కూడా నిర్వచించాడు.

తమోగుణము, అజ్ఞానము ఒక దానిని విడిచి మరొకటి ఎప్పుడూ ఉండ లేవు. రెండు పెనవేసుకొనే ఉంటాయి. ప్రస్తుత శ్లోకంలో తమోగుణము అజ్ఞానం వలన జనించింది అని చెప్పిన భగవంతుడు, ఇదే అధ్యాయం పదిహేడవ శ్లోకంలో అజ్ఞానం తమోగుణము వలన ఏర్పడుతుంది అని చెప్పబోతాడు. ఇలా చెప్పడములో వైరుధ్య మేమీ లేదు. రెండూ కలిసే ఉంటాయి కనుక, దేనికి ఏది కారణమో అర్థం గాని స్థితిలో పరస్పరాధీనమై ఉంటాయని అర్థము.

కోడి గ్రుడ్డు పెడుతుంది. గ్రుడ్డు నుండి కోడి వస్తుంది. కోడి నుండి మళ్ళీ గ్రుడ్డు వస్తుంది. ఇలా అన్యోన్యాశ్రయంగా అజ్ఞాన తమస్సులు తెలుస్తూ ఉంటాయి.

అజ్ఞానము తమోగుణాన్ని ప్రసవిస్తే, తమోగుణము ప్రమాద, ఆలస్య, నిద్రలనే ముగ్గురు బిడ్డలకు జన్మ నిస్తుంది. ఈ ముగ్గురు బిడ్డల సహకారంతో తమోగుణము జీవులను బంధిస్తుంది.

**ప్రమాద - ఆలస్య - నిద్రలు**

మొదటిది ప్రమాదము. ప్రమాదము అంటే అవధానము లేకపోవడము అని అర్థము ( ***ప్రమాదోఽనవధానతా*** ). చేయ గలిగే శక్తి ఉండినా, చేయ వలసిన కార్యమును చేయకుండా ఉండటము అనవధానము. అదే ప్రమాదము. కర్తవ్య విస్మరణము.

ఈ ప్రమాదానికి విస్మృతి కూడా కారణము కావచ్చు. చేయవలసిన కార్యమును మరచి పోవడమే విస్మృతి. ప్రమాదానికి బలమైన కారణము. ఇది తమోగుణ కార్యము. ఇటు వంటి ప్రమాద లక్షణము గల వ్యక్తి గురువు బోధించిన జ్ఞానాన్ని కూడా మరచి పోతాడు. తమోగుణ యుతుడు విన్న దానినే ఎన్నిసార్లు విన్నా నూతనం గానే వింటూ ఉంటాడు. ఇది జ్ఞానానికి ప్రతిబంధకము కనుక జీవునికి బంధహేతువు అవుతుంది.

రెండవది ఆలస్యము. అలసతయే ఆలస్యము. అదే సోమరితనము. ప్రమాదములో స్మృతి భ్రంశము ఉంటుంది కనుక కర్తవ్య విస్మరణము జరుగుతుంది. ఒకవేళ స్మృతి ఉండినా, ఈ అలసత్వము అనే సోమరితనము వల్ల శ్రద్ధ లోపించి కర్తవ్యము ఉట్టి కెక్కుతుంది. చూద్దాం - చేద్దాం అంటూ సోమరి కాలాన్నంతా ఖర్చు పెట్టేస్తాడు. ఈ సోమరితనము తమోగుణము యొక్క రెండవ బిడ్డ.

సత్త్వగుణము ప్రకాశవంతంగా శోభిస్తూ ఉంటే, రజోగుణము ప్రవృత్తిలో ప్రవర్తిస్తూ ఉంటే, తమోగుణము సత్త్వగుణానికి భిన్నంగా ప్రమాద మనే అవివేకంతో, అలాగే రజోగుణానికి వ్యతిరేకంగా సోమరితన మనే అలసత్వముతో సాగుతూ ఉంటుంది.

సత్త్వం లోపించిన కారణంగా జ్ఞాన శూన్యం గాను, రజస్సు లోపించిన కారణంగా క్రియా శూన్యం గాను మారిన తమోగుణ యుతుడు ఇంకేమి చేస్తాడు? ఏమీ చేయలేక మంచ మెక్కుతాడు. అదే నిద్ర.

మూడవది నిద్ర. ఇంద్రియాలన్నీ నిద్రాణంగా ఉండటమే నిద్ర (***నియతం ద్రాంతి ఇంద్రియాణి అత్ర ఇతి నిద్రా***). ఇంద్రియాలు వాడిపోయి, వాలిపోతూ ఉండటమే నిద్ర. తమోగుణ ప్రభావము చేత జీవుడు అతి నిద్రా లోలుడై ఉంటాడు. ఎప్పుడైనా నిద్రే. ఎక్కడైనా నిద్రే. ఏదున్నా నిద్రే. ఏది లేకపోయినా నిద్రే. ఇల్లు, ఆఫీసు అనే తేడా ఉండదు. తమోగుణం ఆవరించాలే గాని పడుకొనే నిద్రించాలనే నియమ మేమీ లేదు. నిలబడి అయినా నిద్రించ గలడు. కూర్చుని కూడా కునుకు తీయ గలడు. బస్సెక్కినా నిద్రే. బండెక్కినా నిద్రే. పట్టె మంచ మెక్కినా, పాడె ఎక్కినా కదలకుండా పడి ఉండటమే. సత్త్వగుణము లాగా కాంతి లేదు. రజోగుణము లాగా కార్యమూ ఉండదు. కాళ్ళు చాచుకొని, కళ్ళు మూసుకొని పడి ఉండటమే. ఈ విధంగా ప్రమాదాలస్య నిద్రలను సంతానముగా కలిగిన తమోగుణములో మునిగిన వాడు తరించే దేముంటుంది? ఈ విధంగా తమస్సు జీవులను బంధిస్తుంది (***తాభిః, తత్ తమః నిబధ్నాతి***).

*క॥ తలఁపులు గ్రందుగఁ బొడముట గలగను టేమఱుట భ్రమము గదురట జాడ్యం*
*బలసత యను నీ భావంబులు దామస కోటి యండ్రు బుధులు నరేంద్రా!*

చిత్ర విచిత్రమైన ఆలోచనలు చేయటము, సదా నిద్రాసక్తుడై తూగుతూ, తూలుతూ ఉండటము, సోమరియై, కార్య శూన్యుడై పడి ఉండటము, మూఢ బుద్ధితో మసలుతూ ఉండటము - ఇవన్నీ తమోగుణ లక్షణాలే అని ఆంధ్ర మహాభారతము - శాంతిపర్వము.

సత్త్వగుణాన్ని వివరించే ఆరవ శ్లోకంలో అర్జునుని **అనఘ!** పాపరహితుడా! అని సంబోధించాడు. రజోగుణమును గూర్చి చెప్పిన ఏడవ శ్లోకంలో **కౌన్తేయ!** కుంతీకుమారా! అని పిలిచాడు. తమోగుణమును తెలియచెప్పే ఈ ఎనిమిదవ శ్లోకంలో **భారత!** భరతవంశ కులోద్భవా! అని సంబోధిస్తున్నాడు.

ఏ వ్యసనాలు లేనపుడే సత్త్వగుణము శోభిస్తుంది. కనుక, అవ్యసన పరుడైన పార్థుని **అనఘ!** అని ఆరవ శ్లోకంలో సంబోధించాడు (***అనఘ అవ్యసన***).

రజోగుణ ప్రేరితుడై కార్య ప్రవృత్తిలో ఉండే వాడు సూక్ష్మబుద్ధి గల వాడై కర్మసంగము లేకుండా ఆచరించ గలగాలి. అందుచేత **కౌన్తేయ!** అని పిలిచాడు.

తమోగుణములో పడి అలమటించే వాడు వివేకవంతుడై వెలుగును చూడాలి. దానికి సంకేతంగా, **భారత!** అని సంబోధించాడు. 'భా' అంటే ప్రకాశము (***భాతీతి భా***). కనుక తమోగుణము అనే చీకటిలో అలమటించ కుండా సత్త్వ ప్రకాశంలో శోభించా లనేది భావము.

*త్రిగుణముల వ్యాపారాన్ని మళ్ళీ సంక్షేపంగా చెబుతున్నాడు.*

**సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత ।**
**జ్ఞాన మావృత్య తు తమః ప్రమాదే సంజయ త్యుత ॥** 9

***సత్త్వం-సుఖే-సంజయతి-రజః-కర్మణి-భారత***
***జ్ఞానం-ఆవృత్య-తు-తమః-ప్రమాదే-సంజయతి-ఉత***

| | | | | | |
|---|---|---|---|---|---|
| భారత | = | అర్జునా! | సుఖే | = | సుఖము నందు |
| సత్త్వం | = | సత్త్వగుణము | సంజయతి | = | చేర్పుతుంది |
| రజః | = | రజోగుణము | జ్ఞానం | = | జ్ఞానమును |
| కర్మణి | = | కర్మల యందు | ఆవృత్య | = | ఆవరించి |
| సంజయతి | = | చేర్పుతుంది | ప్రమాదే | = | ప్రమాదము నందు |
| తమః తు | = | తమోగుణము | సంజయతి ఉత | = | చేర్పుతుంది గదా! |





**అర్జునా! సత్త్వగుణము జీవుణ్ణి సుఖపడేలా చేస్తుంది. రజోగుణము కర్మలలో దించుతుంది. తమోగుణము జ్ఞానమును కప్పేసి ప్రమాదంలో పడేస్తుంది.**

**వ్యాఖ్య**

**గుణ ప్రాబల్యము**

ఆరవ శ్లోకం నుండి వరుసగా మూడు శ్లోకాలలో గుణ స్వభావ ప్రాధాన్యతలను వివరించిన భగవానుడు, ప్రస్తుత శ్లోకంలో గుణోత్కర్షను పేర్కొంటూ గుణ ప్రాబల్యాన్ని తెలియ చేస్తున్నాడు. ఏయే కార్యాలలో ఏయే గుణాలకు ఎక్కువ ప్రాముఖ్యమో వివరిస్తున్నాడు.

సత్త్వగుణము సుఖము నందు ఆసక్తిని కలిగిస్తుంది. దుఃఖ స్పర్శ లేకుండా సుఖం వైపు నడిపిస్తుంది. శోక విషాదాలకు అనువైన కారణాలు ఉన్నప్పటికి, సత్త్వగుణము సుఖము వైపే పయనించేలా చేస్తుంది. దుఃఖ శోకాలను మరపించి సుఖంలో రంజింప చేస్తుంది. సుఖాసక్తుని చేస్తుంది (***సుఖే సంజయతి సంశ్లేషయతి***).

మనిషిలో సుఖము, వివేకము ఎక్కువ భాగము కనిపిస్తున్నాయి అంటే అతనిలో సత్త్వగుణము ఉత్కర్షంగా ఉంది అని అర్థము. అయినా, అది కూడా త్యజించ దగినదే. వృత్తి జన్య సుఖము స్వరూప సుఖం గాను, వృత్తి జన్య జ్ఞానము వృత్తి రహిత చైతన్యము గాను అనుభవానికి అందాలి. అదే గుణాతీత స్థితి. అట్టి నిస్త్రైగుణ్య స్థితికి చేరాలి అంటే సత్త్వాన్ని కూడా దాటి పోవాలి.

ఇక రెండవది రజోగుణము. ఇది రాగాత్మక మని ఇదివరకే తెలుసుకున్నాం. కనుక, ఒక వైపు సాత్త్విక సుఖ కారణా లున్నా, రజోగుణం వ్యక్తిలో కర్మాసక్తిని కలిగిస్తుంది. సకామ కర్మల వైపు దూసుకు పోయేలా చేస్తుంది. లౌకిక కర్మల యందు గాని, వైదిక కర్మల యందు గాని ఆసక్తిని పెంపొందించి కర్మసంగాన్ని, ఫలసంగాన్ని పెంపొందిస్తుంది (***రజః కర్మణి సంజయతి ఇతి వర్తతే***).

మూడవది తమోగుణము. ఇది కప్పివేసే స్వభావం కలది. సత్త్వగుణం వల్ల కలిగే వివేకాన్ని, సుఖాన్ని కప్పివేసి మనిషిని ప్రమాదంలో పడదోస్తుంది. మరపును కలిగించి చెడుపు చేస్తుంది. క్రియాశూన్యుణ్ణి చేస్తుంది.

ప్రారబ్ధాధీనులై జీవులు మనుగడను సాగిస్తున్నారు. చేయవలసిన కర్మలు ఎన్నో ఉంటాయి. ఉన్నాయి. ఎన్ని చేసినా, మరెన్నో ఎదురు చూస్తూ ఉంటాయి. అవన్నీ చేయ దగినవే. అందుకనే, అవి మన కొరకు నిరీక్షిస్తూ ఉంటాయి. మన కొరకు కాచుకొని ఉన్న కర్మలను మనం చేయకపోతే మరెవరు చేస్తారు? చేయడానికి ఆ కర్మ లేమిటో మనకు తెలుస్తాయే గాని, అన్యుల కెలా అర్థ మవుతాయి? ప్రారబ్ధ కర్మ ప్రారబ్ధాధీనుడైన జీవుణ్ణే ప్రేరేపిస్తుంది.. ఈ విధంగా చేయవలసిన కర్మను చేసి విడుదలను పొంద వలసిన అవసరము పురుషునికి ఉండే టప్పుడు, తమోగుణం చేత ప్రభావితుడై, కర్మల యందు ఉదాసీన వైఖరిని అవలంబించి క్రియా శూన్యంగా పడి ఉండటం సబబేనా? ఈ విధంగా తమోగుణము వివేకాన్ని కప్పేసి ప్రమాదంలో పడేస్తుంది. ప్రమాదము అంటే చేయవలసిన కార్యము ఉన్నా దానిని చేయక పోవడము అని అర్థము (***ప్రమాదః నామ ప్రాప్త కర్తవ్యా కరణమ్***).

## గుణ ప్రాధాన్యము

ఫలాన వ్యక్తి సాత్త్వికుడు అంటూ ఉంటారు. అంటే అతనిలో కేవలం సత్త్వగుణమే ఉందని అర్థం కాదు. త్రిగుణాలూ ఉంటాయి. కాకపోతే సత్త్వగుణము ఉత్కృష్టంగా ఉత్కర్షమై ఉంటుంది. మిగిలిన రెండు గుణాలు అప్రధానంగా ఉంటాయి. కనుక ఏ వ్యక్తి లోనూ ఒకే గుణము ఉందని చెప్పలేము. కాకపోతే, అతని ఆలోచనా సరళిని, మనుగడను పరిశీలించి అతనిలో ఏ గుణము ప్రధానంగా ఉందో చెప్ప గలము.

కుంభకర్ణుడు తమోగుణ ప్రధానుడే అయినా, అతనిలో సత్త్వగుణము అసలే లేదని చెప్ప లేము. రావణ పుత్రుడు యుద్ధంలో మరణించి నపుడు, నిద్రిస్తున్న కుంభకర్ణుని అతి కష్టం మీద లేపుతారు. ఆ సందర్భంలో అన్నగారైన రావణాసురుని ముందు నిలబడి కుంభకర్ణుడు వినిపించిన హిత వచనాలను చూస్తే, ఆ భాషణ మెంతో వివేక పూరితంగా కనిపిస్తుంది. సత్త్వగుణ ప్రధానంగా ఉందని అనిపిస్తుంది. కాకపోతే, ఆ క్షణాలలో గోచరించిన సత్త్వగుణము అన్ని కాలాలలో అగుపించదు. కారణం, అప్పుడప్పుడు సత్త్వ రజో గుణాలు తొంగి చూసినా అతనిలో తమోగుణమే ఉత్కర్షమై ఉంది. ఇదే వ్యక్తులలో గుణ ప్రాధాన్యము. వ్యక్తుల ప్రవర్తనలలో అంతరాలన్నీ గుణ భేదాల వల్ల కలిగినవే. మానవుని మూర్తిమత్వము త్రిగుణ మిళితమై ఉన్నా, ఒక్క గుణమే వ్యక్త మవుతూ ఉండటానికి కారణము, ఆ వ్యక్తిలో ఆ ప్రత్యేక గుణము ప్రాధాన్యతను సంతరించుకొని ఉండటమే.

*గుణాలు తమ విశేష ప్రాబల్యాన్ని ఎలా ప్రదర్శిస్తాయో చెబుతున్నాడు.*

**రజ స్తమ శ్చాభిభూయ సత్త్వం భవతి భారత ।**
**రజః సత్త్వం తమ శ్చైవ తమ స్సత్త్వం రజ స్తథా ॥** 10

***రజః-తమః-చ-అభిభూయ-సత్త్వం-భవతి-భారత***
***రజః-సత్త్వం-తమః-చ-ఏవ-తమః-సత్త్వం-రజః-తథా***

| | | | | | |
|---|---|---|---|---|---|
| భారత | = | అర్జునా! | సత్త్వం | = | సత్త్వ గుణమును |
| సత్త్వం | = | సత్త్వగుణము | తమః చ ఏవ | = | తమోగుణమును |
| రజః | = | రజోగుణమును | తథా | = | అలాగే |
| తమః చ | = | తమోగుణమును | తమః | = | తమోగుణము |
| అభిభూయ | = | తిరస్కరించి | సత్త్వం | = | సత్త్వగుణమును |
| భవతి | = | అగుచున్నది | రజః | = | రజోగుణమును |
| రజః | = | రజోగుణము | భవతి | = | అగుచున్నది |

**అర్జునా! సత్త్వగుణము రజస్తమోగుణాలను తిరస్కరిస్తుంది. రజోగుణము సత్త్వ తమో గుణాలను అణగ ద్రొక్కుతుంది. తమోగుణము సత్త్వ రజో గుణాలను అదిమేస్తుంది.**

### వ్యాఖ్య

త్రిగుణాలు ఏయే కార్యాలను చేస్తాయో, వాటిని ఎప్పుడు చేస్తాయో వివరిస్తున్నాడు. గుణాలు వాటి వాటి కార్యాలను నిర్వర్తించే టప్పుడు ప్రాధాన్యతలను, ప్రాబల్యాలను సంతరించుకుంటూ అంగాంగీ భావముతో ఎలా వర్ధిల్లుతూ ఉంటాయో ప్రస్తుత శ్లోకంలో స్పష్టం చేస్తున్నాడు.





రజస్తమో గుణాలను అణగద్రొక్కి, సత్త్వగుణం ప్రాధాన్యతను సంతరించుకు న్నప్పుడు, జ్ఞానసుఖాలు వృద్ధి చెంది కనిపిస్తాయి (***స్వకార్యం జ్ఞాన సుఖ ద్యారభతే***). సత్త్వగుణం రజ స్తమస్సులను అణచి ఉత్కర్షంగా శోభిస్తూ ఉంటుంది. సత్త్వగుణం అంగిగా ఉంటే, రజస్తమస్సులు అంగాలుగా ఉంటాయి.

అలాగే, సత్త్వ తమస్సులను అణగద్రొక్కి రజోగుణము ఉత్కర్ష మైనపుడు, కర్మాసక్తిని పెంపొందించి, సకామ కర్మలను విస్తరింప చేయడం జరుగుతుంది (***కర్మ తృష్ణాది స్వకార్య మారభతే***). రజోగుణము అంగిగా ఉంటే సత్త్వ తమస్సులు అంగాలుగా ఉంటాయి.

ఇక తమోగుణము ఉత్కర్షంగా ఉండే టప్పుడు, సత్త్వ రజస్సులు తిరస్కరింప బడతాయి. తమోగుణము అంగిగా ఉంటుంది. సత్త్వ రజస్సులు అంగాలుగా ఉంటూ అముఖ్యంగా ఉంటాయి. అప్రధానంగా ఉండే సత్త్వ రజోగుణాలు తమోగుణానికి వశపడి ఉంటాయి. అట్టి సమయాలలో తమోగుణము తన స్వకార్యమైన జ్ఞానావరణాది కార్యమును ప్రారంభిస్తుంది (***జ్ఞానావరణాది స్వకార్య మారభతే***).

గుణాలను, గుణకార్యాలను, వాటి ప్రాబల్య ప్రాధాన్యతలను తెలియ చేయడంలో ముఖ్యోద్దేశము వాటిని అనుసరించ మని కాదు. అవి జ్ఞానానికి ఎలా ప్రతిబంధకాలో గ్రహించి వాటిని దాటి పొమ్మనే అంతర్భావము. కనుకనే, ఈ శ్లోకంలో అర్జునుని భారత! అని సంబోధించాడు. రజ స్తమో గుణాలను అధిగమించి పురుషుడు నిత్య సత్త్వస్థుడు కావాలి (***నిత్య సత్త్వస్థః భవ !***). అలా సత్త్వగుణాన్ని ఆశ్రయించి ఉండటమే గాక, సత్త్వగుణము కూడా బంధహేతువే కనుక, దానిని కూడా దాటి గుణాతీతుడవు కావాలి (***నిస్త్రైగుణ్యో భవ! గుణాతీతో భవ !***) అనే సందేశం కూడా ***భారత!*** అనే పిలుపులో సంబోధ నాశయమై ఉంది. ***భాయాం బ్రహ్మవిద్యాయాం రతః*** అనే వ్యుత్పత్తి ననుసరించి బ్రహ్మవిద్య యందు రమించు వాడు కనుక, అర్జునుని ***భారత!*** అని సంబోధించి, సర్వులూ ఆ స్థితిని అందుకోవా లనే తన దివ్యసందేశాన్ని సర్వ జనావళికి గీతాచార్యుడు అనుగ్రహిస్తున్నాడు.

*ఎప్పుడు ఏ గుణం ఎలా ఉత్కర్షంగా ఉందో ఎలా తెలుసుకోవాలి? వరుసగా మూడు గుణాలను మూడు శ్లోకాలలో వివరిస్తున్నాడు.*

**సర్వద్వారేషు దేహేఽస్మి న్ప్రకాశ ఉపజాయతే ।**
**జ్ఞానం యదా తదా విద్యా ద్వివృద్ధం సత్త్వ మి త్యుత ॥** 11

***సర్వద్వారేషు-దేహే-అస్మిన్-ప్రకాశః-ఉపజాయతే***
***జ్ఞానం-యదా-తదా-విద్యాత్-వివృద్ధం-సత్త్వం-ఇతి-ఉత***

| | | | | | |
|---|---|---|---|---|---|
| అస్మిన్ | = | ఈ | ఉపజాయతే | = | పుడుతుందో |
| దేహే | = | దేహము నందు | తదా | = | అప్పుడు |
| సర్వద్వారేషు | = | సర్వ ద్వారముల యందు | ఉత | = | అధికంగా |
| ప్రకాశః | = | ప్రకాశ మగు | సత్త్వం | = | సత్త్వగుణము |
| జ్ఞానం | = | జ్ఞానము | వివృద్ధం ఇతి | = | వృద్ధి చెందిన దని |
| యదా | = | ఎప్పుడు | విద్యాత్ ఉత | = | తెలుసుకోవాలి |

**అర్జునా! ఇంద్రియాలు శరీర మార్గాలు. ఆ మార్గాలలో జ్ఞానము, ప్రకాశము విస్తరించింది అంటే, సత్త్వగుణం వృద్ధిలో ఉందని తెలుసుకో!**

### వ్యాఖ్య

ఎప్పుడు ఏ గుణము ఉత్కర్షమై ఉద్భవిస్తుందో ఆ గుణమును గుర్తించ డానికి చిహ్నము లేమిటి (*తస్య కిం లింగమ్*)? అనే విషయాన్ని ప్రస్తావిస్తూ, ముందుగా మొదటి గుణమైన సత్త్వగుణము యొక్క గుర్తులను చెబుతున్నాడు. మనస్సు జ్ఞాన పూరితంగా, ఇంద్రియాలు స్ఫూర్తి దాయకంగా కనిపించి నపుడు సత్త్వగుణము ప్రవృద్ధమై ఉందని గుర్తించ వచ్చు.

గుమ్మాన్ని చూచి గృహాన్ని ఊహించ వచ్చు అంటారు పెద్దలు. గుమ్మం కళాత్మకంగా ఉంటే, గృహం లోపల ఎక్కడ ఉండ వలసిన వస్తువు అక్కడ ఉంటూ ఇల్లు అందంగా, సుందరంగా అలరిస్తూ ఉంటుంది అని అంటారు. అలాగే, దేహము పురుషునికి భోగాయతనము. ఆత్మ వైభవమును గ్రహించ డానికి ఇంద్రియాలు ద్వారాలు. జ్ఞాన స్వరూపమైన జీవాత్మ ఇంద్రియా లనే ద్వారాల ద్వారా బాహ్యానికి గోచర మవుతుంది. పురుషు నకు ఉపలబ్ధి ద్వారాలే శ్రోత్రాది ఇంద్రియాలు (***ఆత్మనః ఉపలబ్ధి ద్వారాణి శ్రోత్రాదీని సర్వాణి కరణాని సర్వ ద్వారేషు***).

బాహ్యం లోని శబ్దాది విషయాలు అంతఃకరణము లోనికి ప్రవేశించడానికి శ్రోత్రాది ఇంద్రియాలే ద్వారాలు. రాత్రిపూట ఇంటి లోపల దీపం వెలుగుతూ ఉంటే, ఆ ప్రకాశము ద్వారము వద్దే కనిపిస్తుంది. అలాగే, సత్త్వగుణము ఉద్భూత మైనపుడు ఆంతర్యము వివేకముతో, సుఖముతో విరాజిల్లుతూ ఉంటుంది కనుక, ఈ జ్ఞానసుఖాలు ద్వారా లైన ఇంద్రియాల ద్వారా బాహ్యానికి విరజిమ్మ బడుతూ ఉంటాయి. వాటి ద్వారా సత్త్వగుణము వివృద్ధమై ఉందని గుర్తించ వచ్చు.

చూచేందుకు కళ్ళున్నాయి. కాని, చూచేది మాత్రము మనస్సే. మనస్సులో సత్త్వగుణము ప్రవృద్ధ మైనపుడు కళ్ళు చూడ వలసిన వాటినే చూస్తాయి. అశ్లీలాలను, అనర్థ విషయాలను చూడవు. నేత్ర ద్వారాలు ఇలా వివేక పూరితంగా, శోభాయమానంగా వర్తిస్తున్నాయి అంటే, మనస్సులో సత్త్వగుణము ఉత్కర్షమై ఉందని ఊహించ వచ్చు.

సత్త్వగుణ ప్రభావం చేత నోరు సాత్త్వికాహారాన్నే స్వీకరిస్తుంది. పలుకులు సాత్త్వికంగా ఉండి వివేక యుతంగా ఉంటాయి. వివేకవంత మైన, జ్ఞాన పూరితమైన విషయాలనే చెవులు వింటాయి. గ్రంథ పఠనం జరిగినా, ఉత్తమమైన గ్రంథాలనే చదవటం జరుగుతుంది కనుక, వ్యక్తి లోని ఆలోచనలు, భావాలు విజ్ఞాన యుతంగా ఉంటాయి. ఏయే ఇంద్రియాల ద్వారా ఏయే కార్యాలు జరుగుతూ ఉండినా, ఆయా కార్యాలు సుఖ రూపాలుగా, ప్రకాశ స్వరూపాలుగా గోచరిస్తూ ఉన్నాయి అంటే, అట్టి ఇంద్రియ ద్వారాలను కలిగిన దేహములో వసించే పురుషుని ద్వారా సత్త్వోత్కర్ష వ్యక్త మవుతూ ఉందని అర్థము.

*ఇక వివృద్ధమైన రజో గుణమును గుర్తించే చిహ్నములను వివరిస్తున్నాడు.*

**లోభః ప్రవృత్తి రారమ్భః కర్మణా మశమః స్పృహా ।**
**రజ స్యేతాని జాయన్తే వివృద్ధే భరతర్షభ ॥** 12

***లోభః-ప్రవృత్తిః-ఆరంభః-కర్మణాం-అశమః-స్పృహా***
***రజసి-ఏతాని-జాయంతే-వివృద్ధే-భరతర్షభ***

| | | |
|---|---|---|
| భరతర్షభ | = | అర్జునా! |
| రజసి | = | రజోగుణము |
| వివృద్ధే | = | వృద్ధిని పొందినపుడు |
| లోభః | = | లోభము |





| | | |
|---|---|---|
| ప్రవృత్తిః | = | ప్రవృత్తియు |
| కర్మణాం | = | కర్మల యొక్క |
| ఆరంభః | = | ఆరంభము |
| అశమః | = | అశాంతి |
| స్పృహా | = | ఆశ |
| ఏతాని | = | ఇవి |
| జాయంతే | = | కలుగుతాయి |

**అర్జునా! రజోగుణము వృద్ధిని పొంది నపుడు లోభము, వ్యాపకము, కర్మారంభము, అశాంతి, ఆశ మొదలైనవి పుడుతూ ఉంటాయి.**

### వ్యాఖ్య

రజోగుణము అతిశయించి నపుడు కనిపించే చిహ్నాలను చెబుతున్నాడు (***రజసః ఉద్భూతస్య ఇదం చిహ్నమ్***). వ్యక్తిలో గోచరించే ఈ చిహ్నాల ద్వారా వ్యక్తి మనస్సులో రజోగుణము వృద్ధిలో ఉందని గుర్తించ వచ్చు.

ఎవరిలో అయితే రజోగుణము ప్రవృద్ధమై ఉంటుందో వారిలో ముఖ్యంగా, ప్రథమంగా లోభ ప్రవృత్తి కనిపిస్తుంది. లోభము అంటే పరుల ధనమును లేదా సంపదను గ్రహించాలనే కోరిక (***లోభః పరద్రవ్యాది త్సా***). ఇదొక ధన దాహం. ఒక వ్యక్తి చలిపందిరి వద్ద నిలబడి ఎడతెరపి లేకుండా నీటిని పానం చేస్తూ ఉంటే, ఆ వ్యక్తి అధిక దాహంతో ఉన్నాడని గుర్తిస్తాము. అలాగే ఒక వ్యక్తి పరుల ధనాన్ని ఆశించే కార్యం లోనే నిమగ్నమై ఉన్నాడు అంటే, ఆ వ్యక్తిలో ధనదాహం, లోభగుణం ఎక్కువగా ఉందని గ్రహించ వచ్చు. ఈ లోభము అనే గుణము రజస్సుకు సంబంధించింది కనుక లోభిలో రజోగుణము ప్రవృద్ధమై ఉందని గ్రహించ గలుగుతాము.

లోభి నిరంతరము ప్రోగు చేసుకొనే ప్రయత్నము లోనే ఉంటాడు. పరుల ద్రవ్యమును ఆర్జించుట యందే ఆసక్తిని కలిగి ఉంటాడు. ఆర్జనలో ఎంత ఆసక్తిని కలిగి ఉంటాడో, వ్యయంలో అంతగా అనాసక్తిని ప్రదర్శిస్తూ ఉంటాడు. ఏదైనా రావాలే గాని, ఏదీ పోకూడదు అనేది లోభి సిద్ధాంతము. పరుల ద్రవ్యమును పొందే ప్రయత్నంలో నిత్యాశ ఉండటమే కాదు, అలా తాను ఆశించినది లభించ నపుడు నిరాశ చెందే స్వభావము, పరితపించే లక్షణము కూడా కలిగి ఉంటాడు. పరుల సొమ్ము వస్తూ ఉండాలి. తన సొత్తు పోకుండా ఉండాలి. ఇలాంటి లోభ ప్రవృత్తి ఎవరిలో గోచరిస్తూ ఉంటుందో, వారిలో రజోగుణము సమున్నత స్థాయిలో ఉందని గుర్తించ వచ్చు.

లోభముతో పాటు కర్మ ప్రవృత్తి మెండుగా ఉంటుంది. ఏయే కార్యాలు చేస్తే ధనం ప్రోగవుతుందో అలాంటి కార్యాలను ఆచరించాలనే ప్రవృత్తి పుష్కలంగా కనిపిస్తుంది. ఈ విధమైన ప్రవర్తనము సర్వ సాధారణంగా గోచరిస్తుంది (***ప్రవృత్తిః ప్రవర్తనం సామాన్య చేష్టా***).

కర్మ ప్రవృత్తి ఉంది కనుక ప్రవాహ రూపంలో కర్మాచరణము జరుగుతూ ఉంటుంది (***ఆరంభః కర్మణాం***). లోభము ప్రధానంగా ఉండటం చేత, ఆ కర్మలు కూడా సకామ కర్మలుగా ఉంటాయి. ఫలాసక్తితో నిండి ఉంటాయి. ఆ కర్మల మధ్య మనిషి అలసి పోతూ ఆవేదన చెందుతూ ఉంటాడే గాని ప్రశాంతంగా ఉండ లేడు. వ్యక్తిలో కనిపిస్తున్న ఈ అశాంతి అతిశయించిన రజోగుణానికి అద్దం పడుతుంది. ఈ విధంగా మనస్సు శాంతిని కోల్పోవడమే అశమము. శమము లేని స్థితి (***అశమః అనుపశమః***).

రజోగుణము ఉత్కర్షమై ఉన్నపుడు మనస్సులో రాగద్వేషాలే కదుల్తూ ఉంటాయి. ఇవే కర్మ స్పృహను కలిగిస్తూ ఉంటాయి (***స్పృహ సర్వ సామాన్య విషయా తృష్ణా***). ఏది చూచినా అది తనకే కావాలి. తనకే రావాలి. ఇప్పుడు దీనిని సాధించి, ఆ తరువాత దానిని సాధిస్తాను అనే కర్మ స్పృహే సదా ఉంటుంది. ఎప్పుడైతే రజోగుణము వ్యక్తిలో ఉద్భూతమై ఉంటుందో (***రజసి గుణే వివృద్ధే***) అప్పుడు ఇంతవరకు మనం చూచిన

లోభాది కర్మ స్పృహాంతం ఆ వ్యక్తిలో గోచరిస్తూ ఉంటుంది (*ఏతాని లింగాని జాయన్తే!*). ఈ గుర్తులను బట్టి అతడిలో రజోగుణము అతిశయించి ఉందని గ్రహించ వచ్చు.

*ఇక మూడవ దైన తమోగుణము అతిశయించి ఉన్నపుడు చిహ్నాలు ఎలా ఉంటాయో చెబుతున్నాడు.*

**అప్రకాశోఽ ప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ ।**
**తమ స్యేతాని జాయన్తే వివృద్ధే కురునన్దన ॥** 13

*అప్రకాశః-అప్రవృత్తిః-చ-ప్రమాదః-మోహః-ఏవ-చ*
*తమసి-ఏతాని-జాయంతే-వివృద్ధే-కురునందన*

| | | | | | |
|---|---|---|---|---|---|
| కురునందన | = | అర్జునా! | ప్రమాదః | = | అజాగ్రత్త |
| తమసి | = | తమోగుణము | మోహః ఏవ చ | = | మోహము |
| వివృద్ధే | = | వృద్ధి చెందినపుడు | ఏతాని | = | ఇవి |
| అప్రకాశః | = | అజ్ఞానము | జాయంతే | = | కలుగుతాయి |
| అప్రవృత్తిః చ | = | నిర్వ్యాపారం | | | |

**అర్జునా! తమోగుణము వృద్ధి చెంది నపుడు అవివేకము, సోమరితనము, ప్రమాదము, మోహము కలుగుతూ ఉంటాయి.**

**వ్యాఖ్య**

తమోగుణము ఉద్భూత మైనపుడు అప్రకాశము, అప్రవృత్తి, ప్రమాదము, మోహము అనేవి పుడుతూ ఉంటాయి.

**అప్రకాశము**

అప్రకాశము అంటే ప్రకాశము లేక పోవడము. ప్రకాశము అంటే వివేకము, లేదా జ్ఞానము అని సత్త్వ గుణము విషయంలో చెప్పుకున్నాం. దానికి అత్యంత విరుద్ధ మైన అవివేకము, లేదా అజ్ఞానమే అప్రకాశము (*అప్రకాశః అవివేకః అత్యన్తమ్*). అదే వివేక భ్రంశము.

బాహ్యంలో సూర్య ప్రకాశము దివ్యంగా భాసిస్తున్నా, ఇంటి తలుపులు, కిటికీలు మూసుకొని కూర్చుంటే, లోపల చీకటి ఉంటుందే గాని వెలుగు ఎక్కడుంటుంది? జ్ఞాన కారణ మున్నా, తమోగుణములో ఉండే వ్యక్తికి జ్ఞానము కలగదు. అదే ఇక్కడ అప్రకాశము. ఒక వైపు ఆచార్యుడు బోధిస్తూ ఉన్నా, అందుకో లేని అధ్వాన స్థితిలో అంతఃకరణ ఉంటుంది.

అవివేకము కారణంగా యుక్తాయుక్త విచక్షణ లోపిస్తుంది. ఇది చేయదగిన కార్యము, ఇది చేయకూడని కార్యము అనే వివేకము తమోగుణంలో ఉండదు. వివేకము లేని కారణంగా వ్యక్తిలో సుఖము ఉండదు. సుఖము, జ్ఞానము లేని కారణంగా వ్యక్తి శక్తిహీను డవుతాడు. వివేక శక్తి లోపించి నపుడు తనకు తానుగా ఏ విషయాన్ని నిర్ణయించ లేడు సరి కదా, ఇతరులు చెప్పినా వినే జ్ఞానము లేకుండా ఉంటాడు. కనుక, ఈ అప్రకాశ దశలో అంతా జ్ఞానాభావమే.

**అప్రవృత్తి**

ప్రవృత్తి అంటే కార్యాచరణము. ఉద్యమ స్ఫూర్తి. అప్రకాశము వల్ల ఉత్సాహం క్షీణించి ఉంటుంది





కనుక ఉద్యమ స్ఫూర్తి కనిపించదు. ఏ పనిని చేయాలని ఉండదు. ఇదే అప్రవృత్తి. పనులు చేయలేక పోవడము (*అప్రవృత్తిః ప్రవృత్త్య భావః*). ఉద్యమ రాహిత్యము.

జ్ఞానశుద్ధి లేకుండా కర్మశుద్ధి రాదు. అప్రకాశం కారణంగా జ్ఞానము ఎప్పుడైతే లోపించిందో, వివేక శూన్యత వల్ల అప్రవృత్తి ఏర్పడి కార్యారంభమే జరగదు. అప్రకాశ అప్రవృత్తుల ఫలంగా జ్ఞాన, కర్మల యందు అభావమే అందల మెక్కుతుంది. అంతా స్తబ్దతే.

చేయవలసిన కార్యాలు ఉండినా చేయలేని అసమర్థతే అప్రవృత్తిలో అగుపిస్తుంది. ఏది మొద లెట్టాలన్నా సమస్యే. అన్నీ ఆరంభ ప్రతిబంధకాలే. ఏ కార్యాన్ని చేపట్టాలన్నా తిథి వార నక్షత్రా లంటూ, వాటిలో ఏదో సరిగ లేదని కాలయాపన చేస్తూ కార్యాన్ని కాలానికి నెట్టేసే గుణం అప్రవృత్తి లక్షణం.

అప్రవృత్తి లక్షణము తమోగుణము నుండి ఉత్పన్న మైంది. తమోగుణం వృద్ధి చెందిన వ్యక్తులలో అప్రకాశ కారణంగా వివేకము లోపించి ఉండటం చేత, వీరు మరేవో కారణాల్ని చూపెడుతూ అప్రవృత్తిని కొనసాగిస్తూ ఉంటారు. ఈ విధమైన అప్రవృత్తికి కొందరు వాస్తు శాస్త్రాన్ని కూడా వాడుకుంటారు. గృహ వాస్తు సరిగా లేదనో, గ్రహబలము చాలినంత లేదనో కారణాలను ఏకరవు పెడుతూ స్తబ్దతను కొనసాగిస్తూ ఉంటారు. అలాంటి వారు వాస్తు పండితులు మార్పులు సూచించినా, జ్యోతిష్కులు గ్రహశాంతిని బోధించినా, వింటారే గాని ఆచరించరు. గృహ మార్పు లెందుకు చేయలేదని వాస్తు పండితుడు అడిగితే, అలా చేయలేక పోవడానికి కూడా వాస్తు దోషమే కారణ మేమో అని పండితుణ్ణే తికమక పెడతారు. అలాగే గ్రహాలు భీష్మించుకొని ఉన్నందుకే గ్రహశాంతి సాధ్యం కాలేదని జ్యోతిష్కుణ్ణే సందిగ్ధంలో పడేస్తారు. అప్రవృత్తికి అనేక దారులు. ప్రవృత్తి కారణాలు ప్రవృత్తికి ఉన్నట్లే, అప్రవృత్తి కారణాలు అప్రవృత్తికి ఉంటాయి.

**ప్రమాదము**

ఆరంభ ప్రతిబంధకాలలో అప్రవృత్తి ఎలాంటిదో ప్రమాదము కూడా అలాంటిదే. ప్రమాదము అంటే మరపు. చేయ వలసిన కార్యాన్ని నిరంతరము మరచి పోతూ ఉండటమే ప్రమాదము. అలా అన్నిటినీ మరచి పోయేవాడు ఏ కార్యాన్ని ఆచరిస్తాడు? చేయ గలిగే శక్తి ఉండినా చేయలేని అసమర్థతే ప్రమాదము. ఎవరిలో మరపు, సోమరితనము ఉంటాయో, అలాంటి వారు ఏవేవో చేస్తామని చెబుతూ ఉంటారే గాని ఏవీ చెయ్య లేరు. ఇదంతా ప్రమాదమే. తమోగుణ ప్రభావమే.

**మోహము**

తమోగుణము అతిశయించిన వ్యక్తిలో మూఢత్వము ఉంటుంది. అదే మోహము. వివేకము అసలే లేని స్థితి (*మోహః ఏవ చ అవివేకః మూఢతా ఇత్యర్థః*). ఏది చేయదగిన కార్యమో దానిని అవివేకం కారణంగా చేయక పోవడమే గాక, ఒకవేళ చేసినా, మూఢత్వం కారణంగా పొరపాటు చేయడమే జరుగుతుంది. ఉన్న దానిని లేనట్లు, లేని దానిని ఉన్నట్లు వీక్షించే భ్రమయే మోహము. ఈ కారణంగా కార్యాచరణము చేపట్టినా దోషాల తోనే నిండి ఉంటుంది.

ఇంత వరకు మనం చూచిన ఈ తమోగుణ లక్షణాలను దాటినపుడే ఎందులో నైనా ప్రగతిని సాధించ గలము. ఉత్కృష్టమైన స్థాయికి చేరాలని అభిలషించే వారు నికృష్టమైన ఈ అప్రకాశాది తమోగుణ లక్షణాల నుండి విడి పడాలి. అందుకనే ఈ శ్లోకంలో అర్జునుని ***కురునందన*** అని సంబోధించడం జరిగింది. కురు వంశము ఉన్నత మైనది, ఉత్కృష్ట మైనది. ఉత్తమ వంశమున ఉద్భవించిన వాడు తమోద్భూత విషయాలకు దూరం కావాలి అని సూచించడమే ***కురునందన*** సంబోధన లోని ఆంతర్యము.

త్రిగుణములను గురించి ఇంతగా విస్తరించి చెప్పడం కేవలం గుణ ప్రవృత్తులను, గుణ ప్రభావాలను తెలుసుకుంటా రని కాదు. అలా గుణాల వాస్తవికత అర్థమైతే, వాటి నుండి విడిపడి గుణాతీత స్థితికి చేరుతా రనే భావం తోనే గుణచర్చను చేయడం జరిగింది. విని మరచి పోవడం కాకుండా వినిన దానిని ఆచరించ మని తెలిపేందుకే **కురునందన** అన్నాడు. 'కురు' అంటే ఆచరించ మని అర్థము. 'నందన' మంటే సుఖ పెట్టేది, ఆనందింప చేసేది అని అర్థము. గుణాలను అతిక్రమించే కార్యములో సఫలీకృతమై, ఆనందాన్ని అనుభవించ మని సూచించడం కూడా **కురునందన** సంబోధ నాశయమై ఉంది.

*గుణోత్కర్ష వల్ల జీవితంలో ఎలాంటి ప్రభావం ఉంటుందో, మరణకాలంలో గుణోత్కర్ష వల్ల జన్మాంతరాలలో అలాంటి ఫలమే ప్రాప్తిస్తుందని చెబుతున్నాడు.*

**యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రలయం యాతి దేహభృత్ ।**
**త దోత్తమవిదాం లోకా నమలా న్ప్రతిపద్యతే ॥** 14

***యదా-సత్త్వే-ప్రవృద్ధే-తు-ప్రలయం-యాతి-దేహభృత్***
***తదా-ఉత్తమ విదాం-లోకాన్-అమలాన్-ప్రతిపద్యతే***

| | | | | | |
|---|---|---|---|---|---|
| యదా | = | ఎప్పుడు | తదా | = | అప్పుడు |
| సత్త్వే | = | సత్త్వగుణము | ఉత్తమవిదాం | = | ఉత్తమ జ్ఞానుల యొక్క |
| ప్రవృద్ధే | = | వృద్ధి నొందినపుడు | అమలాన్ | = | నిర్మలమైన |
| దేహభృత్ | = | దేహధారి | లోకాన్ | = | లోకములను |
| ప్రలయం తు | = | ప్రళయమును | ప్రతిపద్యతే | = | పొందుతున్నాడు |
| యాతి | = | పొందుతున్నాడు | | | |

**సత్త్వగుణము అతిశయించి నపుడు జీవుడు మరణిస్తే, ఉత్తమ జ్ఞానులు పొందే పుణ్య లోకాలను పొందుతాడు.**

**వ్యాఖ్య**

**మతి - గతి**

***న అబీజాత్ జాయతే*** - విత్తనం నాటనిదే అంకురము మొల కెత్తదు. ఏదైనా చేస్తేనే వస్తుంది. చేయనిది రావలన్నా రాదు. ఇది చేశాను, ఇది చేస్తున్నాను, ఇది చేయబోతాను అని మనిషి ఆలోచిస్తూ ఉండొచ్చు. నువ్వు చెయ్యా లనుకున్నది చేశావా లేదా అని చూడ కుండా మృత్యువు తన పనిని తాను చేసుకొని పోతుంది. మరణ కాలం ప్రాప్తించ నంత వరకు ఎంతో సహనంతో నిరీక్షించే మృత్యువు, కాలం సమీపిస్తే క్షణం ఆగడానికి కూడా అసహనాన్ని ప్రదర్శిస్తుంది. మనిషి మృత్యుముఖంలో ప్రవేశించే టప్పుడు ఉన్న వన్నీ ప్రేక్షకు ల్లాగా చూస్తూ ఉండి పోతాయి. వెంట వచ్చేవి రెండే. ఒకటి ఆచరించిన కర్మ. రెండవది ఆర్జించిన జ్ఞానం.

భోగాయతనంగా అంత వరకు తోడుగా ఉన్న దేహం మృత్యు ఘాతానికి కూలి పోతుంది. నేల రాలి పోతుంది. చావు దెబ్బ అలాగే ఉంటుంది. దేహం రాలి పోయినా దేహి రాలిపోడు. ఎగిరెగిరి పక్షిలా పారి పోతాడు. ఎక్కడికి పోతాడు? ఏమో! ఎవరు ఎక్కడికి పోవాలో నిర్ణయించేది విధి కాదు; వ్యక్తి. ఎవరు ఎక్కడికి పోవాలో ఎవరికి వారే నిర్ణయించు కుంటారు. ఎవరు ఎలా బ్రతకా లనుకుంటే అలా బ్రతుకుతారు. ఎవరు ఎలా చావా లనుకుంటే అలా చస్తారు. చచ్చిన తరువాత ఎవరు ఎక్కడికి చేరా లనుకుంటే అక్కడికి చేరుతారు.

అంతా భావం లోనే ఉంది. భావంలో ఉన్నదే బ్రతుకులో తాండ విస్తుంది. బ్రతుకులో తాండవించిందే





చావులో తొంగి చూస్తుంది. అదే తరువాత జన్మకు గంతు లేస్తుంది. కేవలం భావంలో ఉంటే చాలదు. భావంలో ఉన్నది బ్రతుకు లోకి రావాలి. బ్రతుకంతా ఏది ఉంటుందో అదే చావులో గోచరిస్తుంది. ఇక్కడ లేనిది ఒక్కసారిగ అక్కడ ఊడి పడదు.

***శ్వః కార్య మద్య కుర్వీత*** - రేపు చెయ్యా లనుకున్నది నేడు పూర్తి చేసుకోవడమే మంచిది అన్నారు పెద్దలు. రేపు మీద చూపు ఉండటం తప్పు కాదు. కాని, రేపు యొక్క రూపు ఎలా ఉంటుందో చూపుకు అందదు. ఊహకు చిక్కదు.

*తీర మెక్కడో కనుచూపుకు కానరాదు*
*భార మైనది పయనించు బ్రతుకు నావ*
*ఎపుడు మునుగునో తెలియదు రక్షించు దేవా!*
*నీ అడుగుల కడ పడి ఉందు నీలకంఠా !*

అని నీలకంఠ శతకంలో ఒక విబూది పండు.

మనిషి మనుగడ లోని ప్రవృత్తికి హేతువు, ప్రవర్తనకు కారణము మనస్సు లోని వృత్తులే, గుణాలే. అవే బ్రతుకులో కదులుతూ ఉంటాయి. మరణకాలంలో మనస్సు యొక్క స్థితిని బట్టే ఉత్తర జన్మ నిర్ణయింప బడుతూ ఉంటుంది. అంత్యకాలంలో ఏ గుణము అతిశయించి ఉంటుందో, ఆ గుణానుసారం గానే ఉత్తర స్థానాలు, స్థావరాలు నిర్ణయింప బడుతాయి.

జీవితంలో ఏ గుణము ప్రశస్తంగా, ప్రముఖంగా ఉద్భూతమై ఉంటుందో, ఆ గుణమే మరణకాలంలో ఉత్కర్షంగా ఉంటుంది. అదే ఉత్తర జన్మకు దారి చూపుతుంది.

అర్జునా! సత్త్వగుణము అతిశయించి ఉన్నప్పుడు ***( యదా సత్త్వే ప్రవృద్ధే)*** మరణమును పొందిన వాడు ***(ప్రలయమ్ యాతి )*** అతడు ఉత్తమవిదులు ఉండే నిర్మలమైన లోకాలను పొందుతాడు ***( ఉత్తమ విదాం తత్త్వవిదాం లోకాన్ అమలాన్ ప్రాప్నోతి )*** అంటున్నాడు భగవంతుడు. సంగ రాగాదుల కారణంగా మరణం ద్వారా ఏ ఫలమైతే పొంద బడుతూ ఉందో అదంతా గుణాల వల్లే కలుగుతూ ఉంది అని నిర్ధారణ చేస్తున్నాడు. ఇది కాస్త జాగ్రత్తగా అర్థం చేసుకో వలసిన విషయం.

***యత్కర్మ కురుతే తదభి సంపద్యతే*** - మానవుడు ఏ విధమైన కర్మను ఆచరిస్తాడో దానికి అనుగుణమైన లోకాన్నే పొందుతాడు అనేది శ్రుతి ప్రమాణము. మరి, ఇక్కడ కర్మానుసారము అనకుండా గుణానుసారము అని చెప్పడం ప్రమాణ విరుద్ధం కాదా? అనే శంక తలెత్తే అవకాశము లేక పోలేదు. ఈ సందేహం యుక్తం కూడా. కాకపోతే, జీవించి ఉన్నప్పుడు ఆచరించిన పుణ్యపాప కర్మలకు వశ పడే మరణకాలంలో గుణోత్కర్ష ఉంటుంది. అంతేగాని కర్మఫలాలు, ఫలహేతువులు గుణ జన్యములు అని కాదు.

**సత్త్వ గుణోత్కర్ష**

పగలంతా పవిత్రంగా జీవించిన వాడు రాత్రి పూట ప్రశాంతంగా నిద్ర పోతాడు. రాత్రంతా ప్రశాంతంగా నిద్రించిన వాడు ఉదయాన్నే నిర్మలంగా నిద్ర లేస్తాడు. అలాగే, జీవిత మంతా సాత్త్వికంగా జీవించిన వానికి మరణ కాలంలో సత్త్వగుణమే ఉద్భూత మౌతుంది. అంత్యకాలంలో వివేక సుఖాలకు ఆలవాలమైన సత్త్వగుణము అతిశయించి ఉండటం చేత, మరణించిన తరువాత సత్త్వగుణ ప్రధానుడైన ఆ వ్యక్తి జ్ఞానాభిలాషులైన బ్రహ్మోపాసకులు సుఖించే ఉత్తమ లోకాలను పొందుతాడు.

ఉత్తమవిదులు అంటే తత్త్వ జ్ఞానాభిలాషులు. అట్టి వారు సుఖ జ్ఞానాలతో ప్రకాశించే బ్రహ్మాది లోకాలను పొందుతారు అని అర్థము. ఈ లోకాలు నిర్మల మైనవి అంటున్నాడు. నిర్మల మైనవి అంటే పరిశుద్ధ మైనవి, మల రహిత మైనవి అని అర్థము ***(లోకాన్ అమలాన్ మల రహితాన్).*** జన్మ జరాది దుఃఖాలే ఇక్కడ మలము. నిర్మలము అంటే జన్మ, మృత్యు, జరాది దుఃఖాలు, ఆకలిదప్పులు, వ్యాధులు, వృద్ధి క్షయాలు తెలియని లోకాలు అని అర్థము. అక్షర పరబ్రహ్మ యోగంలో దీనినే శుక్లగతిగా అర్థం చేసుకున్నాం.

జీవితకాలంలో ఏ గుణము ప్రవృద్ధమై ఉంటుందో, మరణకాలంలో ఆ గుణమే ఉత్కర్ష స్థితిలో ఉండి ఉత్తర గమనాన్ని నిర్దేశిస్తుంది. బ్రతుకులో సాత్త్విక జీవనాన్ని సాగించిన వాడు మరణకాలంలో ఉద్భూత మైన సత్త్వోత్కర్ష వలన నిర్మలమైన లోకాలను పొంది, కాలానుగుణంగా పునర్జన్మ నెత్తుతాడు. అంతేగాని, సత్త్వగుణోత్కర్షతో మరణించిన వాడు మోక్షమును పొందడు. బ్రహ్మ భావముతో దేహత్యాగం చేసిన వాడే జన్మ రాహిత్యాన్ని పొందుతాడు. ఈ విషయాన్ని ఎనిమిదవ అధ్యాయం - ఐదవ శ్లోకంలో చూశాము.

*మరణకాలంలో సత్త్వగుణోత్కర్ష కాకుండా, రజోగుణ, తమోగుణాలు ఉద్భూతమైతే ఉత్తరయాత్ర ఎలా ఉంటుందో చెబుతున్నాడు.*

**రజసి ప్రలయం గత్వా కర్మసఙ్గిషు జాయతే ।**
**తథా ప్రలీన స్తమసి మూఢయోనిషు జాయతే ॥** 15

***రజసి-ప్రలయం-గత్వా-కర్మసంగిషు-జాయతే***
***తథా-ప్రలీనః-తమసి-మూఢయోనిషు-జాయతే***

| | | | |
|---|---|---|---|
| రజసి | = రజోగుణము వృద్ధి నొంది నపుడు | తథా | = అట్లే |
| ప్రలయం | = మృతిని | తమసి | = తమోగుణము నందు |
| గత్వా | = పొంది | ప్రలీనః | = మృతి నొందిన వాడు |
| కర్మసంగిషు | = కర్మసంగత్వము గల వారి యందు | మూఢయోనిషు | = మూఢ ప్రాణుల యందు |
| జాయతే | = పుడుతున్నాడు | జాయతే | = పుడుతున్నాడు |

**రజోగుణము వృద్ధి నొందినపుడు మరణించు వాడు కర్మాసక్తులైన మానవుల యందు పుడుతాడు. తమో గుణము వృద్ధి చెంది నపుడు చనిపోయిన వాడు మూఢ జీవుల యందు పుడుతాడు.**

**వ్యాఖ్య**

బుద్ధిలో భావాలకు అనుగుణంగా బ్రతుకులో కార్యాలు సాగుతాయి. కార్య రూపం లోకి దిగిన భావాలే అనుభవాలను అందిస్తాయి. భావాలు ఉన్నతంగా ఉంటే భవిష్యత్తు ఉత్కృష్టంగా ఉంటుంది. భావాలు నీచంగా ఉంటే బ్రతుకు పతనావస్థకి దిగజారి పోతుంది.

బుద్ధిలో చూచిన ఆలోచనలే బ్రతుకులో కార్యాలుగా వ్యక్త మవుతాయి. కార్యాలుగా ఆచరింప బడిన వాటి ఫలాలనే బ్రతుకులో చవి చూస్తాము. చేసిన కర్మ ఆగుతుంది. అంతమాత్రాన ఫలం ఆగిపోదు. కర్మను ఆచరించిన వానిని కర్మఫలం నీడలా వెంబడిస్తూనే ఉంటుంది. ఆయా కాలాలలో మొక్కలు పుష్పించినట్లు, ఫలించినట్లు, బ్రతుకులో చూచినవే మరణంలో తొంగి చూస్తాయి. వాటి ఫలాలే ఉత్తర ప్రయాణంలో అందుతూ ఉంటాయి. మరణ కాలంలో సత్త్వగుణం ఉద్భూతం అయిన వారికి మరణానంతరము ఉత్తమ లోకాలు





ప్రాప్తిస్తా యని పూర్వ శ్లోకంలో చూశాము. ఇక మరణకాలంలో రాజస తామస గుణాలు ప్రవృద్ధమైన వారు మరణానంతరము ఎక్కడికి చేరుతారో ప్రస్తుత శ్లోకంలో చూస్తాము.

అర్జునా! రజోగుణము వృద్ధి చెందినపుడు ***(రజసి గుణే వివృద్ధే)*** మరణించిన వాడు ***(ప్రలయం మరణం, గత్వా ప్రాప్య )*** కర్మాసక్తి గల వారి మధ్య పుడుతాడు ***( కర్మసంగిషు జాయతే, కర్మాసక్తి యుక్తేషు మనుష్యేషు జాయతే)*** అంటున్నాడు భగవానుడు.

అలాగే తమోగుణము వివృద్ధ మైనపుడు ***(తమసి వివృద్ధే)*** మరణించిన వాడు ***(ప్రలీనః మృతః)*** మూఢ యోనుల యందు పుడుతాడు ***( మూఢ యోనిషు పశ్వాది యోనిషు జాయతే).*** పశ్వాది యోనుల యందు, అంటే తిర్యగ్జంతువుల యందు పుడుతాడు అని అర్థం.

**రజోగుణోత్కర్ష**

రజోగుణము ప్రవృద్ధ మైనపుడు దేహమును త్యజించిన వాడు కర్మాచరణమునకు అనుకూలమైన మానవ లోకంలో జన్మిస్తాడు. కర్మాచరణము జంతువులలో కూడా కనిపిస్తుంది. కాని, ఇక్కడ చెప్పబడే కర్మ క్షేత్రము ధర్మాచరణ మునకు అనుకూలమైన కర్మ క్షేత్రము కనుక, అతడు విధి నిషేధ కర్మ ఫలానుభవమును పొందే మానవుల మధ్య పుడుతాడు అని అర్థం.

రజోగుణము రాగాత్మక మని తెలుసుకున్నాం. రాగాత్మకము కనుక కర్మసంగము అనివార్యం. రజో గుణము ప్రవృత్తి హేతువు కావడం చేత కర్మాచరణమునకు అనుగుణమైన ప్రదేశం లోనే జన్మించ వలసి ఉన్నందున, రజో గుణము ఉద్భూత మైనపుడు మరణించిన వాడు పుణ్యపాప కర్మ ఫలానుభవము కొరకు మానవ లోకంలో మానవుడుగా పుడుతాడు.

**తమోగుణోత్కర్ష**

తమస్సు వృద్ధి చెందినపుడు దేహమును త్యజించిన వాడు మూఢ యోనుల యందు, అంటే పశుపక్ష్యాది జంతు ప్రపంచంలో జన్మిస్తాడు. ప్రమాదాలస్య నిద్రాదులే తమోగుణంలో ప్రధానంగా ప్రదర్శింప బడుతూ ఉంటాయి. అక్కడ ప్రకాశానికి సంబంధించిన సత్త్వమునకు గాని, ప్రవృత్తికి సంబంధించిన రజస్సునకు గాని అవకాశము లేనందున, కేవలం మూఢంగా జీవించే మనుగడ కావడం చేత, తిర్యగ్జంతువుల యందు పుట్టడం జరుగుతుంది.

**మరో కోణం**

ఈ సందర్భములో ఆసక్తికరమైన ఒక విషయాన్ని మనం అర్థం చేసుకోవాలి. సత్త్వగుణము ప్రవృద్ధ మైనపుడు మరణించే వారు ఉత్తమవిదుల లోకాలను, అలాగే తమోగుణము ప్రవృద్ధ మైనపుడు మరణించిన వారు మూఢ యోనులను చేరుతారు అనే దానిని వేరొక కోణం నుండి చూచినా దోషం లేదు అని నా అభిప్రాయం.

సాత్త్వికులు ఉత్తమవిదుల లోకాలను చేరుతారు అంటే అవి బ్రహ్మోపాసకులు వసించే బ్రహ్మాది లోకాలు కావచ్చు. లేదా బ్రహ్మచింతనా పరులైన బ్రహ్మవిదులు వసించే సంప్రదాయము గల కుటుంబాలు కావచ్చు. అవి కూడా వివేక, సుఖ స్థానాలే కనుక.

అలాగే తామసికులు తిర్యగ్జంతు ప్రపంచంలో పుడుతారు అంటే, జంతువులు గానే పుట్టాలని లేదు. పశువులు గానే పుట్టాలనీ కాదు. పశు ప్రవృత్తి గల జంతు జీవనానికి అలవాటు పడిన మానవుల యందు జంతు

మానవుడుగా పుట్టినా పుట్ట వచ్చు. జంతువులు సైతం సిగ్గుపడేలా వ్యవహరిస్తున్న మానవుల్ని మనం నేటి సమాజంలో చూస్తూనే ఉన్నాం కదా! వారిని మనుషుల జాతిలో జమ కట్టాలా? లేక జంతువులని సరిపెట్టుకోవాలా? మీరే ఆలోచించండి!

ఇది కేవలం నా అభిప్రాయం. పెద్దగా చర్చించ వలసిన విషయ మేమీ కాదు. మానవుల సూక్ష్మ దేహాన్ని దృష్టిలో ఉంచుకొని చేసిన ఆలోచనే గాని మరొకటి కాదు. ఒకవేళ సంప్రదాయ విదులకు నచ్చకపోతే వారు దీనిని విస్మరించ వచ్చు.

ఇంతవరకు, త్రిగుణాలు ప్రకృతి సంభవాలు అని తెలుసుకున్నాం. ఈ గుణాలు మూడూ దేహిని దేహంలో ఎలా బంధిస్తున్నాయో అర్థం చేసుకున్నాం. అలాగే ప్రత్యేకంగా ఒక్కొక్క గుణం యొక్క లక్షణాలు ఏమిటో, ఒక్కొక్క గుణము పురుషునికి ఎలా బంధ హేతువు అవుతూ ఉందో కూడా చెప్పుకున్నాం. ఆ తరువాత గుణ వ్యాపారాలను సంక్షేపంగా చెప్పుకొని, ఒక్కొక్క గుణం విశేషంగా ఉత్కర్ష మైనపుడు దాని లక్షణాలు ఎలా అభివ్యక్త మవుతాయో గ్రహించాము. ఇక చివరగా, మరణకాలంలో ప్రవృద్ధ మయ్యే గుణాలకు ఎలాంటి ఉత్తర జన్మలు ప్రాప్తిస్తాయో కూడా సహేతుకంగా, సశాస్త్రీయంగా అర్థం చేసుకున్నాం.

*ఇప్పుడు పై శ్లోకాల యొక్క అర్థాన్ని సంక్షేపంగా చెప్పుకుంటే : గుణ ప్రధానంగా కర్మాచరణము జరిగే టప్పుడు కర్మలు కూడా సాత్త్విక కర్మలు, రాజస కర్మలు, తామస కర్మలుగా విభజింప బడతాయి కనుక, ఈ విధమైన త్రివిధ కర్మలకు ఫలితాలు కూడా త్రివిధం గానే ఉండాలి. వాటినే ఇప్పుడు వరుసగా మూడు శ్లోకాలలో, అంటే పదహారు, పదిహేడు, పద్దెనిమిదవ శ్లోకాలలో వివరించ బోతాడు. ఈ విధంగా ఐదవ శ్లోకం వద్ద ఆరంభించిన గుణత్రయ ప్రకరణాన్ని ఏకబిగిన పద్నాలుగు శ్లోకాలలో ప్రవచించి పద్దెనిమిదవ శ్లోకం వద్ద సమాప్తం చేస్తున్నాడు.*

**కర్మణః సుకృత స్యాహుః సాత్త్వికం నిర్మలం ఫలమ్ ।**
**రజస స్తు ఫలం దుఃఖ మజ్ఞానం తమసః ఫలమ్ ॥** 16

***కర్మణః-సుకృతస్య-ఆహుః-సాత్త్వికం-నిర్మలం-ఫలం***
***రజసః-తు-ఫలం-దుఃఖం-అజ్ఞానం-తమసః-ఫలం***

| | | | | | |
|---|---|---|---|---|---|
| సుకృతస్య | = సుకృతమైన | | దుఃఖం | = | దుఃఖము |
| కర్మణః | = కర్మకు | | ఫలం | = | ఫలము |
| సాత్త్వికం | = సాత్త్వికమైన | | తమసః | = | తమోగుణమునకు |
| నిర్మలం | = నిర్మలత్వము | | అజ్ఞానం | = | అజ్ఞానము |
| ఫలం | = ఫలము | | ఫలం | = | ఫలము అని |
| రజసః తు | = రజోగుణమునకు | | ఆహుః | = | చెబుతారు |

**సుకృతములైన సాత్త్వికర్మలకు నిర్మలత్వము ఫలము. రాజస కర్మలకు దుఃఖమే ఫలము. తామసకర్మలకు అజ్ఞానము ఫలము అని పెద్దలు చెబుతారు.**

### వ్యాఖ్య

గుణ సంబంధమైన భావాలకు ఫలితాలను చెప్పి, ప్రస్తుత శ్లోకంలో గుణ సంబంధమైన కర్మలకు ఫలితాలను చెబుతున్నాడు.





### సాత్త్విక కర్మఫలం

సాత్త్విక కర్మ అంటే పుణ్యప్రదమైన కర్మ, లేదా ధర్మయుత మైన కర్మ. అదే సుకృతం. సుకృతమైన సాత్త్విక కర్మకు ఫలం సాత్త్వికం గానే ఉంటుంది. కనుక అది నిర్మలము. నిర్మలము అంటే మల రహితము. రజ స్తమస్సులు అంటని శుద్ధమైన ఫలమే నిర్మలమైన ఫలము (**సాత్త్వికం ఏవ నిర్మలం ఫలం**).

సుఖ హేతువైన సాత్త్విక కర్మ వివేక యుతము అని పూర్వ శ్లోకాలలో చెప్పుకున్నాం. శ్రద్ధాభక్తులతో ఆచరింపబడే శాస్త్ర విహిత కర్మలు, ధర్మయుతమైన లౌకిక కర్మలన్నీ సుకృతాలే. సాత్త్వికాలే. వివేకయుతాలే. సుఖరూపాలే. ఇలాంటి సుకృత కర్మలు అంతఃకరణ శుద్ధిని కలిగించి ఆంతర్యాన్ని నిర్మలంగా ఉంచుతాయి. నిర్మలమైన సుఖాన్ని ప్రసాదిస్తాయి. కనుక, సాత్త్విక కర్మను ఆచరించిన ధర్మాత్ముడు జీవించి ఉన్నప్పుడు మానవ లోకంలో గాని, మరణించిన తరువాత ఇతర లోకాలలో గాని సాత్త్వికమైన, నిర్మలమైన ఫలాన్నే అనుభవిస్తాడు. కనుక **సాత్త్వికం నిర్మలమ్ ఫలమ్**.

### రాజస కర్మఫలం

రాజసకర్మ రాగయుత మైంది. ప్రవృత్తిరూప మైంది. ఆశతో కూడింది. లోభంతో నిండింది. నేను చేస్తున్నాను (***అహం కర్తా అహంకారః***) అనే అహంకారంతో కూడినది. విషయాసక్తితో కూడిన రాజస కర్మ పుణ్యపాప మిశ్రితంగా ఉంటుంది. కామ సంకల్పాలతో ప్రవృత్తి రూపంలో సాగే రాజస కర్మ సంతాపాన్ని కలిగిస్తుంది. బ్రతుకును దుఃఖ భూయిష్టంగా మార్చేస్తుంది. కనుక రాజస కర్మకు దుఃఖమే ఫలము (***రజసస్య కర్మణః ఫలమ్ దుఃఖం***).

రాజస కర్మకు దుఃఖమును ఫలితంగా చెబుతున్నాడు అంటే, సుఖం అసలే లేదని కాదు. సుఖం కూడా ఉంటుంది. కాకపోతే, లేశమాత్రంగా ఉంటుంది. దుఃఖం సాగర రూపంలో ఉంటుంది (***సుఖ మల్పం బహు క్లేశః***). బ్రతుకంతా దుఃఖమే నిండి ఉంటుంది కనుక రాజసకర్మ ఫలం దుఃఖము అని చెబుతున్నాడు. అంతేకాదు. రాజసకర్మ ఫలాలు గమనాగమనాలు. ఏ కర్మఫల మైనా అంతే. సకామ కర్మలన్నీ అనిత్య ఫలాలను, దుఃఖఫలాలను అందించి బ్రతుకును సంతాపంతో నింపుతాయి.

### తామస కర్మఫలం

తామసకర్మ అజ్ఞానముతో కూడి ఉంటుంది కనుక, దాని ఫలము కూడా అజ్ఞానమే (***తామసస్య కర్మణః ఫలమ్ అజ్ఞానమ్***). నిద్రాలస్య ప్రమాదాలతో నిండియున్న తమోగుణము జడ మైనది, స్తబ్ధతతో కూడుకున్నది కనుక ఏ తామస కర్మఫల మైనా అజ్ఞానయుతం గానే ఉంటుంది. మూఢత్వమే ఫలం. సామాన్య విషయాల లోనే తామస కర్మలు అవివేక పూరితంగా ఉంటాయి. ఇక ఆత్మ విషయానికి సంబంధించి చెప్పే దేముంటుంది? అవివేకమే ప్రధాన భూమికను పోషిస్తూ ఉంటుంది కనుక, తామస కర్మలలో విధి నియమా లుండవు. అశ్రద్ధ ప్రముఖంగా ఉంటుంది. విచారము అసలే ఉండదు. అట్టి అజ్ఞాన జనితమైన తామస కర్మకు అజ్ఞానమే ఫలము. కనుక, తామస కర్మలను ఆచరించే వాడు జీవించి ఉన్నప్పుడు అజ్ఞానం తోనే అలమటిస్తూ ఉంటాడు. మరణించిన తరువాత కూడా అజ్ఞాన స్థావరాల లోనే కాపుర ముంటాడు.

*గుణాల వల్ల ఇంకా ఏమి జరుగుతుందో, ఏమి కలుగుతుందో చెబుతున్నాడు* (***కించ గుణేభ్యః భవతి?***).

**సత్త్వా త్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ ।**
**ప్రమాద మోహౌ తమసో భవతోఽజ్ఞాన మేవ చ ॥** 17

***సత్త్వాత్-సంజాయతే-జ్ఞానం-రజసః-లోభః-ఏవ-చ***
***ప్రమాదమోహౌ-తమసః-భవతః-అజ్ఞానం-ఏవ-చ***

| | | | |
|---|---|---|---|
| సత్త్వాత్ | = సత్త్వగుణము వలన | తమసః | = తమోగుణము వలన |
| జ్ఞానం | = జ్ఞానము | ప్రమాద మోహౌ | = ప్రమాదము, మోహము |
| సంజాయతే | = కలుగుతూ ఉంది | అజ్ఞానం ఏవ చ | = అజ్ఞానము |
| రజసః | = రజోగుణము వలన | భవతః | = కలుగు తున్నాయి |
| లోభః ఏవ చ | = లోభగుణము | | |

**సత్త్వగుణము వలన జ్ఞానము కలుగుతుంది. రజోగుణము వలన లోభము కలుగుతుంది. తమోగుణము వలన మరపు, మోహము, అజ్ఞానము కలుగు తున్నాయి.**

**వ్యాఖ్య**

మానవులలో భౌతికంగా స్థూల దేహాలన్నీ ఒకే విధమైన పదార్థ సంహతితో అలరారుతున్నా, వ్యక్తుల ప్రవర్తనా సరళిలో, అనుభవిస్తున్న సుఖదుఃఖాలలో అంతరాలు పొడ సూపడానికి బౌద్ధికమైన వ్యత్యాసాలే కారణా లని, అవి కూడా గుణ భేదాల వల్లనే ఏర్పడుతున్నా యని స్పష్టమైంది. గుణత్రయానికి సంబంధించిన సమస్త జ్ఞానము కలిగితే, తమోగుణ ఫలమైన అజ్ఞానము నుండి, రజోగుణ ఫలమైన దుఃఖం నుండి విడిపడి, వివేక సుఖహేతువైన సత్త్వ మార్గంలో చరించి, నిర్మలమైన అంతఃకరణ శుద్ధిని పొంది, తద్వారా ఆత్మజ్ఞాన సముపార్జనం చేసి మనిషి తరించి పోవచ్చు. ఈ కారణం చేతనే గుణత్రయ విశేషాన్ని భగవంతుడు ఇంతగా వివరించి చెప్పవలసి వచ్చింది.

సత్త్వగుణము వల్ల మనిషికి జ్ఞానం ప్రాప్తిస్తుంది ***(సత్త్వాత్ సంజాయతే సముత్పద్యతే జ్ఞానం)***. సత్త్వము వల్ల కలిగే జ్ఞానం ఆత్మజ్ఞానం కాదు. నిత్యానిత్య వివేక జ్ఞానము, కార్యాకార్య విచార జ్ఞానము సత్త్వము వల్ల ఏర్పడుతుంది. సదస ద్వివేకము అనేది సత్త్వగుణము లేని వారికి అసంభవము. సత్త్వగుణము వివేక విచారాదు లను కలిగిస్తుంది కనుక, నిర్మలమైన అంతఃకరణమును ప్రసాదిస్తుంది కనుక, ప్రమాణ విచారము చేయ డానికి అనుకూలమైన చిత్తశుద్ధి, చిత్త నైర్మల్యము ఏర్పడుతాయి. పరమాత్మ తత్త్వమును దర్శించ డానికి అవసరమైన వెలుగును సత్త్వము విరజిమ్ముతుంది. అందుచేతనే, **సత్త్వము ప్రదీప మా పరతత్త్వము గాంచుటకు** అని అద్భుతంగా ప్రవచించింది ఆంధ్ర మహాభారతము - అశ్వమేధ పర్వము.

సత్త్వగుణము నుండి జ్ఞానము ఉత్పన్న మవుతూ ఉంటే, రజోగుణము నుండి లోభము కలుగుతూ ఉంది ***(రజసః లోభః ఏవ చ)***. విషయాసక్తి, విషయాల యందు తీరని దాహమే లోభము. ఏదొచ్చినా, ఎంతొచ్చినా నివారింప శక్యము గాని ఆశా విశేషమే లోభము. లాభా లెన్ని వచ్చి పడినా పూరింప బడని లోభము మనిషిలో అసంతృప్తిని, ఆవేదనను కలిగించి బ్రతుకును దుఃఖమయం చేస్తుంది.

తమోగుణము నుండి ప్రమాద మోహాలు కలుగుతాయి ***(ప్రమాద మోహౌ చ ఉభౌ తమసః భవతః అజ్ఞానమ్ ఏవ చ)***. ప్రమాద మోహాలు బుద్ధి జాడ్యా లని ఇప్పటికే తెలుసుకున్నాం. అప్రకాశము, అప్రవృత్తి ప్రముఖంగా కనిపించే తమోగుణము వివేక శూన్యమై ఉంటుంది. వివేకము లేనపుడు విపరీత జ్ఞానము ఏర్పడుతూ ఉంటుంది. అదే మోహము. అట్టి మోహ కూపంలో పడ్డ వారికి అంతా అంధకారమే. అదే అజ్ఞానము. తమోగుణ ఫలం.

*గుణ ప్రభావంతో పయన మెటు సాగుతుందో చెబుతున్నాడు.*





**ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థాః మధ్యే తిష్ఠన్తి రాజసాః ।**
**జఘన్య గుణవృత్తిస్థాః అధో గచ్ఛన్తి తామసాః ॥** 18

***ఊర్ధ్వం-గచ్ఛంతి-సత్త్వస్థాః-మధ్యే-తిష్ఠంతి-రాజసాః***
***జఘన్య గుణ వృత్తిస్థాః-అధః-గచ్ఛంతి-తామసాః***

| | | | |
|---|---|---|---|
| సత్త్వస్థాః | = సత్త్వగుణము నందున్న వారు | తిష్ఠంతి | = ఉంటారు |
| ఊర్ధ్వం | = ఊర్ధ్వమునకు | జఘన్య గుణవృత్తిస్థాః | = నికృష్టమైన గుణప్రవృత్తి గల |
| గచ్ఛంతి | = పోతున్నారు | తామసాః | = తమోగుణము కలవారు |
| రాజసాః | = రజోగుణము గలవారు | అధః | = క్రిందికి |
| మధ్యే | = మధ్యలో | గచ్ఛంతి | = పోతున్నారు |

**సత్త్వగుణము గలవారు ఉత్తమ లోకాలకు పోతున్నారు. రజోగుణము గలవారు మధ్య లోకమును చేరుతున్నారు. నికృష్టమైన తమోగుణము కలవారు నీచ జన్మలలో పడుతున్నారు.**

**వ్యాఖ్య**

**సాత్త్వికులు**

సత్త్వగుణ ప్రధానులైన వారు సత్త్వస్థులు. అంటే, సత్త్వగుణ కార్యాలైన సుకృత కర్మల యందు వర్తించే వారు. ఏది చేయాలి, ఏది చేయ కూడదు అనే కార్యాకార్య విచక్షణ కలిగి ప్రవర్తించే వారు. వివేకము కలిగిన వారు కావడం చేత యుక్తాయుక్తములను చక్కగా తెలిసి ఆచరించే వారు. సాత్త్వికమైన సుకృతాలను ఆచరించే వారు నిర్మలమైన సాత్త్విక ఫలాన్నే పొందుతారు కనుక ప్రశాంత జీవనాన్ని, పవిత్రమైన మనుగడను కొనసాగిస్తారు. సత్త్వగుణ ప్రధానులైన ఈ సుకృతాత్ములు మరణానంతరము జ్ఞాన, సుఖ నిలయాలైన ఊర్ధ్వ లోకాలను చేరుతారు ***(ఊర్ధ్వం గచ్ఛన్తి దేవ లోకాదిషు ఉత్పద్యన్తే సత్త్వస్థాః)***.

ఊర్ధ్వలోకాలు అంటే దేవతలు వసించే లోకాలు. అక్కడ దేవతల మధ్య అధికంగా వివేకాన్ని పొందుతారు. సుఖాలను అనుభవిస్తారు. ఈ విధంగా పుణ్యఫలాన్ని అనుభవించిన తరువాత, తిరిగి శుచి గల, జ్ఞానము గల కుటుంబాలలో జన్మించి, తీవ్ర ముముక్షువులై ముక్తి మార్గంలో చరిస్తారు. ఇది ప్రకాశ మార్గము.

**రాజసులు**

రజోగుణ ప్రధానులైన వారు రాజసులు. అంటే, రజోగుణ లక్షణమైన లోభగుణంతో చరించే వారు. విషయాసక్తితో సకామ కర్మల యందే నిమగ్నమై ఉండేవారు. కర్మావేశం తోనే చరిస్తుంటారు. కనుక, ప్రకాశం లేని కారణంగా కృత్యాకృత్యాలను రెండిటిని ఆచరిస్తారు. ఈ విధమైన ఆచరణము వలన పుణ్యపాపాలు రెండిటిని ప్రోగు చేసుకుంటారు. అల్ప సుఖాలను ఆశించి అనంత శోకాన్ని బ్రతుకులో దించు కుంటారు; బుద్ధిలో నింపుకుంటారు. ఈ విధంగా సుఖ దుఃఖాలలో పరిభ్రమించే రాజసులు, మరణించిన తరువాత తిరిగి మానవలోకం లోనే పుడుతారు ***(మధ్యే తిష్ఠన్తి మనుష్యేషు ఉత్పద్యన్తే రాజసాః)***.

మధ్య లోకము అంటే మానవ లోకము. అటు దేవలోకము కాక, ఇటు నీచ జన్మల లోకము కాక, మధ్య ఉండేది కనుక, మానవులు వసించే ప్రపంచాన్ని మధ్య లోకము అంటారు. పుణ్య పాప కర్మల ఫలితంగా సుఖ దుఃఖాల మధ్య ఊగిసలాడే రాజసులు రంగులరాట్నం లాగా చావుపుట్టుకల మధ్య పరిభ్రమిస్తూ ఉంటారు. ఇది ప్రవృత్తి మార్గము.

### తామసులు

తమోగుణ ప్రధానులైన వారు తామసులు. నిద్రాలస్య ప్రమాదాలలో నిమగ్నమై ఉండేవారు. అజ్ఞానమే ప్రధాన లక్షణంగా కలిగిన తామసులు, ప్రకాశానికి నోచుకోక, ప్రవృత్తికి పూనుకోక, కునుకు లోనే మునిగి ఉంటారు. అజ్ఞానం లోనే అలమటిస్తూ ఉంటారు. అంతా చీకటే. మనస్సులో చీకటే. మనుగడ లోనూ చీకటే. అలాంటి వారు జీవితకాల మంతా అంధకారంలో పడి అల్లాడుతూ ఉంటారు. మరణానంతరము అటు దేవ లోకాన్ని చేరలేక, ఇటు మానవ లోకానికి నోచుకోక, నీచజన్మ లైన తిర్యగ్జంతువుల యందు పుడుతారు *(జఘన్య గుణః తమః , మూఢాః అధః గచ్ఛన్తి , పశ్వాదిషు ఉత్పద్యన్తే తామసాః )*. తామసులు జ్ఞానహీనులు, మూఢులు కావడం చేత జంతు జన్మలలో పుడుతారు.

గుణాలను బట్టే గమనాలు. ఈ సత్యాన్ని నిజ జీవితంలో కూడా మనం చూడ వచ్చు. సత్త్వగుణ ప్రధాను లైన సుకృతాత్ములు ఆలయాలకు, ఆశ్రమాలకు, ఆచార్యుల వద్దకు వెళ్తూ ఉంటారు. రజోగుణ ప్రధానులైన రాజసులు సినిమాహాళ్ళలో, కాఫీ హోటళ్ళలో, అదే పనిగా టి.వి. ముందు కూర్చుని దర్శన మిస్తూ ఉంటారు. ఇక, తమోగుణ ప్రధానులైన తామసులు మత్తుపానీయాల దుకాణాల వద్ద, అయోగ్యమైన ప్రదేశాలలో కనిపిస్తూ ఉంటారు. మరణానంతరము కూడా ఇలాగే ఉంటారు.

### ప్రయాణంలో పరివర్తన

మరణానంతరము ఎవరి ప్రయాణాలు వారి కున్నాయి. సాత్త్వికులు సత్త్వస్థులు కావడం చేత ఇహ పరాలలో సత్త్వానికి అనుకూలమైన ప్రదేశాల లోనే ఉంటారు. జ్ఞాన, సుఖాల యందే చరిస్తూ ఉంటారు. నిర్మల మైన అంతఃకరణమును పొంది ఉంటారు కనుక, వీరు శ్రవణ, మనన నిదిధ్యాసల ద్వారా ఆత్మజ్ఞానమును పొంది తరించే ప్రయత్నం చేయాలి.

ఇక రాజసులు ప్రవృత్తి ప్రధానంగా చరిస్తుంటారు కనుక, ఉన్నతంగా చరిస్తే సత్త్వస్థ లవుతారు; దిగ జారితే తామసు లవుతారు. కనుక, రాజసులు జాగరూకులై సత్త్వస్థులు కావడానికి ప్రయత్నించాలి.

చివరగా తామసులు. వీరిది అజ్ఞాన భూమిక కనుక క్రింది అంతస్తు నుండి సూటిగా పై అంతస్తుకు చేరడానికి వీరికి 'లిఫ్టు' సౌకర్యము లేదు. ఒకేసారి తమోగుణం నుండి సత్త్వగుణాన్ని అందుకో లేరు. కాబట్టి, వీరు మధ్య అంతస్తు అయిన రజోగుణమును పొందిన తరువాతే సత్త్వస్థులు కావడానికి ప్రయత్నించాలి. కనుక, ముందు అప్రవృత్తి లక్షణాన్ని త్యజించి, కర్మాసక్తులై ప్రవృత్తి నాశ్రయించి, తద్వారా శుద్ధిపడి సత్త్వస్థులు కావాలి.

### ప్రకృతి బిడ్డలే

త్రిగుణాలు ప్రకృతి సంభవాలు కనుక, సాత్త్వికులు, రాజసులు, తామసులు ముగ్గురూ ప్రకృతిమాత బిడ్డలే. ప్రకృతి కారణంగా ఆవిర్భవించిన వారే. కారణమైన ప్రకృతి మాతలో ఏ లక్షణా లున్నాయో ప్రకృతి బిడ్డ లైన జీవులలో అవే లక్షణాలు ఉంటాయి. కనుక అందరి లోను త్రిగుణాలే ఉంటాయి. కాకపోతే సాత్త్వికులలో సత్త్వం ప్రధానం గాను, మిగిలిన రెండు గుణాలు అప్రధానం గాను ఉంటాయి. రాజసులలో రజోగుణం ముఖ్యం గాను, మిగిలిన రెండు అప్రధానం గాను ఉంటాయి. తామసులలో తమోగుణము ముఖ్య భూమికను పోషిస్తూ ఉంటే, మిగిలిన రెండు గౌణంగా ఉంటాయి. అంతేగాని, ఎవరి లోనూ ఒక్క గుణమే ఉండదు.

ముగ్గురూ ప్రకృతి పిల్లలే. ప్రకృతి స్త్రీ. 'స్త్రీ' అనేది ఒక పదమే. కాని, అందులో మూడు శబ్దా లున్నాయి.





స, త, ర - ఈ మూడు శబ్దాల సమ్మేళనమే 'స్త్రీ' అనే పదము. అదే ప్రకృతి. 'స' శబ్దం సత్త్వగుణము, 'త' శబ్దం తమోగుణము, 'ర' శబ్దము రజోగుణము. అందుచేత ప్రకృతి బిడ్డలైన అందరి లోను త్రిగుణాలు కలిసే ఉంటాయి.

*త్రిగుణాలకు సంబంధించిన ప్రకరణము ఇంతటితో ముగిసింది. త్రిగుణాలతో ఉన్నంత వరకు ప్రకృతి బంధములో ఉండక తప్పదు. బంధవిముక్తి కావాలి అంటే ప్రకృతి హస్తాల నుండి విడిపడి పురుషుని ఒడిలో కూర్చోవాలి. అదే గుణాతీత స్థితి. మోక్షస్థితి. ఇక ఇప్పుడు, గుణాతీత స్థితిని వివరించ బోతున్నాడు.*

## గుణ విముక్తి - గుణాతీత స్థితి

ఉంది అని భావించినా ఉండనిది, ఉండలేనిది ఏదో అదే మన అనుభవానికి అందుతూ ఉంది. లేనిదే అయితే, అది ఉంది అని ఎందుకు భావిస్తాము? కనుక ఉంది. ఉన్నట్లే ఉంది. ఒకటి కనిపిస్తూ ఉంది. మరొకటి వినిపిస్తూ ఉంది. ఈ లోగా అదే మరోలా అనిపిస్తూ ఉంది.

***ఘటః అస్తి*** - కుండ ఉంది. కుండకు సంబంధించిన జ్ఞానం కూడా ఉంది. ఆ జ్ఞానం తోనే అది కుండ అని చెబుతున్నాం. కుండ సత్య మేనా? కుండకు సంబంధించిన జ్ఞానం సత్యమేనా? అని విచారించి, కుండ సత్యమే అని నిర్ధారణ చేసుకొనే లోగా, అది కుండ కాదని; కేవలం మట్టే అని వినిపిస్తూ ఉంది. కుండ, మట్టి - ఈ రెండిటిలో ఏది సత్యము? దేనికి సంబంధించిన జ్ఞానము సత్యజ్ఞానము అని ఆలోచిస్తూ ఉండగానే మట్టి మట్టి కాదని; అది అణు సముదాయము మాత్రమే అని మనకే అనిపిస్తూ ఉంది. అన్నీ ఇలాగే ఉన్నాయి. అన్నీ మారుతూనే ఉన్నాయి. రూపాంతరం చెందుతూ కరిగి పోతూ ఉన్నాయి. కనుమరు గవుతూ ఉన్నాయి.

ప్రపంచము సమస్తమూ ఇలాగే ఉంది. ప్రపంచమే కాదు; దృశ్యమైన ప్రపంచాన్ని తెలుసుకుంటున్న మన వైపు తిరిగి చూచినా, మన దేహము, ఇంద్రియాలు, ప్రాణము, మనస్సు, మనోవృత్తులు, మనస్సు లోని జ్ఞానము, మనస్సు లోని అజ్ఞానము - అంతా మార్పు చెందుతూనే ఉంది. ఏదీ స్వతస్సిద్ధంగా లేదు. ఏదీ స్వప్రకాశం కాదు. ప్రతి ఒక్కటి మరొక దానిపై ఆధారపడి ఉంది. ఆధారపడి ఉండేది సత్యమెలా అవుతుంది? మిథ్య అవుతుంది. ఇంతకీ సత్య మేమిటి? ఏమో! ప్రస్తుతం మనకు తెలిసే దంతా మిథ్యే. కనుక, ఇప్పుడు మన వద్ద ఉన్న దంతా మిథ్యా జ్ఞానమే. మాయాజ్ఞానమే. అదే ప్రకృతి. త్రిగుణాత్మకమైన మాయా రూపము.

గుణయుతమైన ప్రకృతితో సంబంధాన్ని ఏర్పరచుకున్న పురుషునికి ప్రకృతి జ్ఞానమే కలుగుతుంది. మిథ్యా జ్ఞానమే ఏర్పడుతుంది. మిథ్యాజ్ఞానంతో సంసర్గ మేర్పడిన పురుషుడు ***(మిథ్యా జ్ఞానేన యుక్తస్య)*** సుఖ, దుఃఖ మోహ లక్షణాలు గల సత్త్వ రజ స్తమో గుణాలతో సంగం ఏర్పరచుకొని, ఆ గుణసంగము చేత మళ్ళీ భోగ్యము లైన గుణాల తోనే తాదాత్మ్యం చెంది, ***సుఖీ దుఃఖీ మూఢోఽ హ మస్మి*** - 'నేను సుఖంగా ఉన్నాను, నేను దుఃఖ పడుతున్నాను, నేను ఏమీ తెలియని మూఢుడను' అని భావించడం జరుగుతూ ఉంది. ఈ విధమైన గుణసంగమే సంసార హేతువై జన్మలకు కారణ మవుతూ ఉంది ***(కారణం గుణ సంగోఽ స్య సదసద్యోని జన్మసు:** 13 వ అ - 21వ శ్లో)* అని పదమూడవ అధ్యాయంలో ప్రస్తావించిన విషయాన్నే ప్రస్తుత అధ్యాయంలో మళ్ళీ అంది పుచ్చుకొని, సత్త్వ రజ స్తమో గుణాలు అనే త్రిగుణాలు ప్రకృతి సంభవా లంటూ ప్రారంభించి ( *14 వ అ - 5 వ శ్లో*), గుణ స్వరూపము, గుణకార్యము *( గుణ వృత్తం )*. గుణాలు తమ కార్యాల ద్వారా పురుషుని బంధించడము ***(స్వవృత్తేన చ గుణానాం బంధకత్వం)***. గుణ కార్యాల చేత బద్ధు డైన పురుషునకు ప్రాప్తించే గతి ***( గుణవృత్త నిబద్ధస్య చ పురుషస్య యా గతిః )*** - ఈ విధంగా, బంధహేతువు మరియు అజ్ఞానం వల్ల కలిగే

మిథ్యా జ్ఞానా న్నంతటినీ ఇంతవరకు సవిస్తరంగా చెప్పి ***(ఇతి ఏతత్ సర్వం మిథ్యా జ్ఞానమ్ అజ్ఞాన మూల బంధ కారణం విస్తరేణ ఉక్త్వా)***. ఇక ఇప్పుడు, బంధము నుండి విడిపడి మోక్షం పొందడ మనేది సమ్యగ్దర్శనం వల్లనే జరుగుతుంది అనే విషయాన్ని ప్రవచించ డానికి ఉపక్రమిస్తున్నాడు ***(అధునా సమ్య గ్దర్శనాత్ మోక్షః వక్తవ్యః ఇత్యాహ)***.

ఇక్కడ మరొక్క విషయాన్ని కూడా మనం విశ్లేషించు కోవాలి. ఉంది - ఉంది అని మనం భావిస్తున్న దంతా ఉన్నది కాదని, మిథ్యామయమే నని అర్థం చేసుకున్నాం. మిథ్య అంటే, కుండ లాగా నామరూపాలతో తెలుస్తూ, మరొక దానిపై ఆధారపడి ఉండేది అని ఇప్పటికే తెలుసుకున్నాం కనుక, అలాంటి జడ వస్తువుకు సంబంధించిన జ్ఞానం కలిగేది ఎవరికి? ***అహం ఘటః*** - 'నేను కుండను' అనే జ్ఞానం కుండకు కలిగే అవకాశ ముందా? కుండ జడం కనుక కుండకు జ్ఞానం కలిగే అవకాశం లేదు. జ్ఞాన మనేది చేతనమై ఉంటుందే గాని, జడం కాదు. అలాంటి జ్ఞానం దేనికి సంబంధించిందై ఉండాలి? ప్రపంచము మొదలుకొని మనస్సు లోని జ్ఞానా జ్ఞాన వృత్తుల వరకు తెలియ బడుతున్న వన్నీ దృశ్యాలే నని, జడరూపాలే నని, నామరూపాది విశేషాలే నని తెలుసుకున్నాం కనుక, ఈ విశేషా లన్నిటికీ ఆధారమై, తనకు మరొక ఆధారము లేని చిదాత్మక మైన సత్తారూప చైతన్యమునకు సంబంధించిందై ఉండాలి. అది ఏ విశేషాలు లేని సామాన్య సత్తా చైతన్యము. అది ఉంది ***(తదస్తి)***. అదే నీవుగా ఉంది. నీవే అది ***(తత్త్వమసి)***. అదే నేనుగా ఉంది. నేనే అది ***(అహం తదేవ)***. అదే నీవు, అదే నేను; కనుక నువ్వే నేను, నేనే నువ్వు ***(త్వమేవాహం)***. అదీ సత్యం. అదే సత్యం.

అది ఉన్నదే. లేదని భావించినా లేకుండా పోయేది కాదు. అది లేదని భావించినా, అలా భావించడానికి ఆధారమైంది అదే. తన ఉనికిని తానే ఎలా నిరాకరిస్తుంది? నిరస్తం కాని దేదో అదే సమస్తం లోనూ ఉంది. నగలో బంగారులా వ్యాపించి ఉంది. మట్టిపాత్రలలో మట్టిలా వ్యాపించి ఉంది. అన్నీ తానే. తాను మాత్రం ఏదీ కాదు. తాను తానే. తనకు దేని తోను సంబంధము లేదు. తన కన్నా అన్యమైనది మరొకటి ఉంటే కదా సంబంధము?

ఏ సంబంధము లేని తాను ప్రకృతితో తాదాత్మ్యం చెంది గుణసంగము ఏర్పరచు కోవడం వల్ల మిథ్యా సంబంధము ఏర్పడి, తనకు బంధహేతువు అయింది. ***అహం కర్తా - అహం భోక్తా***. నేను కర్తను, నేను భోక్తను అనే అభిమానం ఏర్పడింది. ఈ అభిమానమే సంసారాన్ని తయారు చేసింది.

ఇంతకీ కర్త ఎవరు? భోక్త ఎవరు? గుణాలే కర్తలు. గుణాలే భోక్తలు. గుణాలే కారయితలు. ఇంద్రియాలు కర్తలుగా ఉన్నాయి. ఇంద్రియాలే విషయాలుగా ఉన్నాయి. ఇంద్రియాలు ఇంద్రియ విషయాలలో ప్రవర్తిస్తున్నాయి. ప్రపంచం మొదలుకొని మనోవృత్తుల వరకు సర్వము త్రిగుణ మిళితమైన ప్రకృతియే నని అర్థం చేసుకున్నాం కదా! అలాంటప్పుడు ఇంద్రియాలు గుణాలే కదా! బాహ్యంలో గోచరించే విషయాలు కూడా గుణాలే కదా! ఇప్పుడు భోక్త ఎవరు? భోగ్య మెవరు? అంతా గుణాలే. అయితే, గుణాలే గుణాలను అనుభవిస్తున్నాయి. ఈ విషయాన్ని కర్మయోగం లోనే భగవానుడు నొక్కి వక్కాణించాడు. గుణ, కర్మల విభాగము తెలిసిన తత్త్వవేత్త గుణాలు గుణాలలో వర్తిస్తున్నా యని గ్రహించి తాను తటస్థంగా అసంగుడై ఉంటాడు ***(గుణా గుణేషు వర్తన్త ఇతి మత్వా న సజ్జతే; 3 వ అ - 28 వ శ్లో)***.

కర్త, భోక్త రెండూ గుణాలే నని, గుణాల కన్నా అన్యమైన కర్త లేడనే జ్ఞానం కలిగిన వాడు, తాను గుణాల కన్నా అన్యమైన వాడని తెలుసుకుంటాడు. తానే సామాన్య సత్తా చైతన్య మని అనుభూతిని పొందుతాడు. గుణసంగమే బంధము. గుణాతీత స్థితియే మోక్షము. గుణబద్ధుడే జీవుడు. గుణ విముక్తుడే దేవుడు.





అతడే జ్ఞాని. సచ్చిదానంద స్వరూపుడు. గుణాతీతుడు. ఈ మోక్ష స్థితిని పొందమనే సాంఖ్యయోగములో భగవంతుడు సూత్రప్రాయంగా బోధించాడు ***(నిస్త్రైగుణ్యో భవార్జున; 2 వ అ - 4 వ శ్లో)***.

గుణాతీత స్థితిని పొందిన వారికి సమ్యగ్దర్శనము కలుగుతుంది. అదే మోక్షం. ఈ విషయాన్ని ఇక వివరిస్తాడు.

**నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టాఽనుపశ్యతి ।**
**గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి ॥** 19

***న-అన్యం-గుణేభ్యః-కర్తారం-యదా-ద్రష్టా-అనుపశ్యతి***
***గుణేభ్యః-చ-పరం-వేత్తి-మద్భావం-సః-అధిగచ్ఛతి***

| | | | | | |
|---|---|---|---|---|---|
| ద్రష్టా | = | ఆత్మదర్శి | గుణేభ్యః | = | గుణముల కంటె |
| గుణేభ్యః | = | గుణముల కంటె | పరం చ | = | అతీతముగా |
| అన్యం | = | ఇతరుడైన | వేత్తి | = | తెలిసికొను చున్నాడో |
| కర్తారం | = | కర్తను | సః | = | వాడు |
| యదా | = | ఎప్పుడు | మద్భావం | = | నా భావమును |
| న అనుపశ్యతి | = | చూడడో | అధిగచ్ఛతి | = | పొందుచున్నాడు |

**అర్జునా! ఆత్మజ్ఞాని గుణాల కంటే వేరుగా కర్త లేడని దర్శిస్తాడు. గుణాల కంటే తనను వేరుగా అర్థం చేసుకుంటాడు. అట్టి ఆత్మజ్ఞాని నా స్వరూపాన్నే పొందుతాడు.**

**వ్యాఖ్య**

ప్రకృతి సంభవాలైన గుణాలు మోహకాలు. దుర్జయాలు. జన్మకారకాలు. మిథ్యా జ్ఞానానికి సంబంధించినవి. మిథ్యా జ్ఞానము గల పురుషుడు గుణసంగం వల్ల నేను - నాది అనే అహంకార, మమకారా లతో కర్తృత్వాన్ని, భోక్తృత్వాన్ని తన యందు ఆరోపించు కుంటున్నాడు. ఈ విధమైన అధ్యాసయే జన్మకు కారణ మవుతూ ఉంది. ***అహం కర్తా - అహం భోక్తా*** అని పురుషుడు భావించినా వాస్తవానికి కర్త - భోక్త గుణాలే కాని పురుషుడు కాడు. ఈ సత్యాన్ని దర్శించిన వాడే సత్యద్రష్ట. అతడే విద్వాంసుడు.

సత్యజ్ఞానము కలిగిన వాడు కార్యము లైన దేహాలు, కరణము లైన ఇంద్రియాలు పరిణమించిన గుణాలే అని గ్రహిస్తాడు. వాటి కన్నా అన్యంగా, వేరుగా మరొక కర్త ఉన్నాడు అని చూడడు. అన్ని రూపాలలో ఉన్న గుణాలే సమస్త కర్మలకు కారణమై ఉన్నాయి అని అర్థం చేసుకుంటాడు ***(గుణాః ఏవ సర్వావస్థాః సర్వ కర్మాణాం కర్తారః ఇత్యేవం పశ్యతి ద్రష్టా విద్వాన్)***. ఆచార్యుని అనుగ్రహం చేత, శాస్త్ర కృప చేత, ఈశ్వర కరుణ చేత, అంతఃకరణ ప్రసాదం చేత శాస్త్ర ప్రమాణమును విచారము చేసిన పుణ్యాత్ముడు గుణ కార్యాలైన దేహేంద్రియాదులను అర్థం చేసుకుంటాడు. గుణసంగము వలన కలిగే అనర్థాన్ని గ్రహిస్తాడు. సర్వకాల సర్వావస్థల యందు కర్తృత్వ, కారయితృత్వ, భోక్తృత్వ ధర్మాలు గుణాలకు సంబంధించినవే గాని గుణాల కన్నా అన్యంగా మరొక కర్త లేడు; భోక్త ఉండడు అని తెలుసుకుంటాడు. తెలుసుకుంటూ ఉన్నాడు కనుక తెలియబడే గుణాల కన్నా తాను అన్యమైన వాడు. అలాగే గుణ కార్యాలైన దేహేంద్రియాదుల కంటే తనను అన్యమైన వానినిగా తెలుసు కుంటాడు.

***ఘట ద్రష్టా ఘటా ద్భిన్నః*** - కుండను చూచే వాడు కుండ కన్నా వేరుగా ఉన్నాడు. అలాగే గుణద్రష్ట గుణాల

కంటే అన్యంగా ఉన్నాడు. గుణాలు, గుణ కార్యాలన్నీ మార్పు చెందుతున్నాయి (*పరిణామీ భావాత్*). మార్పు చెందే గుణ కార్యాలన్నీ తనకే తెలుస్తున్నాయి. మార్పు చెందే గుణాలే తానయితే, లేక వాటితో అతని సంగత్యము సత్యమే అయితే, అవి మార్పు చెందగానే తానూ మారిపోవాలి కదా! గుణాలు లేని దశలో తానూ లేనివాడే కావాలి కదా! అదే వాస్తవ మైతే, గుణాలు మార్పు చెందాయని, గుణాలు లేకుండా పోయాయని తెలిసింది ఎవరికి? కనుక పురుషుడు గుణమయ ప్రకృతి కాడు.

గుణాలు దృశ్య విషయాలు. గుణాలలో జరిగే వన్నీ తనకు తెలుస్తున్నాయి. తెలుసుకునే వాడు తెలియ బడే వాటి కన్నా అన్యంగా ఉన్నాడు. దృశ్య విషయాలైన గుణాలు, గుణ కార్యాలన్నీ ద్రష్ట యైన చేతన పురుషు నికే తెలుస్తున్నాయి. గుణద్రష్ట యైన పురుషుడు గుణాల కన్నా అన్యమైన వాడు కనుక అతడు కర్త కాడు. కాని, గుణ సంగము చేత తానే కర్త నని భావిస్తున్నాడు. ఈ అజ్ఞానమే సంసార హేతువై బంధకారణ మవుతూ ఉంది (*పుంసః సంసార కారణం స్యాత్*).

ఇది కేవలం అధ్యాస. మేఘాలతో, మేఘ చలనాలతో చంద్రునికి ఏ విధమైన సంబంధమూ లేదు. మేఘాలకు అంద నంత సుదూరంలో చంద్రుడు ఉన్నాడు. అయినా మేఘాలు చంద్రుణ్ణి కప్పేశాయి అంటాము. అలాగే మేఘాలు కదిలిపోతూ ఉంటే, చంద్రుడు చలిస్తున్నా డని భావిస్తాము. ఒకదాని లక్షణాలను మరొక దాని యందు ఆరోపిస్తున్నాము. ఇదే అధ్యాస. చంద్రుడు మేఘాలకు అతీతంగా ఉన్నట్లు, పురుషుడు గుణాలకు భిన్నంగా ఉన్నాడు. గుణాలకు అతీతంగా ఉన్నాడు. ఇదే ఆత్మ యొక్క గుణాతీత స్థితి. నిస్త్రైగుణ్య స్వరూపము.

గుణ స్వభావ స్వరూపాలను తెలుసుకొని, గుణాల కంటే అన్యంగా కర్త లేడని గ్రహించి, గుణ ద్రష్ట యైన తాను గుణాతీతు డనే సత్యాన్ని గ్రహించిన వాడు భగవద్భావమునే పొందు తున్నాడు అంటున్నాడు గీతాచార్యుడు (*గుణేభ్యః చ పరం గుణ వ్యాపార సాక్షిభూతం వేత్తి మద్భావం మమ భావం స ద్రష్టా అధిగచ్ఛతి ప్రాప్నోతి ఇతి*).

గుణాలకు, గుణ వ్యాపారాలకు సాక్షీభూతంగా ఉన్న ఆత్మ స్వరూపాన్ని తెలుసుకున్న వాడు మద్భావం - నా భావమును పొందుతాడు అంటున్నాడు. నా భావము అంటే నా స్వరూపము అని అర్థము. ఆత్మను తెలుసుకుంటే పరమాత్మ స్వరూపమును ఎలా పొందుతాడు? ఆత్మే పరమాత్మ కనుక.

***మద్భావం మమ భావం వాసుదేవత్వం ఇత్యేవం పశ్యన్*** - 'నా భావం' అంటే వాసుదేవ స్వరూపము అని అర్థం. సర్వమూ వాసుదేవుడే అనే సత్యాన్ని ఏడవ అధ్యాయం లోనే తెలుసుకున్నాం కదా! (*7 వ అ - 19 వ శ్లో*). సమస్తమూ వాసుదేవ పరమాత్మే కనుక ఆత్మయే పరమాత్మ అనే జ్ఞానంతో గుణాతీతుడు పరమాత్మ స్వరూపాన్ని పొంది తరిస్తాడు (*మద్భావం సోఽ ధి గచ్ఛతి*).

*వాసుదేవ స్వరూపాన్ని ఎలా పొందుతాడో* (*కథం అధిగచ్ఛతీతి*) చెబుతున్నాడు (*ఉచ్యతే*).

**గుణా వేతా వతీత్య త్రీ న్దేహీ దేహసముద్భవాన్ ।**
**జన్మమృత్యు జరాదుఃఖై ర్విముక్తోఽ మృత మశ్నుతే ॥** 20

*గుణాన్-ఏతాన్-అతీత్య-త్రీన్-దేహీ-దేహసముద్భవాన్*
*జన్మమృత్యు జరా దుఃఖైః-విముక్తః-అమృతం-అశ్నుతే*

| | | | | | |
|---|---|---|---|---|---|
| దేహీ | = జీవుడు | | ఏతాన్ | = | ఈ |
| దేహసముద్భవాన్ | = దేహము కలుగుటకు | | త్రీన్ | = | మూడైన |





| | | | | | |
|---|---|---|---|---|---|
| గుణాన్ | = గుణములను | | విముక్తః | = | విముక్తుడై |
| అతీత్య | = అతిక్రమించి | | అమృతం | = | మోక్షమును |
| జన్మమృత్యు జరా దుఃఖైః | = జన్మము, మృత్యువు, ముసలితనము, దుఃఖముల చేత | | అశ్నుతే | = | పొందుతున్నాడు |

**అర్జునా! దేహానికి త్రిగుణములే కారణము. జీవుడు త్రిగుణాలను దాటు తున్నాడు. జనన మరణాలు, జరా దుఃఖాల నుండి విడిపడు తున్నాడు. మోక్షాన్ని పొందు తున్నాడు.**

**వ్యాఖ్య**

**బంధమోక్షాలు కల్పితాలు**

గుణసంగమే బంధము, గుణ విముక్తియే మోక్షము అంటున్నాము. గుణసంగము వల్ల బంధము ఏర్పడింది కనుక, గుణబంధము నుండి విడిపడితే మోక్షమని భావిస్తున్నాము. గుణబంధము ఎవరికి? పురుషునికి, దేహికి. అంటే, గుణాలు పురుషుని బంధించి నట్లేనా? ఇది వాస్తవ మేనా?

గుణాలు పురుషుని బంధించడము వాస్తవ మైతే, ఇక మోక్ష మనేది కుందేటి కొమ్మే అవుతుంది. మాయా కార్యాలైన గుణాలు మాయకు ఆధారమైన పురుషుని ఎలా బంధిస్తాయి? ప్రకృతి మిథ్యా రూపమని ఇప్పటికే గ్రహించాము. మిథ్యా రూపమైన ప్రకృతి, దాని కార్యాలైన గుణాలతో సత్యరూపు డైన పురుషుని ఎలా బంధిస్తుంది? బంధము వాస్తవమే అయితే, మోక్షము అవాస్తవ మవుతుంది. బంధము అవాస్తవమే అయితే, లేనిదే అయితే, మోక్షము యొక్క ప్రసక్తే లేదు; రాదు.

ప్రకృతి గాని, ప్రకృతి గుణాలు గాని పురుషుని బంధించ లేవు. అంత శక్తి వాటికి లేదు. పురుషుడే స్వయంగా తాను బద్ధు డైనట్లు భావిస్తున్నాడు. వాస్తవానికి ఇది కల్పిత బంధము. తనకు తానుగా కల్పించు కున్నది. లేని దానిని ఉన్నట్లు భావించు కున్నది. భావబంధమే భవబంధ మైతే, భావవిముక్తియే భవ బంధ విముక్తి. ఇదే శాస్త్ర హృదయము. నీకు బంధము ఉంది; నీకు మోక్షమును ప్రసాదిస్తాను అని చెప్పడం శాస్త్ర తాత్పర్యం కాదు. నిన్ను విముక్తుణ్ణి చేస్తాను అంటే, నీకు బంధము ఉంది అని అంగీకరించడమే అవుతుంది. ఆ పని శాస్త్రం చేయదు. అలా చేస్తే అది ప్రమాణం అనిపించుకోదు. కనుక నీకు ముక్తి కలుగుతుంది అని కాకుండా, నువ్వు ముక్తుడవే, నిత్య ముక్తుడవే అని శాస్త్రం చెబుతుంది. ఈ సత్యాన్నే ప్రామాణికంగా నిరూపిస్తుంది. ఇక్కడే ప్రమాణము అప్రమేయంగా, అసమానంగా శోభిస్తుంది.

**దేహాదీ నాత్మత్వే నాభి మన్యతే సోఽ భిమాన ఆత్మనో బంధః। తన్నివృత్తి ర్మోక్షః।**

దేహము మొదలైన వానిని (*దేహాదీన్*) తానే అని భావించడం చేత, (*ఆత్మత్వేన అభిమన్యతే*) ఆ అభిమానమే (*సః అభిమానః*) తనకు (*ఆత్మనః*) బంధము (*బంధః*) అవుతూ ఉంది. అట్టి అభిమానము లేక పోవడమే (*తత్ నివృత్తిః*) మోక్షము అవుతూ ఉంది (*మోక్షః*) అన్నది సర్వసారోపనిషత్తు.

కనుక బంధము అనేది కేవలం సంకల్ప మాత్రం చేతనే కలుగుతూ ఉంది (*సంకల్ప మాత్ర సంభవో బంధః*) అని నిరాలంబోపనిషత్తు. బంధము కేవలం సంకల్పము వల్లనే కలిగింది కనుక, సంకల్పము నుండి విడి పడటమే మోక్షము (*నిస్సంకల్పాత్ విముచ్యతే*) అని మహానారాయణోపనిషత్. ఇట్టి మోక్షాన్ని పొందే దెలాగో చెబుతున్నాడు.

అర్జునా! దేహధారి అయిన పురుషుడు (*దేహీ*) దేహానికి కారణాలైన త్రిగుణాలను దాటి (*దేహ*

***సముద్భవాన్ ఏతాన్ త్రీన్ గుణాన్ అతీత్య***). జననము, మరణము, ముసలితనము, దుఃఖముల నుండి విడిపడి (***జన్మమృత్యు జరా దుఃఖైః విముక్తః***). మోక్షమును పొందు తున్నాడు (***అమృతం అశ్నుతే***).

**దేహోత్పత్తి బీజాలు**

సత్త్వ రజ స్తమో గుణాలే దేహము ఉత్పన్నం కావడానికి కారణాలు. అందుచేత త్రిగుణాలు దేహ సముద్భవాలు. అంటే, దేహోత్పత్తికి బీజ భూతాలు (***దేహ సముద్భవాన్ దేహోత్పత్తి బీజ భూతాన్***). ఈ త్రిగుణాలను జయించాలి, వాటిని దాటి పోవాలి. అప్పుడే మోక్షము సిద్ధిస్తుంది.

మరి, త్రిగుణాలను ఎవరు దాటాలి? దేహియే దాటాలి అంటున్నాడు. దేహి అంటే దేహమును ధరించిన వాడు. దేహంలో ఉండేవాడు. మరి, దేహం లోనే ఉంటూ, దేహోత్పత్తికి కారణాలైన త్రిగుణాలను దేహి ఎలా దాటగలడు? ఒక వస్తువును, లేదా ప్రదేశాన్ని దాటి పోవడము అంటే, దానిని విడిచి ముందుకు పోవడము అని అర్థము. అలాగే దేహానికి కారణాలైన గుణాలను దాటి పోవడము అంటే, దేహము గుణ పరిణామమే కనుక దేహాన్ని దాటి పోవడము అని అర్థము. అంటే, మోక్షము అనేది మరణానంతరమే సంభవము అని భావము.

కాని, ఇక్కడ త్రిగుణాలను దేహి, అనగా దేహవంతుడు, లేదా శరీరధారి దాటి పోతున్నాడు అంటున్నాడు. శరీరమును ధరించిన వాడు గుణాలను దాటి పోతున్నాడు అంటే జీవించి ఉండగానే దాటి పోతున్నాడని అర్థమే గాని (***జీవన్ ఏవ అతీత్య అతిక్రమ్య***) మరణానంతరము దాటుతాడని అర్థం కాదు.

ఇదొక అందమైన దూముడి. దారమును, లేదా త్రాడును ముడి వేసిన తరువాత ఒక కొసను పట్టి లాగితే తేలికగా ఊడిపోయే ముడిని దూముడి అంటారు. అలాగాక, దారాన్ని పూర్తిగా మరొక వైపుకు లాగితే, అది చిక్కుముడి పడే అవకాశము ఉంది. అలాగే కొందరు 'దేహి' అనే పదాన్ని పట్టుకొని, దేహ పతనానంతరమే మోక్షము అని భావిస్తూ ఉంటారు. అంతే కాదు, వారి అభిప్రాయాన్ని శాస్త్రోక్తంగా మలచాలనే ప్రయత్నంలో 'విదేహ ముక్తి', అంటే మరణానంతరము కలిగే మోక్షము అని సిద్ధాంతీకరిస్తూ ఉంటారు కూడా. ఇదంతా 'దూముడి'ని 'చిక్కుముడి' గా మార్చుకొనే ప్రయత్నమే.

ఒకవేళ వాళ్ళు అభిప్రాయ పడినట్లు మరణానంతరమే ముక్తి అని సరిపెట్టుకున్నా, అది మరణము, అంటే దేహత్యాగము అవుతుందే గాని మోక్షప్రాప్తి కాదు. దేహ పతనానంతరము బ్రహ్మలోకమును చేరి, అక్కడ బ్రహ్మదేవుని నుండి తత్త్వోపదేశమును పొంది, అక్కడ నుండి మోక్షాన్ని పొందడము అనేది క్రమముక్తి.

ప్రస్తుత శ్లోకంలో పరమేశ్వరుడు ప్రతిపాదిస్తున్నది జీవన్ముక్తియే గాని క్రమముక్తి కాదు. జీవన్ముక్తి అంటే జీవించి ఉండగానే మోక్షప్రాప్తి. జీవించి ఉన్నవాడు దేహి. దేహమును ధరించి ఉన్నవాడే దేహి. అతడు పొందేదే జీవన్ముక్తి (***జీవన్నేవ ముక్తః***). అందుచేతనే, అలాంటి వారిని జీవన్ముక్తులు అంటారు.

బావుంది. ఇంతకీ, దేహ సముద్భవాలైన త్రిగుణాలను దేహధారి, లేదా దేహి ఎలా దాటుతాడు? అనే ప్రశ్న అపరిష్కృతం గానే ఉండిపోయింది కదా అనే సంశయం మీకు కలగ వచ్చు. ఆ సందేహానికి అవకాశమే లేదు. ఎందుకో తెలుసా? దేహి త్రిగుణాలను దాటే అవసరమే లేదు. ఎందుకని? అతడు దాటే ఉన్నాడు. క్రొత్తగా దాట వలసింది లేదు. ప్రస్తుత శ్లోక వ్యాఖ్యానంలో 'బంధమోక్షాలు కల్పితాలు' అనే శీర్షిక క్రింద మనం చేసిన విచారములో బంధము అనేది వాస్తవానికి లేనిదే అని, కేవలం కల్పితమే నని తెలుసుకున్నాం. బంధము వాస్తవ మైతే దానిని దాటి పోవాలి. బంధము కల్పిత మైనపుడు, లేని దానిని దాటే దేముంటుంది? లేదు అని అర్థం చేసుకోవాలి. అంతే.

ఘటాకాశము అని మనం చెప్పుకు న్నప్పుడు, ఆకాశము ఘటానికి పరిమితంగా లేదు. ఘటాకాశము,





మహాకాశము అని రెండు ఆకాశాలు లేవు. ఆకాశము ఒక్కటే. ఆకాశానికి బంధము లేదు. కనుక, ఆకాశానికి మోక్షము రాదు. కుండలో ఉన్నప్పుడు కూడా ఆకాశము అనంతం గానే ఉంది. కుండను సృష్టించి, కుండలో ఆకాశాన్ని ఎవ్వరూ పెట్టలేదు. వాస్తవానికి ఆకాశం లోనే కుండ తయారైంది. నేను ఘటాకాశాన్ని అని కుండ లోని ఆకాశం భావిస్తే, ఆ భావనే ఆకాశానికి బంధము; కల్పిత బంధము. నేను విశాలాకాశాన్నే; అనంతాకాశాన్నే; నాకు బంధము లేనే లేదు అని కుండ లోని ఆకాశం గ్రహిస్తే, అదే మోక్షము. కనుక, అజ్ఞానమే బంధము. అజ్ఞానం బంధము కనుక జ్ఞానం వల్లనే మోక్షం ప్రాప్తిస్తుంది. ***అవిద్యాతమో నివర్తకస్య జ్ఞానస్య దృష్టం కైవల్య ఫల అవసాన త్వం*** - జ్ఞానము అవిద్యను తొలగిస్తుంది కనుక చివరికి అది మోక్షము అనే ఫలాన్ని ప్రసాదిస్తుంది అని శ్రీ శంకర భగవత్పాదులు భగవద్గీత - మోక్షసన్యాస యోగం లోని అరవై ఆరవ శ్లోక వ్యాఖ్యానంలో విస్పష్టం చేశారు.

**బంధ విముక్తి**

అవిద్యా కారణంగా తాను ఘటాకాశ మని కుండ లోని ఆకాశము భావించినా, తాను మహాకాశ మనే జ్ఞానం కలగ గానే, తాను కుండకు పరిమితం కాదని తెలిసి, ఘటబంధము నుండి ఎలా విడి పోవడం జరిగిందో, అలాగే దేహికి తానే పరమాత్మ స్వరూపము అనే జ్ఞానం కలగ గానే, తాను దేహంలో ఉన్నా దేహానికి పరిమితుడు కాడని తెలిసి, సర్వాత్మానుభూతిని పొంది దేహ బంధము నుండి, అవిద్యా బంధము నుండి విడిపోవడం జరుగుతూ ఉంది. దేహంలో ఉన్నా, ఎప్పుడైతే దేహ సంబంధము లేకుండా ఉన్నాడో, దేహ సంబంధమైన లక్షణాల నుండి, వాటి ప్రభావం నుండి కూడా జ్ఞాని విడిపడి పోయాడు అని అర్థం. వేటి నుండి జ్ఞాని విడిపడ్డాడు? జన్మ మృత్యు జరా దుఃఖాల నుండి విడిపడ్డాడు అంటున్నాడు (***జన్మ మృత్యు జరా దుఃఖైః విముక్తః***).

దేహముతో తాదాత్మ్యము చెందడమే దేహ బంధము అని, ఈ దేహ బంధానికి స్వరూప అజ్ఞానమే కారణము అని గ్రహించాము. మరి, దేహ బంధము అనేది ఏ దశలో ఏర్పడుతుంది? బాల్యం లోనా? యౌవనం లోనా? వార్ధక్యం లోనా? దేహ బంధము అనేది ఒక దశకు సంబంధించింది కాదు. దేహ మున్నంత వరకు జ్ఞానము లేని వానికి దేహ తాదాత్మ్య ముంటుంది. దేహాత్మ భావ ముంటుంది. అదే బంధము. దేహ బంధము లేక పోవడము అంటే, ఏ దశ లోను దేహాత్మ భావం లేక పోవడము అని అర్థము. దేహము అనేది జనన మరణాలు కలిగి ఉంటుంది. ఆద్యంతాలతో కూడి ఉంటుంది. దేహ సంబంధం దేహికి లేదు అంటే, దేహానికి సంబంధించిన జననమరణాలు దేహికి లేవు అని అర్థము. 'జరా' అంటే ముసలితనము. జననమరణాల మధ్య సంభవించే జీర్ణదశ. జననమరణాల నుండి దేహి ఎప్పుడైతే విముక్తిని పొందాడో, అంతరాలావస్థగా తెలుస్తున్న ముసలితనము నుండి కూడా విడిపడి పోయాడు అని అర్థము. జన్మ మృత్యు జరాదులు దేహ సంబంధమైన దోషాలు. ఈ దోషాల నుండి జ్ఞాని సంపూర్ణంగా విడిపడి పోయాడు.

జన్మ మృత్యు జరాదులను ఎప్పుడైతే దోషాలుగా అర్థం చేసుకున్నామో, దోషాలు ఏవైనా దుఃఖాలను పంచేవే గాని తోషాలను, సంతోషాలను పంచేవి కావు కనుక, జన్మ మృత్యు జరాదులు దుఃఖ దాయకాలు అని తెలుసుకున్నాము. దేహము వ్యాధులతో, వృద్ధాప్యంతో దుఃఖాన్ని కలిగిస్తుంది. ఈ రోజు దేహం ఆరోగ్యంగా ఉండొచ్చు. నేటి ఆరోగ్యం రేపుంటుందని చెప్పలేము. దేహంలో ఎప్పుడు ఏ వ్యాధి మకాం పెడుతుందో ఊహించ లేము. ఇవన్నీ దుఃఖాలే. నేను దేహమును అనే సంకల్పమే దుఃఖము అన్నది తేజోబిందూపనిషత్తు (***దేహోఽహ మితి సంకల్పం తద్దుఃఖ మితి చోచ్యతే***).

జన్మ మృత్యు జరా దుఃఖాదులు అన్నప్పుడు, జన్మ మృత్యు జరాదులు దుఃఖదాయకాలు అని అర్థం చేసుకున్నాం. ఇక చివరగా పేర్కొన్న దుఃఖం మనస్సుకు సంబంధించింది. కార్య కారణాలైన దేహేంద్రియాలన్నీ గుణమయాలే నని ముందే అర్థం చేసుకున్నాం కనుక, దేహ సంబంధమైన జననమరణ వృద్ధాప్య బాధలే కాక, మనో సంబంధమైన వ్యథలు కూడా గుణమయాలే. అనాత్మ రూపాలే. అవి కూడా అనంత దుఃఖాన్ని కలిగిస్తాయి. మనస్సే దుఃఖమయం. ఇంతెందుకు? జరాదికాలు కూడా మనస్సే అన్నది వేదం ***( మన ఏవ మహద్దుఃఖం జరాదికమ్ ).***

దేహ మార్పులు ఎలా దుఃఖాన్ని కలిగిస్తున్నాయో, మనో సంబంధమైన రాగాదులు, అభిమాన అహంకారాలు కూడా నిరంతరము మార్పు చెందేవే కనుక అవి కూడా సదా దుఃఖాన్నే కలిగిస్తున్నాయి. వీటన్నిటి నుండి జీవించి ఉండగానే విడి పడటమే విముక్తి ***( జన్మ చ జరా చ దుఃఖాని చ తైః జీవ న్నేవ విముక్తః సన్ విద్వాన్ అమృతం అశ్నుతే ).*** ఇలా విముక్తిని పొందిన వాడు అమృతత్వాన్ని పొందుతున్నాడు. ***మద్భావం సః అధిగచ్ఛతి*** - అతడు నా స్వరూపాన్నే పొందుతున్నాడు అని పూర్వ శ్లోకంలో భగవంతుడు ఏదైతే తెలియ చేశాడో అదే ఈ అమృతత్వము.

**మోక్ష ప్రాప్తి**

అజ్ఞానమే బంధము. కనుక జ్ఞానమే మోక్షము. నీవు అనంతాత్మవు అని తెలియడమే జ్ఞానము. నీవు గుణాతీతుడవు అనేదే నిత్యజ్ఞానము. అనంతానికి బంధ మెలా వస్తుంది? అనంత మనేది దేశకాలాదుల పరిధిలో ఒదిగేది కాదు కనుక, అనంతానికి ఎప్పుడూ బంధము లేదు. ఎక్కడా బంధము లేదు. లేని బంధము ఉన్నట్లు ***( ఇవ )*** అనిపించడమే ఇక్కడ బంధము. అందుకనే దానిని కల్పిత బంధము అన్నాము.

అనంతాత్మ సదా ముక్తమే. దానికి బంధము ఏర్పడే అవకాశమే లేదు. అది నీవే. ఈ సత్యము నీకు తెలిసినా, తెలియక పోయినా నీవు ఆత్మవే. నీవు ఆత్మవు అని నీకు తెలియనంత మాత్రాన నీవు ఆత్మవు కాకుండా పోవు. తెలిసినంత మాత్రాన నువ్వు ప్రత్యేకంగా ఆత్మవు అయ్యేదీ లేదు. నీవు ఆత్మ వనే జ్ఞానం నీకు లేకపోతే నీవు బద్ధుడుగా ఉంటావు. తెలిస్తే? క్రొత్తగా ముక్తుడవు అవుతావా? కావు. ముక్తుడవు అయ్యే ఉన్నావని తెలుసుకుంటావు. అనుభూతిని పొందుతావు. అంతే.

***ఏక స్స న్భిద్యతే భ్రాన్త్యా మాయయా న స్వరూపతః ।***
***తస్మా దద్వైత ఏవాస్తి న ప్రపంచో న సంసృతిః ॥***

సత్యాత్మ అద్వయము. మాయ చేత భిన్నంగా (ద్వైతంగా) తెలుస్తూ ఉంది. విచారించి చూస్తే స్వరూపంలో ద్వైతమే లేదు. ఉన్నది అద్వైత స్వరూపమైన పరమాత్మయే. ప్రపంచమూ లేదు, సంసారమూ లేదు అన్నది అన్నపూర్ణోపనిషత్తు.

ఈ సత్యం అర్థమైతే కర్తగా తాను లేడు; భోక్తగా తాను ఉండడు. పనులన్నీ మాయా రూపాలైన కారణ కార్యాలకు సంబంధించినవే. చూచేది కన్ను. వినేది చెవి. చూడ మనేది, విన మనేది మనస్సు. నేత్ర శ్రోత్రాలు వీక్షించడానికి, వినడానికి శక్తిని ప్రసాదించేది ప్రాణం.

ఈ కార్యాలన్నీ చైతన్య సన్నిధిలో సాగి పోతున్నాయి. క్షేత్రమైన దేదైనా జడమే. జడము మరొక దాని అధీనం లోనే పని చేస్తుంది. దేని అధీనంలో పని చేస్తుందో అది ప్రకాశమై ఉండాలి. సూర్యుని వెలుగులో దేశం ప్రకాశించినట్లు, ఆత్మ ప్రకాశంలో క్షేత్రమైన దేహంలో సమస్త కార్యాలు సాగి పోతున్నాయి. ప్రపంచంలో సాగే కార్యాలన్నీ సూర్యుని ప్రకాశంలో సాగుతున్నా, సూర్యు డెలా సాక్షిమాత్రంగా ఉన్నాడో, దేహం లోని





సమస్త కార్యాలను ఆత్మ ప్రకాశింప చేస్తున్నా, వాస్తవానికి అసంగమై, సాక్షిభూతంగా ఉంది. ఇదే జ్ఞానం.

ఈ జ్ఞానం బుద్ధిలో శోభించాలి అంటే బుద్ధి శుద్ధి పడి ఉండాలి. గుణ మాలిన్యము నుండి విడిపడి ఉండాలి. గుణ వికారాలను దాటి పోవాలి. మోహ రూపమైన తమోగుణం నుండి విడిపడ టానికి పురుషుడు కర్మాచరణములో కాలు మోపాలి. అనుష్ఠానం ద్వారా నిద్రాలస్య మోహాలను దాటి పోవాలి. ఈ విధంగా రజోగుణ ప్రేరితుడై కర్మాచరణంలో కాలు మోపిన వాడు బంధహేతువులు, మలిన పూరితాలు అయిన సకామ కర్మల నుండి క్రమేపి విడిపడి, అభిమాన రహితుడై, ఈశ్వరార్పణ బుద్ధితో కర్తృత్వ భోక్తృత్వాదుల నుండి మెల్లగా పైకి ప్రాకి సత్త్వగుణాన్ని ఆశ్రయించాలి. బుద్ధి సత్త్వ ప్రధానమై నపుడే జ్ఞానార్హ మవుతుంది. తమో రజస్సుల నుండి విడిపడి నిర్మల చిత్తాన్ని పొందడానికి సాధకుడు సత్త్వగుణాన్ని ఆశ్రయించాలి. అలాగని సత్త్వగుణాన్ని కూడా అంటి పెట్టుకో కూడదు. గుణము ఏదైనా గుణమే. ఇనుమైనా, సువర్ణమైనా సంకెల ఏదైనా బంధించేదే. కనుక కాలిలో గ్రుచ్చుకున్న ముల్లు విరిగి నపుడు, దానిని మరొక ముల్లుతో తీసి, ఆ తరువాత రెండు కంటకాలనూ పారేసినట్లు, రజ స్తమస్సు లను దూరం చేసుకోవడానికి సత్త్వాన్ని ఆశ్రయించి, ఆ తరువాత సత్త్వాన్ని కూడా త్యజించాలి ***( కంటకం కంటకే నేవ యేన త్యజసి తం త్యజ ).***

తే॥ ***తటినిఁ దగ నుత్తరించు నంతకు బోత మాశ్రయించి తక్కొల్లని యట్లు పురుష***
***దర్శనము సంభవించు నంతకును సత్త్వమూది పిదప దత్సంబంధ ముడగవలయు ॥***

నదీ ప్రయాణంలో నావ నాశ్రయించిన వాడు నదిని దాటి తీరమును చేరగానే పడవను విడిచి పెట్టినట్లు, తానే పురుషుడనే సత్యజ్ఞానము కలిగే వరకు ప్రకృతి రూపమైన సత్త్వగుణము నాశ్రయించి, పురుష దర్శనం కాగానే, సత్త్వగుణాన్ని కూడా త్యజించి గుణాతీతుడై శోభించాలి అని ఆంధ్రమహాభారతము - అశ్వమేధ పర్వము. ఈ విధంగా గుణాధీనమై బద్ధుడైన వాడు గుణాతీతుడై తరించాలి. అదే గుణాతీత స్థితి. స్థితప్రజ్ఞ. జీవన్ముక్త స్థితి.

*త్రిగుణాలను దాటిన వాడు గుణాతీతుడై తన స్వరూపాన్నే పొందుతాడు అని పరమేశ్వరుడు చెప్పగానే, గుణాతీతుని లక్షణాన్ని, అతని ప్రవర్తనమును తెలుసుకోవాలని భావించిన అర్జునుడు పరమేశ్వరుని ప్రశ్నిస్తున్నాడు.*

**అర్జున ఉవాచ :**

**కైర్లిఙ్గై స్త్రీన్గుణా నేతా నతీతో భవతి ప్రభో ।**
**కిమాచారః కథం చైతాం స్త్రీ న్గుణా నతివర్త తే ॥** 21

*కైః-లింగైః-త్రీన్-గుణాన్-ఏతాన్-అతీతః-భవతి-ప్రభో*
*కిం-ఆచారః-కథం-చ-ఏతాన్-త్రీన్-గుణాన్-అతివర్తతే*

| | | | | | |
|---|---|---|---|---|---|
| ప్రభో | = | కృష్ణా! | భవతి | = | అగుచున్నాడు |
| ఏతాన్ | = | ఈ | ఏతాన్ | = | ఈ |
| త్రీన్ | = | మూడు | త్రీన్ | = | మూడు |
| గుణాన్ | = | గుణాలను | గుణాన్ | = | గుణములను |
| అతీతః | = | అతిక్రమించిన వాడు | కథం చ | = | ఏ విధంగా |
| కైః లింగైః | = | ఏ లక్షణము గలవాడు | అతివర్తతే | = | దాటుతున్నాడు |
| కిమాచారః | = | ఎట్టి ఆచారము గలవాడు | | | |

**అర్జునుడు అడుగుతున్నాడు :**

**కృష్ణా! త్రిగుణాలను జయించిన పురుషుని లక్షణ మేమిటి? అతని ఆచార మెలా ఉంటుంది? ఈ మూడు గుణాలను అతడు ఎలా దాటి పోతాడు?**

**వ్యాఖ్య**

జీవించి ఉండగానే ప్రకృతి లక్షణాలైన గుణాలను జ్ఞాని దాటుతున్నాడు అని భగవంతుడు చెప్పగానే, అట్టి జీవన్ముక్తుని గూర్చి వివరంగా తెలుసుకోవాలనే ఆసక్తి అర్జునునిలో ఏర్పడింది. దీపం ఉండగానే ఇల్లు చక్క బెట్టుకొనే వాడు శ్రేష్ఠుడు. అవకాశాన్ని జార విడుచుకొనే వాడు ఎవడైనా అభాగ్యుడే. సత్యరూపుడైన వాసుదేవుడే ప్రబోధించే టప్పుడు సందేహాలను ఎందుకు ఉంచుకోవాలి? అందుకే అర్జునుడు అడుగుతున్నాడు. ముఖ్యంగా గుణాతీతుని విషయంలో అర్జునుడు మూడు ప్రశ్నలను సంధిస్తున్నాడు.

మొదటిది, గుణాతీతుని లక్షణము. ఏ లక్షణాలను బట్టి అతడు గుణాలను అతిక్రమించాడు అని గ్రహించాలి? ***(కైః లింగైః త్రీన్ గుణాన్ అతిక్రాన్తః భవతి)*** అనేది మొదటి ప్రశ్న.

రెండవది, అతని ఆచారము. అతని ఆచార వ్యవహారాలు ఎలా ఉంటాయి ***( కిం ఆచారః )*** ? ఏ విధమైన ఆచారము గల వానిని గుణాతీతుడుగా గుర్తించాలి? గుణాలను దాటి పోయిన జ్ఞాని యొక్క ప్రవర్తన ప్రపంచంలో ఎలా ఉంటుంది? అనేది రెండవ ప్రశ్న.

ఇక మూడవ ప్రశ్న సాధనకు సంబంధించినది. అతడు త్రిగుణాలను ఎలా అతిక్రమించాడు ***( కథం కేన ప్రకారేణ త్రీన్ గుణాన్ అతివర్తతే)*** ? గుణాతీత స్థితిని పొందడానికి ఉపాయ మేమిటో తెలుసుకోవాలనే జిజ్ఞాసే ఈ మూడవ ప్రశ్నలో వ్యక్త మవుతూ ఉంది.

ఈ మూడు ప్రశ్నలలో గుణాతీత స్థితిని పొందడానికి ఏం చేశాడు? పొంది ఎలా ఉన్నాడు? అనేవి ప్రధానంగా తెలుస్తున్నాయి. జీవన్ముక్తులం కావాలని అందరికీ ఉంటుంది. గుణాతీత స్థితిని పొందాలని అందరూ అభిలషిస్తారు. కేవలం అభిలషించి నంత మాత్రాన పొంద లేరు. ఆశించిన దానిని ఎలా అందుకోవాలో కూడా తెలిసి ఉండాలి.

జీవన్ముక్తి అంటే ఏమిటో, గుణాతీత స్థితి ఎలాంటిదో అర్థం కానపుడు అనర్థాలు ప్రాప్తించే అవకాశం లేక పోలేదు. తెలియని కారణంగా ఎవరు ఏది చెప్పినా అదే సత్యమని భావించే ప్రమాదం ఉంటుంది. ఎక్కువ శాతం సత్యజ్ఞానము లేని వారే ఆధ్యాత్మిక మార్గంలో వంచకుల వాతబడి బ్రతుకును భారంగా మార్చుకుంటూ ఉంటారు. కనుక, పార్థుని ప్రశ్న కేవలం పార్థునికే గాక సమస్త ప్రపంచానికి, సర్వ కాలాలకు ఉపయోగ పడేదై ఉంది.

ఈ ప్రశ్నలను కుంతీకుమారుడు ఇప్పుడే, ఇక్కడే, ఈ సందర్భం లోనే ప్రశ్నించ లేదు. ఈ విధమైన ప్రస్తావన, ప్రశ్నా పత్రము రెండవ అధ్యాయంలో కూడా వినిపించాడు. స్థితప్రజ్ఞుని గూర్చి సాంఖ్యయోగములో ఏ విషయా న్నైతే ప్రశ్నించాడో, ఇక్కడ కూడా అదే ప్రశ్నిస్తున్నాడు. స్థితప్రజ్ఞుని లక్షణ మేమి? అతడెలా నివర్తిస్తాడు? ఎలా ప్రవర్తిస్తాడు? అని అక్కడ ప్రశ్నించాడు ***(కా భాషా ? కిం ఆసీత ? కిం వ్రజేత ?)***. గుణాతీతుని లక్షణాలను, ఆచారాన్ని ఇక్కడ అడుగు తున్నాడు. అర్జునుడు ప్రశ్నించిన చోట భగవంతుడు చిత్ర విచిత్రంగా ప్రవచించాడు. అంతేకాదు. అర్జునుడు అడగక పోయినా, అవసరాన్ని, సందర్భాన్ని పురస్కరించుకొని చాలా చోట్ల స్వయం గానే బోధించాడు కూడా.





రెండవ అధ్యాయంలో స్థితప్రజ్ఞుడుగా, పన్నెండవ అధ్యాయంలో భక్తుడుగా, పదమూడవ అధ్యాయంలో జ్ఞానిగా ఎవరి లక్షణాలను వివరించడం జరిగిందో, అలాగే ఇక్కడ కూడా గుణాతీతుని వైభవము వర్ణింప బడుతూ ఉంది.

ప్రస్తుతం అర్జునుడు ప్రశ్నిస్తున్న ఈ శ్లోకంలో భగవంతుణ్ణి *ప్రభో!* అని సంబోధించడం అర్జునుని సంస్కారానికి, సమయస్ఫూర్తికి ప్రతిరూపంలా భాసిస్తోంది.

*ప్రభుః* అంటే ప్రకృష్టమైన వైభవము కలవాడు అని అర్థము ***(ప్రకర్షేణ భవనాత్ ప్రభుః)***. ప్రభు శబ్దానికి మరొక అర్థం కూడా ఉంది. సర్వ కార్యాలలో అతిశయించిన సామర్థ్యం కలవాడు అని కూడా అర్థం ***( సర్వాసు క్రియాసు సామర్థ్య అతిశయాత్ )***.

పరమేశ్వరుని ప్రభువు స్థానంలో ఉంచి, ఎప్పుడైతే *ప్రభో!* అని పార్థుడు సంబోధించాడో, అలా సంబోధించ డానికి ముందే తాను భృత్యుని స్థానంలో, దాసుని స్థానంలో నిలబడి పోయాడు. చేతులు జోడించి మరీ నిలబడ్డాడు.

'ప్రభూ! ఏ పుణ్యం చేసుకున్నానో నీకు భృత్యుణ్ణి అయ్యాను. దాసుని దైన్యము ప్రభువు అనుగ్రహం తోనే తీరాలి. భృత్యుని సంశయ మైనా, సంతాప మైనా ప్రభువు కృప వల్లనే తీరాలి. నా భాగ్యం కొద్ది నీవు ప్రకృష్ట మైన ప్రభువువు. పైగా అతిశయించిన సామర్థ్యంతో అనుగ్రహించే దాతవు. నీ లాంటి ప్రభువును పొందిన నేను జ్ఞాన కరువుతో ఉండ వలసిన అవసర మేముంది? అందుకే అర్థిస్తున్నా! ప్రశ్న రూపంలో ప్రార్థిస్తున్నా! నిన్నే నమ్ముకున్న వాణ్ణి. ప్రభూ! కరుణించు. కాపాడు. కలతను తొలగించు. కాంతిని ప్రసాదించు.' ఇదే అర్జునుని ఆంతర్యం.

***కృష్ణ యను పలుకులో ఎంత కమ్మదనము !***
***బాధలలో ఓదార్చు అమ్మతనము***
***నిన్ను మించిన దైవమును కనలేము మేము***
***నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా !***

అనేది అక్కడ చిన్నికృష్ణ శతకంలో ఒక వెన్నముద్ద. ఇక్కడ అర్జునుడు సమర్పిస్తున్న నైవేద్యం.

అర్జునా! చెబుతాను విను ***(కైః లింగైః యుక్తః గుణాతీతః భవతి ఇతి తత్ శ్రుణు)*** అంటూ జ్ఞానామృతాన్ని ప్రేమతో వితరణ చేయడానికి వాసుదేవుడు సిద్ధ మయ్యాడు. మనమూ బుద్ధిగా అందుకుందాం.

**శ్రీ భగవానువాచ :**

ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహ మేవ చ పాణ్డవ ।
న ద్వేష్టి సమ్ప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి ॥ 22

***ప్రకాశం-చ-ప్రవృత్తిం-చ-మోహం-ఏవ-చ-పాండవ***
***న-ద్వేష్టి-సంప్రవృత్తాని-న-నివృత్తాని-కాంక్షతి***

| | | | | |
|---|---|---|---|---|
| పాండవ | = | అర్జునా! | మోహం ఏవ చ | = మోహమును |
| సంప్రవృత్తాని | = | సంప్రాప్తములైన | న ద్వేష్టి | = ద్వేషింపడు |
| ప్రకాశం చ | = | ప్రకాశమును | నివృత్తాని | = విడిచి పోయిన వానిని |
| ప్రవృత్తిం చ | = | ప్రవృత్తిని | న కాంక్షతి | = కోరడు |

**శ్రీ భగవంతుడు చెబుతున్నాడు :**

**అర్జునా! ప్రకాశము గాని, ప్రవృత్తి గాని, మోహము గాని - ఇవి కలిగి నపుడు ద్వేషించని వాడు, తొలగి నపుడు కాంక్షించని వాడు గుణాతీతుడు.**

**వ్యాఖ్య**

గుణాతీతుని యొక్క లక్షణాన్ని, గుణాతీతత్వాన్ని పొందే ఉపాయాన్ని బోధించమని అర్జునుడు గత శ్లోకంలో ప్రార్థించాడు. అర్జునుని ప్రశ్నలకు ప్రతి వచనంగా మొదట గుణాతీతుని లక్షణాన్ని వర్ణిస్తున్నాడు భగవంతుడు.

అర్జునా! సత్త్వగుణ లక్షణమైన ప్రకాశము, రజోగుణ లక్షణమైన కార్యప్రవృత్తి, తమోగుణ లక్షణమైన మోహము - ఇవి ప్రాప్తించి నపుడు ద్వేషించని వాడు ***(న ద్వేష్టి సంప్రవృత్తాని)***, నివర్తించి నపుడు కాంక్షించని వాడు ***(న కాంక్షతి నివృత్తాని)*** గుణాతీతుడు.

**ప్రవృత్తాలను ద్వేషించడు**

గుణాల చేత బద్ధుడైన వాడు గుణయుతుడు. గుణ ప్రభావాల నుండి విడిపడిన వాడు గుణాతీతుడు, లేదా జీవన్ముక్తుడు. ఇరువురూ జీవించే ఉన్నారు. ఇద్దరికీ దేహ ముంది. మనస్సుంది. గుణా లున్నాయి. కాకపోతే, వాటి ప్రభావం వారిపై ఎలా ఉంది అనే విషయంలో గుణాతీతుడు గుణయుతుడి కన్నా విలక్షణంగా శోభిస్తూ ఉంటాడు.

ప్రకృతి సంభవాలైన గుణ కార్యాల యొక్క ప్రభావం మనుషులపై ఉంటుంది. సత్త్వగుణము యొక్క కార్యము ప్రకాశము ***(ప్రకాశం చ సత్త్వ కార్యం)***. రజోగుణము యొక్క కార్యము ప్రవృత్తి ***(ప్రవృత్తించ రజః కార్యం)***. తమోగుణము యొక్క కార్యము మోహము ***(మోహం ఏవ చ తమః కార్యమ్)***.

విషయ జ్ఞానము మరియు విషయ సుఖములకు హేతువై సత్త్వగుణము; లోభము మరియు దుఃఖము నకు కారణమై రజోగుణము; మోహము మరియు మూఢత్వమునకు హేతువై తమోగుణము - ఈ మూడు జీవులను బంధిస్తూ ఉన్నాయని అర్థం చేసుకున్నాము. బంధహేతువు లైన ఈ గుణకార్యాల విషయంలో సామాన్యులకు, సాధకులకు కూడా ద్వేష భావం ఉంటుంది.

తమోగుణము నన్ను బాధిస్తూ ఉంది. దీని చేత నేను మందమతి నయ్యాను ***(మమ తమసః ప్రత్యయః జాతః, తేన అహం మూఢః)***. అలాగే దుఃఖ స్వభావమైన రాజస ప్రవృత్తి నాకు కలిగింది. రజోగుణ కార్యాల చేత ప్రేరేపింపబడి కర్మలలో కూరుకు పోయాను. స్వరూపం నుండి జారి పోయాను. సాధనలో భ్రష్టుడ నయ్యాను ***(రాజసీ ప్రవృత్తిః మమ ఉత్పన్నా దుఃఖాత్మికా, కష్టం మమ వర్తతే)***. అలాగే సత్త్వగుణ కార్యాలైన సుఖ ప్రకాశాలు కూడా నాలో సుఖాసక్తిని పెంచి బాధిస్తున్నాయి ***(తథా సాత్త్వికః గుణః మాం సుఖే చ సంజయన్ బధ్నాతి)***. ఈ విధంగా గుణకార్యాలు సంప్రాప్త మైనపుడు సామాన్యులు లేదా సాధకులు ద్వేషించడం మనకు కనిపిస్తూ ఉంటుంది. ఈ గుణకార్యాలు గుణాతీతునికి ప్రాప్తించి నపుడు అతడు వాటిని ద్వేషించడు. కారణం, వాటి ప్రభావము ఆ మహాత్మునిపై ఉండదు. ఈ లక్షణము ప్రత్యేకంగా ఆత్మజ్ఞాని యందే గోచరిస్తుంది; గుణాతీతుని లోనే కనిపిస్తుంది. ఈ ప్రజ్ఞ అతడిలో స్థిరంగా ఉంటుంది. అందుకే గుణాతీతుడు స్థితప్రజ్ఞుడు.

త్రిగుణాల పరిణామంగా ఏర్పడిన ఇంద్రియ మనో దేహాలు మార్పు చెందుతూ ఉంటాయి. మార్పుల మధ్య మారని తత్త్వం కలవాడు గుణాతీతుడు. దేహం ఉంది కనుక గుణాతీతునికి కూడా ఆకలిదప్పులు





ఉంటాయి. అలాగే దేహానికి అనారోగ్యం ఏర్పడ వచ్చు. ఈ విధమైన ప్రతికూలాలు ప్రాప్తించి నపుడు సామాన్యులు కలత చెందుతుంటారు. గుణ ప్రభావంతో చలించి పోతుంటారు. కాని, గుణాతీతుడు చలించడు. దేహేంద్రియ మనస్సులలో కలిగే గుణ చలనాలు వాటికి సంబంధించినవే గాని తనను స్పృశించ లేవు అనే జ్ఞానంతో శోభిస్తూ ఉంటాడు.

గుణాల చేత బద్ధుడైన వాడు గుణకార్యాలు ప్రాప్తించి నపుడు, అవి ప్రతికూలమైతే, వాటిని మార్పు చేసుకోవడం వల్ల సుఖం కలుగుతుందని భావించి, ఆ ప్రయత్నంలో తల మునక లవుతాడు. కాని, అస్థిర మైన క్షేత్ర కార్యాలు స్వరూప జ్ఞానం గల తన ప్రజ్ఞను చలింప చేయ లేవని గుణాతీతుడైన జ్ఞానికి తెలుసు. యోగికి, జ్ఞానికి ప్రధానంగా ఇక్కడే అంతరము గోచరిస్తుంది.

చిత్తవృత్తులు ప్రతిబంధకాలని భావించి, వాటిని నిరోధించే ప్రయత్నంలో యోగి ఉంటాడు. అదే యోగము ***(యోగ శ్చిత్త వృత్తి నిరోధః***; పా 1 - సూ 2 ). ఇలా ఏ వృత్తులు లేని సమాధి కొరకు యోగం ప్రయత్నిస్తూ ఉంటే, వృత్తు లెన్నున్నా తన స్వరూపానికి భంగం లేదు అనే స్థిరప్రజ్ఞ జ్ఞానిలో ఉంటుంది. వృత్తి నిరోధము చేయడానికి వృత్తులపై జ్ఞానికి ద్వేష మేది? అలలను ఆపాలనే ప్రయత్నం సముద్రం ఎందుకు చేస్తుంది? అలల స్వభావాన్ని అవలోకిస్తూ పూర్ణశోభతో అలరారుతూ ఉంటుంది. అంతే. గాలి వీచే టప్పుడు శిరోజాలు చలిస్తాయి. అంతమాత్రం చేత వ్యక్తి చలించి పోతాడా? కేశ చలనానికి తాను వ్యథ చెందుతాడా? గుణ కార్యాలను తమపై ఆరోపించుకొనే వారు గుణబద్ధులు. గుణకార్య ప్రభావాలతో తమకు సంబంధమే లేదనే స్థిరమైన జ్ఞానం కలిగిన వారు గుణాతీతులు. స్వరూప జ్ఞానం నుండి ఎన్నడూ పతనం కాని వారు.

**నివృత్తాలను కాంక్షించడు**

అనుకూలాలు తెలియని వాడు, ప్రతికూలాలు అర్థం కాని వాడు గుణాతీతుడు. కనుక ప్రవృత్తాలను ఎలాగైతే ద్వేషించడో, అలాగే నివృత్తాలను ఆశించడు ***(నివృత్తాని న కాంక్షతి)***.

సత్త్వగుణము ఉద్భూత మైనపుడు మనిషికి సుఖ ప్రకాశాదులు కలుగుతాయి. సత్త్వగుణం వల్ల సంభవించే సుఖ ప్రకాశాదులు దూర మైనపుడు అవి మళ్ళీ కావాలని అందరూ ఆశిస్తారు. అవి లభిస్తే సుఖ ప్రాప్తి కలుగు తుందని భావించడమే అలా ఆశించ డానికి కారణము.

గుణాతీతుడు నివర్తించిన సుఖాలను తిరిగి కాంక్షించడు. కారణం, అతని సుఖం ఒక నిమిత్తంపై ఆధారపడి ఉండేది కాదని అతనికి తెలుసు. తానే సుఖ స్వరూపుడు. తన సుఖం నిత్యసుఖం. రాకపోకలు తెలియని సుఖం. అందుచేత దూరమయ్యే నైమిత్తిక సుఖాలను మళ్ళీ మళ్ళీ పొందాలనే కాంక్ష జ్ఞానిలో ఉండదు.

దేహంలో తానున్నా, తాను దేహానికి సంబంధించిన వాడు కాడు. కనుక, దేహానికి సంబంధించిన ఆకలి దప్పులు, శీతోష్ణాలు, ఆరోగ్య అనారోగ్యాలు, ఆకార వికారాలతో తనకు సంబంధం లేదు.

***దేహం చ నశ్వర మవస్థిత ముత్థితం వా సిద్ధో న పశ్యతి*** - దేహము నశ్వర మని గాని, దేహం కూర్చున్న దని గాని, నిలుచున్న దని గాని ఏ మాత్రం స్పృహ లేకుండా, సదా స్వరూప జ్ఞానంలో ఉండేవాడే గుణాతీతుడు అన్నది వ్యాస భాగవతము.

సుఖదుఃఖా లైనా, జయాపజయా లైనా, మానావమానా లైనా మనస్సుకు సంబంధించినవి. గుణాతీతునికి కూడా మనస్సుంది. తనకు మనస్సుంది. కాని, తాను మనస్సు కాదు. మనస్సు సుఖంగా ఉంటే, అది అలా ఉందని గ్రహించి తనలో ఏ మార్పు లేని వాడు, మనస్సు శోకంతో ఉంటే, అది అలా ఉందని చూస్తూ తాను ఏ వికారానికి లోను కాని వాడు గుణాతీతుడు.

దేహం దేశంలో ఉంది. ప్రదేశంలో ఉంది. మనస్సు దేహంలో ఉంది. ఏ చైతన్య స్ఫూర్తి వల్ల దేహేంద్రియ మనస్సులు చలిస్తున్నాయో, అట్టి ఆత్మ తానే నని ఎరిగిన గుణాతీతుడు దేహంలో ఉన్నాడు; దేహానికి వెలుపల కూడా ఉన్నాడు. మనస్సులో ఉన్నాడు; మనస్సుకు బాహ్యం లోనూ ఉన్నాడు. వాస్తవానికి దేహ మనస్సులే కాదు; దేశకాలాదులు కూడా తన లోనే ఉన్నాయి. అలాంటి మహితాత్మునికి దేనితో సంగత్వ ముంటుంది? తాను ద్వేషించ డానికి తన కన్నా అన్యంగా ఏముంది? ఆశించడానికి తనకి వెలుపల ఏదుంది? ప్రపంచమే అతనికి విస్మృత ప్రాయము. మాయా మాత్రము. ఛాయామాత్రము.

మనిషిని అంటుకొని ఛాయ ఉంటుంది. ఛాయ లేక పోయినా మనిషి ఉంటాడు. మనిషి ఛాయ మట్టిపై పడుతుంది. నీళ్ళపై పడుతుంది. నిప్పుపై పడుతుంది. నీడ మట్టిపై పడినా మనిషి మలిన పడడు. నీడ నిప్పుపై పడినా మనిషి కాలడు. నీడ నీళ్ళల్లో పడినా మనిషి మునగడు. నీడ ప్రభావం మనిషిపై ఉంటుందా? ఛాయా ప్రభావం మనిషిపై ఎలా లేదో, మాయా ప్రభావం కూడా మహాత్మునిపై ఉండదు. అట్టి మహాత్ముడే జీవన్ముక్తుడు, స్థితప్రజ్ఞుడు, గుణాతీతుడు. ఇరవై ఐదవ శ్లోకం చివర *గుణాతీత స్స ఉచ్యతే* అనే వాక్యాన్ని ఈ శ్లోకం నుండి ఇరవై నాల్గవ శ్లోకం వరకు అన్వయించుకుంటూ పోవాలి.

**పర ప్రత్యక్షం కాదు - స్వసంవేద్యం**

గుణాతీతుని లక్షణాలు అనే ఈ విషయంలో ప్రధానమైన ఒక విషయాన్ని సదా స్మృతిలో ఉంచుకోవాలి. ఇవి ఇతరులు గుణాతీతులా, కారా? అనే దానిని అర్థం చేసుకోవడానికి కానే కాదు. ఎవరి లక్షణాలు వారికి అర్థమౌతాయే గాని ఇతరులకు ఎలా కనిపిస్తాయి? అవి దేహ లక్షణాలు కావు కదా కనిపించటానికి!

గుణాతీతుని లక్షణాలు ఆత్మ లక్షణాలే కనుక, అవి ఎవరి మట్టుకు వారికి సంవేద్యములే గాని పరులకు తెలిసేవి కావు ***(ఏతత్ పర ప్రత్యక్షం లింగం, కిం తర్హి స్వాత్మ ప్రత్యక్షత్వాత్ ఆత్మ విషయ మేవ ఏతత్ లక్షణమ్).*** ఒక వ్యక్తిలో ఉండే ద్వేషాన్ని గాని, ఆకాంక్షను గాని మరొకడు ఎలా తెలుసుకో గలడు? తెలుసుకో లేడు ***(న హి స్వాత్మ విషయం ద్వేషం ఆకాంక్షాం వా పరః పశ్యతి).*** ఇక్కడ పరమేశ్వరుడు బోధించిన గుణాతీతుని లక్షణాలను అర్థం చేసుకోవడం ఎవరు గుణాతీతులు, ఎవరు గుణాతీతులు కారు, అని న్యాయ నిర్ణయం చేయడానికి కాదు. కనుక, విజ్ఞులు ఆ కార్యానికి పూనుకో కూడదు. ఆకాశంలో పయనించిన పక్షి జాడల్ని దర్శించాలనే ప్రయత్నము, నీటిపై వ్రాతలను చదవాలని చేసే ప్రయత్నము ఎలాంటివో, అన్యులలో గుణాతీత లక్షణాలను అన్వేషించడం కూడా అలాంటిదే. గుణబద్ధుడు గుణాతీతుని లక్షణాలను దర్శించ లేడు. అందుచేత అవి పర ప్రత్యక్షం కాదు, స్వసంవేద్యాలు.

*గుణాతీతుని లక్షణాలను వివరించిన వాసుదేవ పరమాత్మ, అర్జునుడు అడిగిన గుణాతీతుని ఆచారము అనే మరొక ప్రశ్నకు సమాధానము చెబుతున్నాడు.*

**ఉదాసీనవ దాసీనో గుణై ర్యో న విచాల్యతే ।**
**గుణా వర్తన్త ఇత్యేవ యో౽వతిష్ఠతి నేఙ్గతే ॥** 23

***ఉదాసీనవత్-ఆసీనః-గుణైః-యః-న-విచాల్యతే***
***గుణాః-వర్తంతే-ఇతి-ఏవ-యః-అవతిష్ఠతి-న-ఇంగతే***

| | | | |
|---|---|---|---|
| యః | = ఎవడు | ఆసీనః | = ఉన్నవాడై |
| ఉదాసీనవత్ | = తటస్థుని వలె | గుణైః | = గుణముల చేత |





| | | | |
|---|---|---|---|
| న విచాల్యతే | = చలించడో | అవతిష్ఠతి | = ఉంటాడో |
| గుణాః | = గుణములు | న ఇంగతే | = చలింపడో |
| వర్తంతే ఇతి ఏవ | = ప్రవర్తిస్తున్నాయని మాత్రమే | | |

**అర్జునా! ఉదాసీనుని వలె ఉండేవాడు, గుణాల చేత చలించని వాడు, గుణాలు గుణాలలో ప్రవర్తిస్తున్నా యని తెలిసి స్థిరంగా ఉండేవాడు గుణాతీతుడు.**

**వ్యాఖ్య**

అర్జునుడు అడిగిన రెండవ ప్రశ్న గుణాతీతుని ఆచారము. ఆచారము అంటే ప్రవర్తనము. దీనికి పరమేశ్వరుని ప్రతివచనము పరమాశ్చర్యంగా ఉంది. ఆచార మెలా ఉంటుంది అని అడిగితే, అసలు ఆచారమే లేదు అంటున్నాడు. ప్రవర్తనే లేదంటున్నాడు. అంటే, ఏ చేష్ట లేకుండా జడ స్వరూపంగా ఉన్నాడా? కాదు. చైతన్య స్వరూపం గానే ఉన్నాడు. ప్రవర్తించడం లేదు. అలాగని జడంగా పడి ఉండటం లేదు. లేదేమో అనుకుంటే, దివ్యంగా ఉన్నాడు ***(అవతిష్ఠతి).*** మరి, ఉండి ప్రవర్తించకుండా ఎలా ఉంటాడు? కదలకుండా ఉంటాడు ***(నేంగతే, న చలతి).*** మరి, కదలకుండా ఉండటము కూడా ప్రవర్తనే కదా! అలా ఉండాలి అనుకొని ఉన్నప్పుడు, అది ప్రవర్తన, లేదా ఆచారము అవుతుంది. లేదా, మరెవరైనా విధిగా అలా ఉండ మన్నప్పుడు అదీ ఆచారమే అవుతుంది. ఈ విధమైన విధి నిషేధాల చట్రంలో ఒదిగి ఉన్నది ఏదైనా ప్రవర్తనే అవుతుంది. కాని, గుణాతీతుని విషయంలో ఈ రెండూ పొసగేలా లేవు. తనను తాను నియంత్రించు కోవడానికి తాను మనోస్థాయిలో లేడు; గుణబద్ధుడు కాడు. అలాగని పరులు నియంత్రించ డానికి తాను విధి నియమాల పరిధిలో లేడు. కనుక, గుణాతీతుని ప్రవర్తనము ఎలా ఉంటుంది అంటే ఏమి చెప్పాలి? అది ప్రవర్తనము కాదు ప్రకాశము అని చెప్పాలి. గుణాతీతునిలో ప్రకాశకత్వమే గాని ప్రవర్తకత్వము లేదు అని చెప్పాలి. చేయడము, చేయక పోవడము అనే రెండిటికి అతీతంగా, ఊర్ధ్వంగా, అందనంత ఉన్నతంగా ***(ఉత్)*** ఉన్నాడు ***(ఆసీనః).*** ఆసీనుడు అంటే కూర్చుని ఉన్నవాడు అని అర్థము. కూర్చోవడ మనేది కూడా 'ప్రవర్తనము లేదు' అనే అర్థాన్నే సూచిస్తుంది. ఏమిటి, ప్రశాంతంగా కూర్చుని ఉన్నారు? పనేమీ లేదా? అనే ప్రశ్నలు మనము విన్నవే. మనమూ అన్నవే. కనుక, క్రియా క్రియలకు అతీతంగా, తటస్థంగా, అసంగుడై అకర్త స్వరూపంగా ప్రకాశించే వాడు ఇక్కడ ఉదాసీనుడుగా దర్శన మిస్తున్నాడు. అతడే గుణాతీతుడు. ప్రకాశమే ప్రవర్తనముగా శోభించే అసమాన, అసదృశ ప్రవర్తనము కలవాడు.

**ఉదాసీనుడు**

ఉదాసీనుడు అంటే తటస్థుడు అని మనకు తెలుసు. తటస్థ వైఖరి కలవాడు ఉదాసీనుడు అని చెప్పుకుంటూ ఉంటాము. ఇరువురి మధ్య వివాదము తలెత్తి నపుడు, ఇరు పక్షాలలో ఏ పక్షమూ వహించని వాడు, ఏ పక్షమునూ సమర్థించని వాడు ఉదాసీనుడు ***(యథా ఉదాసీనః న కస్యచిత్ పక్షం భజతే తథా ఉదాసీనవత్ ఆసీనః).***

ఒకరి విషయంలో రాగం లేకుండా, మరొకరి విషయంలో ద్వేషం తలెత్తకుండా ఉండే వాడు ఉదాసీనుడు. అంటే, నా కెందు కొచ్చిందిలే అని మధ్యస్థంగా ఉండే వాడా? ఇదే ఉదాసీనత్వ మైతే, అలాంటి ఉదాసీనుడు జ్ఞాని అవుతాడా? పైగా, అలా భావించడం కూడా ప్రవర్తన క్రిందికే వస్తుంది కదా!

ఇరువురు వ్యక్తులు పరస్పరం కలహించు కోవడం కళ్ళారా చూచిన వ్యక్తిని సాక్ష్యం చెప్పమని అడిగినపుడు, ఏదీ మాట్లాడకుండా మౌనంగా ఉంటాడు. అలాంటి వ్యక్తి వైఖరిని ఉదాసీన వైఖరి అంటూ ఉంటాము.

ఇది ఉదాసీన మేనా? కావచ్చు నేమో కాని, గుణాతీతుని ఉదాసీనత్వము ఇలాంటిది కాదు. నా కేమి జరుగు తుందో అనే భయము కూడా రాగద్వేషాల వలె గుణమే. తనకు ఏ బాధ కలగ కూడదనే కాంక్ష అతనిలో ఉంది. కాంక్ష అయినా, ద్వేష మైనా అది ప్రవర్తకత్వమే గాని ప్రకాశకత్వము క్రిందికి రాదు.

మేలు జరుగుతుంది అనే విషయములో రాగం, కీడు జరుగుతుంది అనే విషయంలో ద్వేషం ఉండే వాడు ప్రకృతి సంభవాలైన గుణాల చేత బద్ధుడే గాని గుణాతీతుడు కాడు. గుణబద్ధుడు ప్రవర్తకుడు. గుణాతీతుడు ప్రకాశకుడు. కేవలం ప్రకాశ స్వరూపుడు. భాసకునికి భాస్య ధర్మముతో సంబంధము లేనే లేదు. యావత్ప్రపంచాన్ని సూర్యుడు ప్రకాశింప చేస్తాడు. సూర్యుడు భాసకుడు. అతని చేత ప్రకాశింపబడే ప్రపంచము భాస్యము. భాస్య రూపమైన ప్రపంచంలో జరిగే కార్యాలకు భాసకుడైన భానునికి సంబంధ మేముంది? కనుక ప్రపంచంలో నడిచే కార్యాల యందు సూర్యుడు ఉదాసీనుడు. వాటి గుణ దోషాలు అంటని వాడు. అసంగుడు.

ప్రపంచంలో నడిచే కార్యాల నన్నిటినీ సూర్యుడు ప్రకాశింప చేస్తూ ఉండినా, ఆ కార్యాలకు అంటక తాను అసంగుడై ఉన్నట్లు, భాస్యమాన మైన, జడరూపమైన, మాయా మాత్రమైన ప్రకృతిని, ప్రకృతి కార్యాలైన గుణాలను ప్రకాశింప చేస్తున్న సాక్షి రూపుడైన గుణాతీతుడు ఆకాశం వలె అసంగుడై ఉంటాడు. దర్పణ సౌందర్యముతో శోభిస్తూ ఉంటాడు.

తనకు అభిముఖంగా వచ్చిన దేనిని అద్దము గ్రహించదు. అలాగని దేనినీ నిరాకరించదు. అన్నిటిని అందు కుంటుంది. కాని, దేనినీ తనలో ఉంచుకోదు, నిలుపుకోదు. అన్నిటిని ప్రతిఫలింప చేస్తున్నా, అద్దము సదా అసంగమే. ప్రకృతి పరిణామాలైన కారణ కార్యాల నన్నిటినీ ఆత్మ చైతన్యము ప్రకాశింప చేస్తూ ఉండినా, తాను దేని తోను సంగత్వము నొందక ఉదాసీనంగా ఉంటుంది. అదే గుణాతీత స్థితి.

ఆత్మ యైన తాను అసంగ మని, అద్వయ మని, ఉదాసీన మని, ప్రకాశ స్వరూప మని ఆత్మానుభూతిని పొందిన ఆత్మవిదుడు ***( స్వం ఆత్మానం అసంగం ఉదాసీనం పరిజ్ఞాయ )*** తెలుసుకుంటాడు. ఆకాశం ఏ విధంగానైతే జలానలానిలాదులచే అంట బడదో, అలాగే అసంగుడు, ఉదాసీనుడు అయిన గుణాతీతుడు తాను అనాత్మ ధర్మాలైన గుణాల చేత అంటబడడు అని గ్రహిస్తాడు ***( యథా నభః గగనం, జల, అనల, అనిలాదిభిః న శ్లిష్యతే, తథా ఆత్మవిత్ గుణాతీతః కదాచిదపి కారణ కార్య ప్రకృతి ధర్మైః న లిప్యతే).*** ఆకాశము ఎలాగైతే జల, అగ్ని, వాయువుల చేత అంట బడకుండా అసంగమై ఉంటుందో, అలాగే ఆత్మవిదుడు ప్రకృతి ధర్మాలైన గుణాల చేత అంట బడకుండా ఉంటాడు. స్వరూపము నందే ప్రతిష్ఠితుడై ఉంటాడు. గుణముల చేత విచలితుడు కాకుండా ఉంటాడు. గుణ చలనాలు ఏవైతే గోచరిస్తూ ఉన్నాయో అవన్నీ గుణాలు గుణ విషయాల యందు సంగమించుట వలన కలిగిన వని భావిస్తాడు.

**గుణ పరిణామము - గుణ ప్రవర్తనము**

ఉదాసీనుని వలె ఆసీనుడై, గుణాల చేత చలించని ఆత్మవిదుడు, దేహములో సమస్త కార్యాలు నడుస్తూ ఉండినా, గుణాలు గుణాలలో ప్రవర్తిస్తూ ఉన్నాయి అని భావించి తాను ఆత్మ స్వరూపము నందే అవస్థితుడై ఉంటాడు ***( గుణా వర్తన్త ఇత్యేవ అవతిష్ఠతి ).***

కార్యకరణ విషయాకారముగా, అంటే దేహేంద్రియ విషయ రూపంగా పరిణమించినవి త్రిగుణాలే. ప్రకృతి గుణాలే. సత్త్వగుణము వలన జ్ఞానేంద్రియాలు, అంతఃకరణ చతుష్టయము; రజోగుణము వలన కర్మేంద్రియాలు, పంచప్రాణాలు; తమోగుణము వలన కలిగిన సూక్ష్మ పంచభూతాలు పంచీకరణం చెంది సమిష్టి స్థూల ప్రపంచముగా మరియు స్థూల దేహముగా పరిణమించాయి అని మనకు తెలుసు. కనుక ప్రకృతి





పరిణామంగా ఏర్పడిన వన్నీ గుణాలే. కార్యమైన దేహము, కరణాలైన ఇంద్రియ మనస్సులు కూడా గుణాలే. వీటిని ప్రకాశింప చేస్తూ, వీటికి అంటక అసంగుడై భాసించే గుణాతీతుడు, కార్యకరణ విషయాకారంగా, అంటే దేహేంద్రియ మనస్సులుగా మరియు విషయ రూపంగా పరిణమించిన గుణాలు పరస్పరము అన్యోన్యాశ్రయత్వంతో ప్రవర్తిస్తున్నాయి, అంటే గుణాలు గుణాల యందు ప్రవర్తిస్తున్నాయే గాని నేనేమీ చేయుట లేదు ***(న ఏవ కించిత్ కరోమి)*** అనే స్థితిలో దివ్యంగా శోభిస్తూ ఉంటాడు. గుణ కార్యాలకు అంటని వాడై ఉంటాడు ***(న ఇంగతే న చలతి, స్వరూపావస్థః ఏవ భవతి ఇత్యర్థః ).*** స్వరూపస్థితి లోనే ఉంటాడు.

*గుణాతీతుని ఆచారాన్ని తరువాత శ్లోకంలో కూడా వర్ణిస్తున్నాడు.*

**సమదుఃఖసుఖః స్వస్థః సమలోష్టాశ్మ కాఞ్చనః ।**
**తుల్య ప్రియాప్రియో ధీర స్తుల్య నిన్దాత్మ సంస్తుతిః ॥** 24

***సమదుఃఖసుఖః-స్వస్థః-సమలోష్టాశ్మ కాంచనః***
***తుల్య ప్రియాప్రియః-ధీరః-తుల్య నిందాత్మ సంస్తుతిః***

| | | | |
|---|---|---|---|
| సమదుఃఖసుఖః | = సుఖదుఃఖముల యందు సముడు | తుల్యప్రియాప్రియః | = ప్రియాప్రియములను సమముగా చూచువాడు |
| స్వస్థః | = తనలో తానుండు వాడు | ధీరః | = ధీరుడు |
| సమలోష్టాశ్మకాంచనః | = మట్టిగడ్డను, రాతిని, బంగారమును సమంగా చూచువాడు | తుల్యనిందాత్మ సంస్తుతిః | = నిందాస్తుతుల యందు సమబుద్ధి కలవాడు |

**అర్జునా! శోక సుఖాలలో సమంగా ఉండేవాడు, ఆత్మస్థితుడు, సమలోష్టాశ్మ కాంచనుడు, ప్రియాప్రియాలలో సముడు, నిందాస్తుతులలో సమబుద్ధి గల ధీరుడు గుణాతీతుడు.**

**వ్యాఖ్య**

**సమత్వము**

అభేదము సమము. భేదము విషమము. అభేదము వికార రహితము. భేదము వికార యుతము. ఒక కాలంలో అవికారంగా గోచరించినా, మరొక కాలంలో వికారయుత మయ్యేది భేదము. సర్వ కాలముల యందు భేద రహితంగా, వికార రహితంగా ఉండేది సమము ***( సర్వ కాలేషు సర్వ వికార రహితత్వాత్ సమః ).***

వికారాలన్నీ ప్రకృతి లక్షణాలే. కనుక ప్రకృతి యందు భేదము, విషమత్వము గోచరిస్తాయే గాని సమత్వము తెలిసి రాదు. విషమత్వము, లేదా భేదము అనేది దోషము. ఈ విధమైన భేదము, విషమత్వము లేనిది, సమరూప మైనది బ్రహ్మమే గాని గుణయుతమైన ప్రకృతి కాదు. అందుచేత బ్రహ్మమును నిర్దోష మని, సమ మని గీతాచార్యుడు కర్మసన్యాస యోగము లోనే తెలియ చేశాడు ***( నిర్దోషం హి సమం బ్రహ్మ-*** *5 వ అ - 19 వ శ్లో ).*

ప్రకృతిలో భేద ముంది. గుణభేద ముంది. కనుక ప్రకృతి సంబంధమైన విషయాలలో జ్ఞేయ భేదం అనివార్యం. జ్ఞేయ విషయాలలో భేదము ఉంది కనుక వాటికి సంబంధించిన జ్ఞానములో కూడా భేదం ఉండి తీరుతుంది. ఇదే భేద జ్ఞానము. విషమత్వానికి కారణము. ఈ విధమైన విషమ బుద్ధినే భేద బుద్ధి అంటారు. ఏ బుద్ధిలో విషమత్వము ఉండదో, భేదము తెలిసి రాదో అది సమబుద్ధి. సమబుద్ధి గల వాడు సముడు. అతడే

ఆత్మస్థుడు. గుణాతీతుడు. అభేద జ్ఞానం కలవాడు. అతడినే ఈ శ్లోకంలో భగవంతుడు 'స్వస్థుడు' అంటున్నాడు. అభేద జ్ఞాన స్వరూపమైన తన ఆత్మ యందే ఉండువాడు స్వస్థుడు.

**స్వస్థుడు**

తన స్వరూపమైన ఆత్మ యందే ఉండువాడు స్వస్థుడు ***(స్వే ఆత్మని స్థితః స్వస్థః)***. ఆత్మను ప్రసన్నం చేసుకున్న వాడు కనుక స్వస్థుడైన ఆత్మవిదుని ప్రసన్నుడు అన్నారు శ్రీ శంకరాచార్యస్వామి ***(ప్రసన్నః)***. శాంతి తన స్వరూపముగా కలవాడు స్వస్థుడు. ఈ స్వస్థత సదా ఉండేదే కనుక అతడు సుప్రసన్నుడు. నిత్యానంద స్వరూపుడు. ఏ కాలం లోను, ఏ అవస్థ లోను అశాంతి ఎరుగని వాడు, ఆనందము నశించని వాడు.

మన ఆనందము అనుకూల పరిస్థితులపై ఆధారపడి ఉంటుంది. అన్నీ అనుకూలంగా ఉంటేనే మనకు స్వస్థత. అనుకూలాలు ప్రతికూలాలుగా మారి నపుడు అస్వస్థత. అస్వస్థత ఏర్పడి నపుడు అశాంతికి గురైన మనం ఒకప్పుడు నేను శాంతిగా ఉండే వాణ్ణి. ఆ కాలంలో నాకు అస్వస్థత తెలిసేదే కాదు. ఆ పరిస్థితులలో నేను ఎంతో సుఖంగా ఉండేవాణ్ణి అని చెబుతూ ఉంటాము.

కాని, గుణాతీతుడు సదా స్వస్థత లోనే ఉంటాడు. అతనిది నిత్య స్వస్థత. నిత్యానందము. అతని ఆనందము దేశ కాల పరిస్థితులపై ఆధారపడి ఉన్నది కాదు. అప్పుడు సుఖిని, ఇప్పుడు దుఃఖిని అనేది భేద జ్ఞానము. గుణ వికారాలతో కూడుకున్నది. అంతఃకరణమునకు సంబంధించింది. ఈ విధమైన గుణ వికారాలు స్వస్థు డైన ఆత్మస్థునిలో ఉండవు, ఉండలేవు. కనుక, అతడు సదానంద స్వరూపుడు. సుఖదుఃఖాలకు అతీతుడు. గుణాతీతుడు.

**సుఖదుఃఖాలలో సమత్వము**

దుఃఖ సుఖాలు ఎవరికి సమంగా గోచరిస్తాయో అతడు దుఃఖ సుఖ సముడు ***(సమే దుఃఖ సుఖే యస్య సః సమ దుఃఖ సుఖః)***. సుఖము దుఃఖము కాదు. అలాగే దుఃఖము సుఖము కాదు. సుఖదుఃఖాలు పరస్పర విరుద్ధములు కనుక, భేదజ్ఞానంతో తెలుస్తున్నాయి. విషమత్వంతో గోచరిస్తున్నాయి. భేద జ్ఞానము ప్రకృతికి సంబంధించినది. గుణయుత మైనది. కనుక సుఖదుఃఖములు అనేవి అనాత్మ ధర్మాలే కాని ఆత్మ ధర్మాలు కావు. రాగం వల్ల ఏర్పడేది సుఖం, ద్వేషం వల్ల కలిగేది దుఃఖం. దేనిపై మనకు రాగ ముందో అది చేరువైతే సుఖం; దూరమైతే దుఃఖం. అలాగే దేనిపై మనకు ద్వేష ముందో అది దూరమైతే సుఖం; చేరువైతే దుఃఖం. ఈ రాగద్వేషాలు అంతఃకరణ ధర్మాలు. అనాత్మ సంబంధ మైనవి. వీటి వల్ల అంతఃకరణములో ఏర్పడే సుఖ దుఃఖానుభవాలు కూడా అంతఃకరణకు సంబంధించినవే. మార్పు చెందేవే. భేద రూపమైనవే. విషమత్వానికి సంబంధించినవే.

అనాత్మ ధర్మాలు, గుణ సంబంధములు అయిన రాగద్వేషాలు ఆత్మ యందు ఉండవు, ఉండ లేవు. ఆత్మ సమ మైనది. సమమైన ఆత్మ యందు విషమత్వానికి అవకాశము లేదు. భేదానికి స్థాన ముండదు. కనుక సుఖదుఃఖా లనేవి గుణస్థునిలో గోచిరిస్తాయే గాని స్వస్థునిలో కనిపించవు. సమరూపుడైన ఆత్మస్థునిలో అగు పించవు.

గుణాలు మిథ్యారూపాలు. మిథ్యారూప గుణాలను ప్రకాశింప చేసే ఆత్మ చైతన్యము నిర్వికారము కనుక, అది అంతఃకరణ లోని సుఖదుఃఖానుభవాలను ప్రకాశింప చేస్తుందే గాని వాటి యందు ప్రవర్తించదు. అందుచేత, సుఖమైనా, దుఃఖమైనా తమ విషమత్వము యొక్క ప్రభావాన్ని సమరూపమైన ఆత్మపై చూప లేవు. కనుక, స్వస్థుడు, ఆత్మస్థుడు అయిన గుణాతీతుడు సుఖదుఃఖాల యందు సమంగా ఉంటాడు.





గుణాలు ప్రకృతి అధీనాలు కనుక, నిరంతరము ప్రకృతి లాగే మార్పు చెందుతూ ఉంటాయి. ప్రకృతి మయమైన ఈ ప్రపంచంలో నిరంతరము మార్పులే కనిపిస్తూ ఉంటాయి. చీకటివెలుగులు, ఎండవానలు, శీతోష్ణాలు, ఇవి సదా మారుతూ గోచరిస్తుంటాయి. అలాగే గుణాలు మారుతూ ఉంటాయి. మనస్సు మారుతూ ఉంటుంది. అనుభవాలు మారుతూ ఉంటాయి. ఈ మార్పుల మధ్య భేద వృత్తులే ఉంటాయి. భేద జ్ఞానమే ఉంటుంది.

కాని, గుణాతీతుని యొక్క సమస్థితి అలాంటిది కాదు. అనాత్మ ధర్మాలు తనలో లేనందున మనస్సులో సుఖదుఃఖాలు మారుతున్నా, తనలో ఏ మార్పు లేకుండా గుణాతీతుడు సమస్థితిలో, గుణాతీత స్థితిలో స్వస్థుడై ఉంటాడు.

సుఖం అనే పదంలో 'ఖం' ఉంది. దుఃఖం అనే పదంలో కూడా 'ఖం' ఉంది. **ఖం** అంటే ఆకాశము. సుఖం, దుఃఖం అనే పదాలలో 'ఖం' అనే శబ్దం ఎలాగైతే సమానంగా ఉందో, అలాగే అంతఃకరణ ధర్మాలైన సుఖదుఃఖాల యందు కూడా ఆకాశము వలె గుణాతీతుడు సమంగా ఉంటాడు. అనాత్మ ధర్మా లైన సుఖ దుఃఖాల చేత ఆకాశం లాగా అంటబడకుండా ఉంటాడు.

***న నభో ఘటయోగేన సురా గంధేన లిప్యతే।***
***తథాత్మోపాధి యోగేన తద్ధర్మైః నైవ లిప్యతే॥***

కుండ లోని ఆకాశము కుండ లోని కల్లు వాసన చేత ఎలా అంట బడదో, అలాగే దేహేంద్రియ మనోబుద్ధులనే ఉపాధిలో ఆత్మ భాసిస్తూ ఉండినా, ఉపాధి ధర్మాలైన సుఖదుఃఖాది అనిత్య ధర్మాల చేత అంట బడదు అని శ్రీ శంకరాచార్యస్వామి వివేక చూడామణి గ్రంథంలో రచించారు.

**సమలోష్టాశ్మ కాంచనుడు**

దుఃఖ సుఖాలలో సముడుగా ఉన్న గుణాతీతుడు లోష్టాశ్మ కాంచనాలలో కూడా సమత్వమును కలిగి ఉంటాడు. 'లోష్టః' అంటే మట్టిగడ్డ. 'అశ్మ' అంటే రాయి. 'కాంచన' మంటే బంగారు. సమలోష్టాశ్మ కాంచనుడు అంటే మట్టిగడ్డ, రాయి, బంగారమును సమానంగా చూచేవాడు అని అర్థము ***(లోష్టం చ అశ్మా చ కాంచనం చ సమాని యస్య సః సమలోష్టాశ్మ కాంచనః)***. ఆరవ అధ్యాయంలో యోగారూఢుని గూర్చి ముచ్చటించి నపుడు కూడా ఈ సమలోష్టాశ్మ కాంచనుడు అనే విషయాన్ని భగవంతుడు ప్రస్తావించడం జరిగింది *(6 వ అ - 8వ శ్లో)*.

మట్టిగడ్డ అయినా, రాయి అయినా, బంగార మైనా భూమి నుండి ఆవిర్భవించినవే. మహిమ తెలిసిన గుణాతీతునిలో మట్టికి విలువ ఏముంటుంది? అన్నీ వస్తువులే. ఇక విలువ లంటారా? కల్పించుకుంటే ఉంటాయి. విడిపించుకుంటే పోతాయి. రాయి అయినా, మట్టిపెళ్ల అయినా, బంగారు ముద్ద అయినా పృథివి సంజాతాలే. ఒకవేళ భూమిలో రాళ్ళ మోతాదులో బంగారు లభ్యమై, బంగారు మోతాదులో రాళ్ళు లభిస్తే, దేని విలువ ఎలా ఉండేదో! అన్నీ మారే విలువలే. వస్తువులకు ఉన్న విలువలు నిత్య మైనవి కావు. మనం ఇచ్చే విలువలను బట్టి అవి వెలుగుతూ ఉంటాయి. వాటిపై మన కుండే ప్రియత్వాన్ని బట్టి వాటి వెలుగులు పెరుగుతూ ఉంటాయి. ప్రియత్వము తగ్గితే విలువలు కూడా తరిగి పోతూ ఉంటాయి.

ఒక స్త్రీ మూర్తి మాంగల్యానికి విలువ కట్టే దెవరు? ఎవరి కుంది ఆ శక్తి? మాంగల్యానికి ప్రతిరూపంగా మంగళసూత్రం శోభిస్తూ ఉంటుంది. ఒక తల్లి మెడ లోని మాంగల్యం సువర్ణ సూత్రంగా ఉంటుంది. మరో తల్లి మెడలో పసుపు త్రాడు ఉంటుంది. ఒక మాతృమూర్తి మెడ లోని సూత్రానికి బంగారు బిళ్ళలు ఉంటే, మరో తల్లి

మెడ లోని సూత్రానికి పసుపుకొమ్ము ఉంటుంది. విలువ దేనికి? వస్తువుకా? లేక మాంగల్యానికా? కళ్ళు మూసుకున్న వారు ఏవైనా చూడగలరు. కనువిప్పు కలిగితేనే ఉన్నది కనిపిస్తుంది. ఉన్నది సత్యము. మన మనస్సులో ఉన్నవి అసత్యాలు. అసత్యాలపై, అనిత్యాలపై గుణ విషయాలపై దృష్టి లేని వాడు జ్ఞాని; సముడు. అతడే గుణాతీతుడు.

**ఆఖ్యాయిక**

ఒక తండ్రికి ఇద్దరు కుమారులు. తండ్రి మరణిస్తూ తన వద్ద ఉన్న పది బంగారు బిస్కెట్లను కుమారు లిరువురికి ఐదేసి చొప్పున పంచి ఇచ్చి కన్ను మూశాడు.

తండ్రి మరణించిన కొంత కాలానికి పెద్ద కుమారుడు సన్యసించి సాధువు అయ్యాడు. చిన్న కుమారుడు గృహస్థుడై, ఒక వ్యాపారాన్ని ప్రారంభించి, ధనార్జన చేసి భార్యాబిడ్డలతో కలిసి జీవిస్తున్నాడు.

కొన్ని సంవత్సరాలు గడిచాయి. సాధువుగా మారిన జ్యేష్ఠ భ్రాతను చూడాలనే కోరికతో గృహస్థుడైన సోదరుడు అన్నగారి ఆశ్రమానికి వచ్చాడు. సాధు రూపంలో ఉన్న అన్నగారిని దర్శించాడు. రెండు రోజులు ఆశ్రమం లోనే ఆనందంగా గడిపాడు. తిరిగి ఇంటికి వెళ్ళే సమయంలో సాధు మహాత్మునికి నమస్కరించి ఆశీస్సులను అర్థించాడు.

నాయనా! క్షేమంగా ఉన్నావు కదా? అని ప్రశ్నించాడు సాధువు. ఉన్నాను. తండ్రి గారు ఇచ్చి వెళ్ళిన ఐదు బంగారు బిస్కెట్లను పెట్టుబడిగా పెట్టి వ్యాపారం చేశాను. బాగా గడించాను. భగవత్కృప వల్ల ఆ అయిదు బిస్కెట్లు ఇప్పుడు యాభై అయ్యాయి అన్నాడు.

మరి, ఇప్పుడు తృప్తిగా ఉన్నావా? అని ప్రశ్నించాడు సాధువు. లేదు. ఇంకా ప్రయత్నిస్తున్నాను. ఆ యాభై బిస్కెట్లను వంద చేయాలని ప్రయత్నిస్తున్నాను. నా ఆశ ఫలిస్తే, ఇక ఆ తరువాత అంతా తృప్తే అన్నాడు తమ్ముడు.

వెంటనే సాధువు లేచి లోనికి వెళ్ళి కొంతసేపు గదిలో అటు ఇటు వెతికి, దొరికిన ఐదు బంగారు బిస్కెట్లను తెచ్చి వ్యాపారికి ఇచ్చాడు. ఇవీ ఉంచుకో అన్నాడు.

అదేమిటి? మీ అయిదు బంగారు బిస్కెట్లు నా కిచ్చేస్తున్నారు? అంటూ ఆశ్చర్య పోయాడు గృహస్థు డైన సోదరుడు.

ఫరవా లేదులే, తీసుకో! వాటి అవసరం నా కన్నా నీకే ఉంది. నీవు ప్రస్తావించినంత వరకు అవి నా వద్ద ఉన్నాయని కూడా నాకు జ్ఞాపకం లేదు. నువ్వే ఇప్పుడు వాటిని స్మృతికి తెచ్చావు. నీకు వాటి వల్ల తృప్తి కలుగుతుందని అంటున్నావు కనుక, నువ్వే తీసుకో! నేను ఇలాగే తృప్తిగా ఉన్నాను. నా తృప్తి వాటిపై ఆధారపడి లేదు. అన్నాడు సాధువు.

వీరిరువురిలో ఎవరు భాగ్యవంతులు? ఎవరిది బంగారు జీవితము? తృప్తి అనేది మనకు ఏమి ఉంది అనే దానిపై ఆధారపడి లేదు. మనము ఎలా ఉన్నాము అనే దానిపై ఆధారపడి ఉంది. మరొక దానిపై ఆధారపడ్డ వాళ్ళు తృప్తి చెందిన దాఖలాలు ప్రపంచంలో లేవు. స్వస్థుడైన వానికే నిత్యతృప్తి ఉంటుంది. అతడే నిత్యతృప్తుడు; నిరాశ్రయుడు. తన తృప్తికి మరొకటి అవసరం లేదు. తానొక్కడే చాలు. అతడే గుణాతీతుడు. తన కన్నా అన్యమైన వాటి యందు అతనికి స్పృహ ఉండదు. కనుక వాటి మధ్య భేదం చూడడు. అన్నీ సమమే. అన్నిటినీ సమత్వం తోనే వీక్షిస్తాడు. అందుకే, గుణాతీతుడు సమలోష్టాశ్మ కాంచనుడు.





***న తదస్తి న యత్రాహం న తదస్తి న తన్మయమ్,***
***కి మన్య దభి వాంఛామి సర్వం సచ్చిన్మయం తతమ్ ॥***

'నేను లేని దెక్కడ? నేను కానిది ఏముంది? నేను కోరదగింది వేరొకటి ఏదుంది? సమస్తములో వ్యాపించి యున్న సద్రూప చైతన్యము నేనే' - ఇదే ఆత్మవిదుని, గుణాతీతుని అద్వైతానుభూతి అని ఉపనిషత్ ప్రవచించింది.

**ప్రియా ప్రియాలలో సమత్వము**

ప్రియమైన వాటిని, అప్రియమైన వాటిని సమానంగా చూచేవాడు తుల్య ప్రియాప్రియుడు (***ప్రియం చ అప్రియం చ ప్రియాప్రియే తుల్యే సమే యస్య సః అయం తుల్య ప్రియా ప్రియః***).

ఇష్ట మైనది ప్రియంగా ఉంటుంది. అనిష్ట మైనది అప్రియంగా ఉంటుంది. ఇంతకీ ఏది ప్రియవస్తువు? ఏది అప్రియ వస్తువు? ఏది సుఖహేతువో అది ప్రియవస్తువు. ఏది దుఃఖహేతువో అది అప్రియ వస్తువు. సుఖదుఃఖా లనే ద్వంద్వాలు మనోకల్పితాలు. ఏది సుఖము? ఏది సుఖ వస్తువు? సుఖ వస్తువు అనేది ఒకటి ఉంటే, అందరూ దాని వెంటే పడేవారు. ఏది సుఖమో, ఏది సుఖహేతువో అర్థం కాకపోవడం చేతనే ఒక్కొక్కరు ఒక్కొక్క దాని వెంటపడి పోతున్నారు.

ఒకరికి సుఖా న్నిచ్చేది మరొకరికి దుఃఖాన్ని పంచుతూ ఉంది. ఇంతకీ అది సుఖమా, దుఃఖమా? రెండూనా? లేక రెండూ కాదా? ఒకరికి సుఖా న్నిస్తుంది కనుక అది దుఃఖం కాదు అని చెప్పాలి. అలాగే మరొకరికి దుఃఖాన్నిస్తూ ఉంది కనుక అది సుఖమూ కాదని అనాలి. సుఖమూ కానిది, దుఃఖమూ కానిది ఏదో అది నిజానికి కానిదే. అయినది కాదు; మన దైనది కాదు. మనది కానిది పరస్థమే గాని స్వస్థం కాదు. గుణస్థమే కాని ఆత్మస్థం కాదు. గుణస్థ మైనవి, ప్రకృతిస్థ మైనవి ఏవైనా అనిత్యమే. వాటిలో ప్రియత్వ మెక్కడుంది? అప్రియత్వం మాత్రం ఎక్కడుంది? ఇది అర్థమైన గుణాతీతుడు ప్రియాప్రియాలు లేని వాడు. ఇతరులకు ఉన్నట్లు అనిపించినా, తనలో విషమత్వము లేదు కనుక సమత్వమే అనుభూతిగా ఉంటుంది. ఇదే సమబుద్ధి. సమబుద్ధి కలవాడు కనుక గుణాతీతుడు ధీరుడు. అంటే, ధీమంతుడు (***ధీరః ధీమాన్***). అంటే బుద్ధిమంతుడు. మామూలు బుద్ధిమంతుడు కాడు. సమ బుద్ధిమంతుడు.

**నిందాస్తుతులలో సమత్వము**

నిందాస్తుతులలో కూడా గుణాతీతుడు సముడే. ఇక్కడ నింద అయినా, స్తుతి అయినా పరకృతమే గాని స్వకృతం కాదు; స్వీయకృతం కాదు. ఇతరులు తన విషయంలో చేసే పొగడ్త స్తుతి అయితే, ఇతరులు తన విషయంలో చేసే విమర్శ నింద అవుతుంది. ఈ విధమైన నిందాస్తుతులలో గుణాతీతుడు సమంగా ఉంటాడు. ***తుల్య నిందా సంస్తుతిః*** అంటే అదే (***తుల్యే సమే నిన్దాత్మ సంస్తుతీ యస్య సః తుల్య నిన్దాత్మ సంస్తుతిః***).

శ్రుతి లేని పాట ఎవరి వీనులకు విందు? ఎవరి మనస్సుకు పసందు? వివేకం లోపించిన నిందలో పస ఎక్కడుంది? వివేకం లేని స్తుతిలో నస ఉందే గాని పనస ఎక్కడుంది? స్తుతించడాని కైనా, నిందించడాని కైనా తత్సంబంధమైన జ్ఞానం ఉండాలి. రాగద్వేషా లనే దురదల వల్ల ప్రదర్శించే నిందాస్తుతులనే గోకడాలు ఎవరికి తృప్తి నిస్తాయి?

భగవంతుని స్తుతించడం మనకు సాధ్యమయ్యే విషయ మేనా? మన భక్తి కొద్ది మనం ప్రస్తుతించ వచ్చు. అందులో దోషం లేదు. కాని దాని వల్ల భగవంతునికి ఒరిగే దేముంటుంది? పరమేశ్వరుని ప్రశంసించ

డానికి కావలసిన పరిపూర్ణ జ్ఞానం మన కుందా? ఇక నింద విషయాని కొస్తే, భగవంతునిలో ఏ దోష ముందని మనం నిందించ గలం? మన పొగడ్తలకు పొంగి పోవడానికి, మన నిందలకు క్రుంగి పోవడానికి అవసరమైన అజ్ఞానం లేనివాడు భగవంతుడు. పొగిడే వ్యక్తి వెనుక, తెగడే వ్యక్తి వెనుక ఉండేది అజ్ఞానమే కదా! అజ్ఞానాన్ని చూచి జ్ఞాని ప్రతిచర్యలతో ప్రతిస్పందిస్తాడా? తనను పొగిడే వ్యక్తి స్తుతుల కన్నా తాను అతీతుడని పరమేశ్వరునికి తెలుసు. అలాగే తనను తెగడే వ్యక్తుల నిందల కన్నా తాను భిన్నుడని కూడా తెలుసు. అజ్ఞాన కార్యాలైన నిందాస్తుతులలో ఉన్నది అజ్ఞానమే కనుక, అజ్ఞానంలో భేద దర్శనమే ముంది? అంతా అజ్ఞానమే కదా! కనుక అజ్ఞాన కార్యాలకు జ్ఞాని చలించడు. అతడే స్వస్థుడు. అతడే గుణాతీతుడు. ఈశ్వరుడే తాను అనే బ్రహ్మాత్మ జ్ఞానము కలవాడు గుణాతీతుడు.

*గుణాతీతుని మరి కొంత ఆచార విషయాన్ని తరువాత శ్లోకంలో కూడా వివరిస్తున్నాడు.*

**మానాపమానయో స్తుల్య స్తుల్యో మిత్రారి పక్షయోః ।**
**సర్వారమ్భ పరిత్యాగీ గుణాతీతః స ఉచ్యతే ॥** 25

*మానాపమానయోః-తుల్యః-తుల్యః-మిత్రారిపక్షయోః*
*సర్వారంభ పరిత్యాగీ-గుణాతీతః-సః-ఉచ్యతే*

| | | | | | |
|---|---|---|---|---|---|
| మానాపమానయోః | = | మానావమానముల యందు | యః | = | ఎవడో |
| తుల్యః | = | సమబుద్ధి కల వాడు | సః | = | వాడు |
| మిత్రారి పక్షయోః | = | శత్రుమిత్ర పక్షముల యందు | గుణాతీతః | = | గుణాతీతుడని |
| తుల్యః | = | సముడు | ఉచ్యతే | = | చెప్పబడు తున్నాడు |
| సర్వారంభ పరిత్యాగీ | = | కర్తృత్వాభిమానమును త్యజించిన వాడు | | | |

**పార్థా! మానావమానాల యందు సమబుద్ధి గల వాడు, మిత్ర శత్రువులను సమంగా వీక్షించే వాడు, కర్తృత్వాభిమానము లేనివాడు గుణాతీతుడు.**

**వ్యాఖ్య**

గుణాతీతుడు ఆత్మజ్ఞాని అని, జీవన్ముక్తు డని ఇప్పటికే మనం అర్థం చేసుకున్నాం. ఆత్మజ్ఞానికి విధి నిషేధాలు లేవు. ఆత్మవిదుడు ఇలా ఉండాలి; అలా ఉండ కూడదు అనే విధానాలను వివరించే సాహసం శాస్త్రం చేయలేక పోయింది. జీవన్ముక్తుడు ప్రపంచం లోనే చరిస్తూ ఉంటాడు. కాని, ప్రపంచం అతనిలో ఉండదు. ప్రపంచం యొక్క ప్రభావం అతనిపై పడదు.

తాను నిత్యానంద స్వరూపుడు; పూర్ణానంద స్వరూపుడు. అతడి ఆనందాన్ని పెంచేవారు లేరు; తగ్గించే వారూ లేరు. అతని ఆనందము నిర్హేతుక మైనది; నిర్నిమిత్త మైనది. తాను ఆనందించ డానికి ఏ కారణమూ అవసరం లేదు. అతని ఆనందము ఒక ప్రత్యేక పరిస్థితిపై ఆధారపడి లేదు. అతడు సదానంద స్వరూపుడు. నిర్వికారుడు. కనుక ఏ వికారములు అంటని వాడు; అసంగుడు.

**మానావ మానాలలో సముడు**

ఆదర భావంతో చేసే సత్కారము మానము, లేదా గౌరవము. అనాదర భావంతో చేసే తిరస్కారము అవమానము, లేదా అగౌరవము. సత్కారములో సంతసించడం, తిరస్కారములో పరితపించడం సామాన్య మానవులకు సహజం. సత్కార తిరస్కారాలలో సమంగా ఉండట మనేది సర్వులకు అసహజము. కాని,





గుణాతీతునికి అది సహజ లక్షణము. కనుక జ్ఞాని మానావమానాల యందు సమదృష్టితో ఉంటాడు; సమత్వమును ప్రదర్శిస్తూ ఉంటాడు (**మానావ మానయోః తుల్యః నిర్వికారః**). ఏ విధమైన వికారము లేకుండా నిర్వికారంగా ఉంటాడు. అంటే, మనస్సులో హర్ష విషాదాది వికారాలు లేకుండా ఉంటాడని అర్థం.

పూర్వ శ్లోకంలో నిందాస్తుతులలో సముడుగా కనిపించిన మహాత్ముడే ప్రస్తుత శ్లోకంలో మానావ మానాలలో సముడుగా గోచరిస్తున్నాడు.

నిందలో అనాదరము, స్తుతిలో ఆదరము ఉన్నట్లే, అవమానంలో అనాదరము, మానములో ఆదరము గోచరిస్తున్నాయి. కాకపోతే నిందాస్తుతులు కేవలం వాచకాలు; శబ్దరూపాలు. మానావమానాలు శబ్దరూపాలు కావచ్చు; క్రియారూపాలూ కావచ్చు.

స్తుతులు, సత్కారాలు సర్వులను సంతోష పెడతాయి. నిందలు, తిరస్కారాలు సహజం గానే సర్వులకు సంతాపాన్ని కలిగిస్తాయి. సంతోషాలైనా, సంతాపాలైనా, హర్ష విషాదాలు రెండూ వికారాలే. మనోవికారాలే. వృత్తి విశేషాలే. సర్వులూ వీటి ప్రభావానికి చలిస్తూ ఉంటే, సర్వులకు భిన్నంగా, వృత్తి విశేషాల చేత వికారాన్ని పొందకుండా గుణాతీతుడు విలక్షణంగా ఉంటాడు. నిందాస్తుతులలో, మానావమానాలలో నిర్వికారంగా విలసిల్లుతాడు.

స్వభావము చేత గుణదోషా లనే విరుద్ధ లక్షణాలను కలిగిన మిథ్యా ప్రపంచము నందు, ప్రపంచము లోని వ్యవహారముల యందు వికారము చెందకుండా సదా సమత్వమును దర్శించడమే గుణాతీతుని లక్షణము (**స్వభావేన విలక్షణే గుణదోష విశిష్టే అస్మిన్ ( మిథ్యా జగతి ) సర్వత్ర సమదర్శిత్వం ( తత్ ) గుణాతీతస్య లక్షణమ్**).

**పక్షపాత రహితుడు**

వీరు శత్రువులు, వీరు మిత్రులు అనే భేదభావము గుణాతీతునిలో అగుపించదు. శత్రువుల యందు, మిత్రుల యందు గుణాతీతుడు సమభావంతో ఉంటాడు (**తుల్యః మిత్రారి పక్షయోః**).

సమత్వ బుద్ధి గల జ్ఞానికి శత్రుమిత్రులు ఎలా ఉంటారు? అసంగుడు, అద్వయుడు అయిన ఆ మహాత్మునికి ఎవరితో సఖ్య ముంటుంది? కలతలు తెలియని నిష్కలునికి ఎవరితో కయ్య ముంటుంది? శత్రుమిత్రులు ఉంటే కదా వారి విషయంలో సమత్వ ముండేది? శత్రుమిత్రులే అర్థం కాకుండా ఉదాసీనంగా ఉండే గుణాతీతునికి ( 14 వ అ - 23 వ శ్లో ) శత్రుమిత్రుల యందు సమబుద్ధిని కలిగి ఉండటము అనేది ఎలా పొసగుతుంది?

గుణాతీతుని లక్షణాలు స్వసంవేద్యాలే గాని పరప్రత్యక్షాలు కావని గుణాతీతుని లక్షణాలను ఆరంభించి నప్పుడే చెప్పుకున్నాం. కొందరు తమ భావంలో ఉదాసీనంగా ఉన్నా, పరుల అభిప్రాయంలో శత్రుమిత్రులుగా అర్థ మవుతూ ఉంటారు (**యద్యపి ఉదాసీనాః భవన్తి కేచిత్ స్వాభిప్రాయేణ తథాపి పరాభి ప్రాయేణ మిత్రారి పక్షయోః ఇవ భవన్తి**). తమ కంటూ శత్రుమిత్రులు లేకపోయినా, పరుల దృష్టిలో, పరుల అభిప్రాయాలలో అలా కనిపిస్తుంటారు. ఈ విధంగా ఆశించక పోయినా, జ్ఞానులకు కూడా శత్రుమిత్రులు ఏర్పడుతూ ఉంటారు. అన్యులు జ్ఞానిలో శత్రువును లేదా మిత్రుని చూచినా, అలా తమను తాము అతనికి శత్రువులుగా, మిత్రులుగా తయారు చేసుకున్నా జ్ఞాని మాత్రము వారి యందు సమదృష్టి తోనే ఉంటాడు (**ఇతి తుల్యః మిత్రారి పక్షయోః ఇతి ఆహ**).

అజ్ఞానిని జ్ఞానిగా సామాన్యులు స్తుతించ వచ్చు. అలాగే జ్ఞానిని సామాన్యునిగా భావించి నిందించ వచ్చు. అలాగే సన్మానించ దగిన వారిని అవమానించ వచ్చు. లేదా తద్వ్యతిరిక్తంగా ప్రవర్తించ వచ్చు. మిత్రులను

శత్రువులుగా పరిగణించ వచ్చు. శత్రువులను మిత్రులుగా భావించ వచ్చు. పరిమిత జ్ఞానం కలవారు ఎలా ప్రవర్తించినా ఆశ్చర్యం లేదు. కాని, జ్ఞాని లేదా గుణాతీతుడు వీటికి అతీతుడు. సదా సమత్వంతో శోభించే వాడు. కనుక, అతని సమదృష్టిలో శత్రువులూ ఉండరు. మిత్రులూ ఉండరు. అతనిది సర్వత్ర సమదర్శనమే. ఆత్మ దర్శనమే.

**సర్వారంభ పరిత్యాగి**

కర్మలను ఆరంభాలు అంటారు. ఆరంభించ బడతాయి కనుక కర్మలు ఆరంభాలు ***( ఆరభ్యన్తే ఇతి ఆరంభాః కర్మాణి ).*** కొన్ని కర్మలకు ఫలితాలు ఇక్కడే, ఈ లోకం లోనే, మనిషి జీవించి ఉండగానే కనిపిస్తాయి. వాటిని దృష్ట ఫలాలు అంటారు. కొన్ని కర్మలకు ఫలితాలు ఇక్కడ, అంటే జీవించి ఉన్నప్పుడు కాకుండా మరణానంతరము మరొక లోకం లోనో, లేక మరొక జన్మ లోనో అందుతాయి. వాటిని అదృష్ట ఫలాలు అంటారు. ఈ విధంగా దృష్టాదృష్ట ప్రయోజనాలను కలిగించే సమస్త కర్మలను త్యజించిన వాడు సర్వారంభ పరిత్యాగి. అతడే ఆత్మజ్ఞాని. గుణాతీతుడు ***( సర్వాన్ ఆరంభాన్ దృష్టాదృష్టార్థాని పరిత్యక్తుం శీలమ్ అస్య ఇతి సర్వారంభ పరిత్యాగీ ).***

మరి, సర్వ కర్మలను త్యజిస్తే దేహయాత్ర ఎలా సాగుతుంది? అనే సందేహము కలగ వచ్చు. దీనికి ఆచార్యుల వారు భాష్యంలో వివరణ ఇచ్చారు. సర్వారంభ పరిత్యాగి అంటే, దేహాన్ని నిలుపుకోవ డానికి అవసరమైన కర్మలను తప్ప, మిగిలిన సమస్తమైన కర్మలను త్యజించిన వాడు అని అర్థం చెప్పారు ***( దేహధారణ మాత్ర నిమిత్త వ్యతిరేకేణ సర్వ కర్మ పరిత్యాగీ ఇత్యర్థః ).***

చేయవలసిన కర్మను ఆరంభించే ముందు ఎవరి కైనా కర్మాసక్తి ఉంటుంది. ఇది నేను చేయ వలసిన కార్యము అనే భావన ఉంటుంది. అదే కర్తృత్వ భావన. అలాగే, కర్తృత్వ భావంతో ఆచరించిన కర్మకు తాను పొంద వలసిన ఫలమును కూడా ఊహించడము జరుగుతుంది. అదే ఫలాసక్తి, లేదా భోక్తృత్వ భావన. గుణాతీతుడు చేయవలసింది లేదు కనుక కర్మారంభంలో అతనికి కర్మాసక్తి ఉండదు. అలాగే పొంద వలసింది ఉండదు కనుక కర్మారంభంలో ఫలాసక్తీ ఉండదు. ఈ విధంగా సమస్త కర్మల యందు కర్తృత్వ భోక్తృత్వ అభిమానములను త్యజించి, నీటి మీద వ్రాత ల్లాగా కర్మలను నిర్వర్తించడమే సర్వారంభ పరిత్యాగము. అంటే, గుణాతీతునిలో సకామ కర్మలు ఆరంభించ బడవు అని అర్థము. కారణం, అతడు కృతకృత్యుడు; ఆప్తకాముడు.

**లోక సంగ్రహార్థం**

ఇక్కడ గమనించ దగిన మరొక ముఖ్య విషయ ముంది. ఆచరించే ప్రతి కర్మకు సామాన్యులు ఫలితాన్ని ఊహిస్తారు. కాని, పూర్ణ పురుషుడైన ఆత్మజ్ఞాని ఆచరించే కర్మలకు అతనిలో ఫలాసక్తి ఉండాలని లేదు. చేయ వలసిన కర్మ ఉండినా, పొంద వలసిన ఫలం లేకుండా ఉండొచ్చు.

ప్రారబ్ధ వశాత్తు జ్ఞాని దేహం ప్రపంచంలో ఉంది కనుక, దేహ ప్రారబ్ధాన్ని అనుసరించి ఆచరించ వలసిన కర్మలను జ్ఞాని ఆ దేహం ద్వారా ఆచరించ వచ్చు. అలాంటి కర్మల విషయంలో ఆచరించే వాడు జ్ఞాని అయినందున, పొంద వలసిన కర్మఫలం తన కంటూ ఏమీ ఉండదు. అలాంటి జ్ఞాని యొక్క కర్మలకు ఫలాలు ప్రాప్తిస్తే, అవి లోకానికి ఉపయోగ పడతాయి. లోక సంగ్రహార్థమే వాటి వినియోగం ఉంటుంది.

జ్ఞానికి విధి నిషేధాలు లేవని ముందే తెలుసుకున్నాం. కనుక, తాను చేయ వలసిన కర్మలు లేక పోయినా, అలాగే పొందవలసిన ఫలితాలు లేకపోయినా, సూర్యుడు ప్రకాశాన్ని విరజిమ్మినట్లు, మేఘాలు అవనిపై వర్షించినట్లు, మొక్కలు పూలు పూసినట్లు, చెట్లు కాయలు కాచినట్లు, గాలులు తిరిగినట్లు, నదులు పారినట్లు,





లోక కళ్యాణార్థం జ్ఞాని కర్మలను ఆచరించ వచ్చు. అవి లోక సంగ్రహార్థం ఆచరించే కళ్యాణకరమైన నిష్కామ కర్మలే గాని ఫలాపేక్షతో ఆచరింపబడే సకామ కర్మలు కావు. అలాంటి పవిత్ర ఆరంభాలు, వాటి ఫలాలు ప్రపంచానికి అందుతాయే గాని జ్ఞానికి కాదు. ఈ సత్యాన్ని ఆవిష్కరించ డానికి పరమేశ్వరుడు గీత - మూడవ అధ్యాయంలో తననే ఉదాహరణంగా స్వీకరించి బోధించాడు.

***నమే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన ,***
***నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి ॥***

'అర్జునా! ముల్లోకాలలో నేను చేయవలసిన కార్య మంటూ లేదు. నేను పొందని దంటూ లేదు. పొంద వలసిందీ లేదు. అయినా, నేను కర్మ లాచరిస్తూనే ఉన్నాను' అన్నాడు గీతాచార్యుడు *( 3 వ అ - 22 వ శ్లో ).*

జ్ఞాని కర్మ చేయవచ్చు; మానేయనూ వచ్చు. చేసినంత మాత్రాన కర్మలు జ్ఞానిని బంధించవు. అలాగని, కర్మలు మానేసిన వారందరూ జ్ఞానులనీ కాదు. కర్మశూన్యులు సోమరులు. కర్మాతీతులే జ్ఞానులు. ఆత్మజ్ఞానులు. వారే గుణాతీతులు.

అర్జునుడు అడిగిన మూడు ప్రశ్నలలో గుణాతీతుని లక్షణాలను ఇరవై రెండవ శ్లోకంలో వివరించిన పరమేశ్వరుడు, గుణాతీతుని ఆచార వ్యవహారాలను గూర్చి ఇరవై మూడవ శ్లోకం నుండి ఇరవై ఐదవ శ్లోకం వరకు వరుసగా వివరించి, ఇక మూడవది అయిన గుణాతీత స్థితిని ఎలా చేరుకోవాలి అనే ప్రశ్నకు సాధనోపాయ మును తరువాత శ్లోకంలో ప్రవచిస్తున్నాడు.

ఇరవై మూడవ శ్లోకం ***ఉదాసీనవ దాసీనం*** నుండి ఇరవై ఐదవ శ్లోకం ***గుణాతీతః స ఉచ్యతే*** వరకు ఏదైతే గుణాతీతునికి లక్షణాయుత మైన ఆచారముగా చెప్పబడిందో అది సాధకుడైన వానికి యత్న సాధ్యము, అంటే ప్రయత్నించి పొంద దగినది అని అర్థము.

*మూడు గుణాలను ఎలా అతిక్రమించాలి? అని అర్జునుడు అడిగిన మూడవ ప్రశ్నకు సమాధానం చెబుతున్నాడు.*

మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే ।
స గుణా న్సమతీ త్యైతా న్బ్రహ్మ భూయాయ కల్పతే ॥ 26

***మాం-చ-యః-అవ్యభిచారేణ-భక్తియోగేన-సేవతే***
***సః-గుణాన్-సమతీత్య-ఏతాన్-బ్రహ్మభూయాయ-కల్పతే***

| | | | | | |
|---|---|---|---|---|---|
| యః | = | ఎవడు | ఏతాన్ | = | ఈ |
| అవ్యభిచారేణ | = | చలించని | గుణాన్ | = | గుణములను |
| భక్తియోగేన | = | భక్తియోగము చేత | సమతీత్య | = | అతిక్రమించి |
| మాం | = | నన్ను | బ్రహ్మభూయాయ | = | బ్రహ్మత్వమునకు |
| సేవతే | = | సేవిస్తాడో | కల్పతే చ | = | అర్హు డవుతాడు |
| సః | = | వాడు | | | |

**అర్జునా! అచంచలమైన భక్తితో నన్ను సేవించే వాడు గుణాలను దాటి పోతాడు. బ్రహ్మత్వమును పొందడానికి అర్హు డవుతాడు.**

### వ్యాఖ్య

త్రిగుణాలను అతిక్రమించేది ఎలా? అనే అర్జునుని మూడవ ప్రశ్నకు భగవానుని ప్రతి వచనమే ప్రస్తుత శ్లోకం. గుణాతీతుని ఆచారంగా ఇంతవరకు వరుసగా మనం చెప్పుకొనిన మూడు శ్లోకాలు జ్ఞాని విషయంలో, అంటే గుణాతీతుని విషయంలో లక్షణాలు గాను, ముముక్షువు అయిన సాధకుని విషయంలో ప్రయత్న పూర్వకంగా ఆచరించ వలసిన సాధనలు గాను అర్థం చేసుకున్నాం. అలాంటప్పుడు మళ్ళీ గుణాతీత స్థితికి ప్రత్యేకంగా ఉపాయాన్ని చెప్పవలసిన అవసర మేముంది? అనే సందేహం కలగ వచ్చు. నిజమే, మనం చెప్పు కున్న వన్నీ సాధనలే. సాధకునికి ఉపాయాలే. కాని, ప్రస్తుతం మనం ఈ శ్లోకంలో గ్రహించేది పూర్వం చెప్పిన వాటి కన్నా విశిష్టమైన విషయం. *అయం అన్యః గుణాతీత త్వాభ్యుపాయః విశిష్టతరః పూర్వస్మాత్ ఉచ్యతే* - గుణాతీత స్థితిని పొందటానికి పూర్వం ప్రవచించిన దాని కంటే విశిష్ట తరమైన ఉపాయం ఒకటి చెప్పబడుతూ ఉంది అని దాని అర్థము. ఇది భాష్య వాక్యము. శ్రీ శంకర భాష్య వచనము. కాకపోతే, ఈ వాక్యం కొన్ని ప్రతులలో కనిపిస్తుంది. కొన్ని ప్రతులలో కనిపించదు. రచనా శైలిని బట్టి మాత్రం ఇది ఆచార్యుల వాక్యమే అని విస్పష్ట మవుతూ ఉంది.

'అర్జునా! ఎవడైతే అచంచలమైన భక్తియోగం చేత నన్ను సేవిస్తాడో, వాడు గుణత్రయాన్ని దాటి, మోక్షానికి అర్హు డవుతాడు' అనేది శ్లోకార్థం. గుణాలను అధిగమించి, బ్రహ్మత్వానికి అర్హతను పొందడానికి అచంచల మైన భక్తిని ప్రధానంగా ప్రవచించడం చేత, ఈ సాధన విశిష్టతర మైందని ఆచార్యుల అభిప్రాయం కావచ్చు.

**ఈశ్వర ప్రణిధానము**

భక్తి అంటే భగవంతుని ఆశ్రయించి సేవించడము అని అర్థము. అంటే సగుణ బ్రహ్మోపాసనము ***(భజనం భక్తిః)***. అదే యోగం ***(స ఏవ యోగః)***. అట్టి భక్తియోగంతో పరమేశ్వరుని సేవించే వాడు ***(తేన భక్తియోగేన సేవతే)*** గుణాలను అతిక్రమించి ***(గుణాన్ సమతీత్య)*** బ్రహ్మత్వానికి, లేదా మోక్షానికి అర్హు డవుతున్నాడు ***(బ్రహ్మ భూయాయ మోక్షాయ కల్పతే సమర్థః భవతి ఇత్యర్థః)***.

భక్తి పవిత్ర మైనది. ఉత్కృష్ట మైనది. సరళ మైనది. జ్ఞానపూరిత మైనది. భక్తి లేనిదే ముక్తిని సాధించ డము దుర్లభము. యోగసిద్ధికి కూడా ఈశ్వర భక్తి ప్రధానమని పతంజలి మహర్షి తమ యోగదర్శనంలో అభిప్రాయ పడ్డారు ***(సూ॥ ఈశ్వర ప్రణిధానాద్వా ...** సమాధి పాదము : సూత్రం - 23 )*.

భక్తి ఏదో కాదు; పరమేశ్వరునికి సంబంధించిన జ్ఞానమే భక్తి అనేది తరచుగా మనం చెప్పుకొనే వాక్యం. పరమేశ్వరు డంటే ఏమిటో తెలియని వాడు భక్తి ఎలా చేస్తాడు? చేస్తాడు. కాకపోతే, ఏదోలా చేస్తాడు. ఏదోలా చేస్తే, ఏదేదో చేస్తే పొంద వలసింది ఎలా పొందుతాడు? కనుక, ఈశ్వర జ్ఞానం కలిగిన వాడే ఈశ్వరుని ఆశ్రయించి సేవిస్తాడు. భగవత్కృపకు పాత్రుడై తరిస్తాడు.

మరి, ఈశ్వరుని ఆశ్రయించేది ఎలా? ఈశ్వరుడు ఎక్కడున్నా డని ఆశ్రయించాలి? ఎక్కడో ఉన్నవాడు, ఏ లోకం లోనో ఉండేవాడు భగవంతుడు అయితే, మన జీవిత మంతా అతణ్ణి అన్వేషించే కార్యం లోనే తిరుగుతూ, తరుగుతూ ఉంటుంది గాని కూర్చుని భక్తి చేయడం జరగదు.

చరణము : ***ఆడాడ తిరిగి అలసి పోయాను***
***ఆదుకో స్వామీ!***
***తిరుగుడు తల తిరుగుడు మాని***
***నీ గుడి తిరిగెదను*** ॥ ***వినిపించ*** ॥





పల్లవి : ***వినిపించ లేదా కోనేటి దేవా***
***కన్నీటి నా గాథ!***
***అడుగు అడుగుకు కొండల స్వామీ***
***దండము గైకొనవా!*** ॥ ***వినిపించ*** ॥

అని ఆర్తితో నినదించింది చైతన్య గీతం.

భగవంతుడు తిరిగితే దొరికే వాడు కాడు. వెను దిరిగితే దర్శన మిచ్చేవాడు. తిరిగి సాధించ డానికి భగవంతుడు వస్తువు కాదు. వెతికి పట్టుకోవడానికి లేనివాడు కాడు. ఇప్పుడు లేని వాడు కాడు. ఇక్కడ లేని వాడు కాడు. ఇక్కడ లేకుండా భగవంతుడు మరొక చోట ఉండేట ట్లైతే, అతనిని చేరడానికి మనం ప్రయత్నించి ఇక్కడ నుండి వెళ్ళే లోగా అతడు అక్కడ లేకుండా పోవచ్చు. పోవచ్చు ఏమిటి? తప్పకుండా పోతాడు. లేని వాడే అవుతాడు. ఇక్కడ ఉన్నవాడే అక్కడ కూడా ఉండొచ్చు. అంతేగాని, ఇక్కడ లేనివాడు అక్కడ ఉండే అవకాశమే లేదు. కావలసిన వాడు ఇక్కడే దొరికే టప్పుడు, ఇప్పుడే దొరికే టప్పుడు, అలాంటి వాణ్ణి ఆశ్రయించడంలో కష్ట మేముంది? నిజమే. తెలిస్తే కష్టం లేదు. తెలియక పోతే అంతా కష్టమే. తెలియడమే జ్ఞానం. జ్ఞానం కలిగితే భక్తి సులభం. భక్తి సాగితే ముక్తి కరతలామలకం.

అందుకే ముందు పడి అన్వేషించడం కాదు; వెనుదిరిగి దర్శించాలి అంటున్నాను. కదిలిన చోటికే వెళ్ళి కలవాలి. అదే వెను దిరగడ మంటే. ప్రభవించిన చోటికి పయనించడం. నది సముద్రం వైపు సాగినట్లు అందంగా సాగి పోవడము. అదొక అందమైన చలనము. ఆనంద తాండవ నృత్య చలనంలో లయబద్ధంగా సాగిపోయి లయించిపోయే అలౌకిక చలనము. చలించే సాగరం వైపు పయనించే నదీ చలనము. పతి అయిన సాగరుని చేరి నది తన్మయం చెందినట్లు ***(సింధుః సరిద్వల్లభమ్)***, పశుపతిని చేరి భక్తుడు తరించి పోవాలి. అందుకనే, అర్జునా! నన్ను అచంచల భక్తితో సేవించే వాడు ***(మాం చ యోఽ వ్యభిచారేణ భక్తి యోగేన సేవతే)*** బ్రహ్మత్వానికి అర్హు డవుతాడు అంటున్నాడు భగవానుడు.

నన్ను సేవించే వాడు ***(మాం సేవతే)*** అంటున్నాడు. మరి, భగవానుడు ఎక్కడ ఉన్నాడని సేవించాలి? భగవంతుని చిరునామాను శ్రీ శంకరులు భాష్యంలో స్పష్టంగా తెలిపారు. ***మాం ఈశ్వరం నారాయణం సర్వ భూత హృదయాశ్రితం*** - ***మాం*** అంటే నన్ను, సర్వుల హృదయాల లోనే ఉన్న ఈశ్వరుడ నైన నన్ను, నారాయణ మూర్తి నైన నన్ను భక్తితో సేవించే వాడు భక్తుడు. జ్ఞానం కలిగిన భక్తుడు.

భగవంతుడు మన హృదయం లోనే ఉన్నాడు. భగవంతుని ఆశ్రయించాలి అనే భావన ఎక్కడైతే పుడుతూ ఉందో అక్కడే ఉన్నాడు. కదిలే చోటే కరిగి పోవాలి అనే జ్ఞానామృత సందేశాన్ని అక్కడ నుండే అందిస్తున్నాడు. ఈ సందేశాన్ని ఆరాధనా భావంతో అందుకొనే భక్తుడు పరమేశ్వరుని ఆశ్రయిస్తాడు. ఆశ్రయించిన వాడు ఆరాధిస్తాడు. ఆరాధించిన వాడు బ్రహ్మాత్మ స్థితిని పొంద డానికి అర్హు డవుతాడు ***(బ్రహ్మ భూయాయ కల్పతే)***.

భగవంతుడు దేశకాలాదులలో కాకుండా స్వరూపమై ఉన్నందున తాను అనుభవ విషయం కాకుండా జ్ఞానగమ్యమై ఉన్నాడు. విచారించి దర్శించ దగిన వాడే గాని శ్రమించి పొంద వలసిన వాడు కాడు. కనుక, భక్తి అనేది పరమేశ్వరునికి సంబంధించిన జ్ఞానమే అని తెలుసుకున్నాం కాబట్టి భక్తి కలిగితే, ప్రత్యేకించి గుణాలను అతిక్రమించే ప్రయత్నం చేయ నవసరం లేదు. గుణాలు ఉన్నా, గుణాలలో ఉన్నది తానే, గుణాలకు అతీతంగా ఉన్నది కూడా తానే అనే జ్ఞానం కలుగుతుంది. అన్నిటిలో ఉంటూ అన్నిటికీ అతీతంగా ఆకాశము భాసించినట్లు, గుణాలలో ఉంటూ గుణాలకు అతీతంగా భాసించేది ఈశ్వర చైతన్యమే అనే అనుభూతి కలుగుతుంది. ఈశ్వర చైతన్య భావన, లేక బ్రహ్మాకార వృత్తి అఖండముగా బుద్ధిలో నిలవడమే భక్తి.

***మత్కథా శ్రుతి మాత్రేణ మయి సర్వ గుహాశయే ।***
***మనోగతి రవిచ్ఛిన్నా యథా గంగాంభ సోఽ౨ంబుధౌ ॥***
***అహైతు కృవ్యవహితా యా భక్తిః పురుషోత్తమే ।***
***లక్షణం భక్తి యోగస్య నిర్గుణస్య హ్యుదాహృతమ్ ॥***

'నా కథా శ్రవణము చేసినంత మాత్రముననే, సర్వుల హృదయాలలో చైతన్య స్వరూపముగా భాసిస్తున్న పురుషోత్తముడ నైన నా యందు, గంగాజలము సముద్రములో ప్రవేశించి తద్రూప మైనట్లు, మనస్సు అహైతుకంగా, అవ్యవధానంగా లగ్నం కావడము ఏదైతే ఉందో, అదే నిర్గుణమైన స్వరూప భక్తికి లక్షణము.'

ఈ విధంగా భక్తి వలన బుద్ధిలో అఖండ బ్రహ్మాకార వృత్తి ఏర్పడటం చేత సర్వమును సర్వదా బ్రహ్మాకారముగా దర్శించడం జరుగుతుంది. **సర్వ మిద మహం చ బ్రహ్మైవ** - ఈ సమస్తమైన ప్రపంచము, నేను అంతయు బ్రహ్మమే అనే అనుభూతి కలుగుతుంది. ఈ విధమైన భగవత్ప్రాప్తి రూపమైన బ్రహ్మనిష్ఠ యందు ఎవడైతే స్థిర పడతాడో అట్టివాడు గుణములను, గుణ కార్యములను, గుణ వ్యవహార రూపమైన మాయను అధిగమించి బ్రహ్మానందమును పొందుతాడు.

**అఖండ భక్తి**

భక్తి అఖండాకార వృత్తితో పూర్ణ రూప మైనపుడు అన్య భావములు కదిలే అవకాశం లేనందున, ఈ భక్తి అచంచలమై, అవిచ్ఛిన్నమై, జల ప్రవాహం వలె (***స్రోతసా సమం***) నిత్యము సాగుతూ ఉంటుంది. దీనినే అవ్యభిచార భక్తి అన్నాడు ప్రస్తుత శ్లోకంలో భగవంతుడు (***అవ్యభిచారేణ భక్తి యోగేన***). ఇక్కడ, వ్యభిచార మంటే అన్య వృత్తుల చేత చిత్తము భంగం కావడమే. అలా అన్యవృత్తులు చిత్తమును ఆక్రమించకుండా కేవలం భగవత్ప్రాప్తి రూపమైన అభేద వృత్తి ఉండటమే అవ్యభిచార భక్తి. దీనినే ముఖ్య భక్తి లేక ఏకాంత భక్తి అని అంటారు.

పతనమైన జారస్త్రీ అనేక మంది పురుషుల యందు తన ప్రేమను ఒలకబోస్తూ ఉంటుంది. ఏ పురుషుడు తనను ఆశ్రయిస్తే, తన ప్రేమను అతని పైనే కుమ్మరిస్తుంది. ఈ ప్రేమ వ్యభిచారిణీ భక్తి. అలా కాకుండా, ఒక సాధ్వి యైన స్త్రీ తన మనస్సును పూర్ణంగా భర్త యందే లగ్నం చేసి జీవించడం ఏదైతే ఉందో, అదే అవ్యభిచారమైన ప్రేమ. అవ్యభిచారిణీ భక్తి (***సాధ్వీ నైజ విభుం***).

అఖండాకార వృత్తి రూపమైన భక్తి ఏర్పడటం చేత భక్తుడు మాయను దాటుతున్నాడు. **మా మేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తి తే** - అర్జునా! నన్ను ఆశ్రయించిన నా భక్తులు మాయను దాటుతున్నారు అని విజ్ఞానయోగం లోనే భగవంతుడు ప్రబోధించాడు (*7 వ అ - 14 వ శ్లో*). కనుక భక్తుడు మాయను అవలీలగా, అలవోకగా దాటేస్తాడు. మాయ గుణమయం కనుక మాయను దాటడం అంటే గుణాలను దాటడమే. గుణాతీత స్థితిని అందుకోవడమే. ఈ విధంగా భక్తి బ్రతుకును భగవన్మయం చేస్తుంది. మాయ ఎవరిని ఆశ్రయించుకొని ఉందో, అట్టి అచ్యుతుని అనుగ్రహానికి నోచుకున్న వారిని మాయ ఏం చేస్తుంది? దివ్య కాంతు లీనుతూ, కారాగృహంలో కన్నతల్లికి కన్నయ్య కళ్ళ ముందు సాక్షాత్కరించి నపుడు దేవకీమాత చేతులు జోడించి నమస్కరిస్తూ, తండ్రీ! నువ్వెక్కడ? నే నెక్కడ? జగత్పిత వైన నీకు నేను తల్లిని కావడ మేమిటి? ఇదీ నీ మాయే అనుకుంటాను! నన్ను కృతార్థురాలిని చేయడానికి, మాయను అధీనంలో ఉంచుకొని ఆవిష్కరించిన మహిమే అని భావిస్తున్నా!





***ఆ॥ విలయకాల మందు విశ్వంబు నీ పెద్ద***
***కడుపులోన దాచు కడిమి మేటి***
***నటుఁడ వీవు, నేడు నా గర్భజుఁడ వౌట***
***పరమపురుష! వేడబంబు గాదె!***

'కన్నయ్యా! ప్రళయ సమయంలో విశ్వమంతా విలీన మైనపుడు, సమస్త జగత్తును నీ కడుపులో దాచుకున్న మేటి నటుడవు నీవు. మాయావివి. అలాంటి పురుషోత్తముడ వైన నువ్వు నా కడుపున పుట్టడమా? ఇంత కన్నా మాయ మరొకటుందా కన్నా?' అని మర్మ మెరుగని మాటను ముకుందుని ముందుంచింది పుణ్య మాత దేవకీ దేవి. మాధవుని మహిమ ముందు మాయను అధిగమించడం ఎంత సులభమో చెప్పకనే చెప్పింది.

పనికి రాని మాయను, పని గట్టుకొని సంసారంలో ముంచేసే మాయను ప్రక్కన ఉంచి, అఖండ వృత్తి రూప భక్తి అనే కార్యాన్ని బుద్ధికి పట్టించిన భక్తులు మాధవుని అనుగ్రహంతో మాయను తప్పక దాటేస్తారు.

***ఉనికి లేనిది జగతి ఉన్న గాని***
***పనికి రానిది సంగతి నీది గాని***
***పూల కవిత లల్లెద నీ పదాల నీడ లోన***
***నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!***

అని చిన్నికృష్ణ శతకంలో ఒక వెన్నముద్ద.

*గుణాలను గుణ కార్యాలను భగవత్కృప చేత భక్తుడు అధిగమించ వచ్చు. అంతమాత్రాన 'నేనే బ్రహ్మము' అనే మోక్షము ఎలా ప్రాప్తిస్తుంది? చదవండి!*

బ్రహ్మణో హి ప్రతిష్ఠాऽహ మమృత స్యావ్యయస్య చ ।
శాశ్వతస్య చ ధర్మస్య సుఖ స్యైకాన్తికస్య చ ॥ 27

*బ్రహ్మణః-హి-ప్రతిష్ఠా-అహం-అమృతస్య-అవ్యయస్య-చ*
*శాశ్వతస్య-చ-ధర్మస్య-సుఖస్య-ఏకాంతికస్య-చ*

| | | | | | |
|---|---|---|---|---|---|
| అహం | = | నేను | ధర్మస్య చ | = | ధర్మమునకు |
| అమృతస్య | = | అమృత స్వరూపమైన | ఏకాంతికస్య చ | = | అచంచలమైన |
| అవ్యయస్య చ | = | అవ్యయమైన | సుఖస్య చ | = | సుఖమునకు |
| బ్రహ్మణః | = | బ్రహ్మమునకు | ప్రతిష్ఠా హి | = | ఆశ్రయుడను |
| శాశ్వతస్య | = | శాశ్వతమైన | | | |

**అర్జునా! అమృత స్వరూపుడు, అవ్యయ రూపుడు, శాశ్వత ధర్మ స్వరూపుడు, చలించని సుఖ రూపుడైన బ్రహ్మమునకు ఆశ్రయము నేనే.**

**వ్యాఖ్య**

అచంచలమైన భక్తియోగంతో (***అవ్యభిచారేణ భక్తి యోగేన***) ఎవడైతే భగవంతుణ్ణి సేవిస్తాడో, వాడు గుణాలను అతిక్రమించి బ్రహ్మత్వమును పొందడానికి సమర్థు డగుచున్నాడు (***బ్రహ్మ భూయాయ కల్పతే***) అని పూర్వ శ్లోకంలో చెప్పబడింది. భక్తి చేసినంత మాత్రాన బ్రహ్మభూతు డెలా అవుతాడు? అనే సందేహం అక్కడ కలుగుతుంది. ఈ విధమైన సంశయాన్ని నివృత్తి చేయడానికే ఈ అధ్యాయాంత శ్లోకము. నేను (***అహం***)

బ్రహ్మకు ప్రతిష్ఠను కావడం చేత, బ్రహ్మ నా కన్నా భిన్నం కాక పోవడం చేత, భక్తి చేత గుణాలను అధిగమించిన వాడు బ్రహ్మత్వాన్ని పొందడానికి అర్హు డగుచున్నాడు అనేది ఈ శ్లోకం అందిస్తున్న సంశయ నివృత్తి.

**'అహం' శబ్దార్థము**

భగవద్గీతలో శ్రీకృష్ణ పరమాత్మ తనను 'అహం' శబ్దంతో అనేక చోట్ల నిర్దేశిస్తాడు. ఆయా సందర్భాలను బట్టి 'అహం' శబ్దమును కొన్ని చోట్ల కేవలం నిర్గుణ స్వరూపమైన పరబ్రహ్మముగా, కొన్నిచోట్ల వాసుదేవ నామంతో తెలిసే సగుణ బ్రహ్మముగా ***( అహం వాసుదేవాఖ్యం పరంబ్రహ్మ )*** గ్రహించవలసి ఉంటుంది. ప్రస్తుత శ్లోకంలో ***అహం*** -నేను ***బ్రహ్మణః*** - బ్రహ్మమునకు ప్రతిష్ఠను ***( బ్రహ్మణః ప్రతిష్ఠా )*** అని చెప్పడం జరిగింది. మరి, ఈ సందర్భంలో 'అహం' శబ్దార్థ మేమిటి? 'బ్రహ్మ' శబ్దార్థ మేమిటి?

శ్రీకృష్ణుని వాసుదేవ పరబ్రహ్మముగా చూచి నపుడు 'అహం' శబ్దార్థమును 'ప్రత్యగాత్మ' అని గ్రహించ వలసి ఉంటుంది. కారణం, బ్రహ్మమును అన్యంగా చెప్పి, 'బ్రహ్మమునకు నేను ప్రతిష్ఠను' అని చెప్పడం చేత. బ్రహ్మమును ప్రత్యేకంగా నిర్గుణ పరబ్రహ్మముగా చెప్పడం జరిగింది కనుక, అట్టి నిర్గుణ బ్రహ్మమునకు ప్రతిష్ఠగా చెప్పబడిన 'అహం' శబ్దమునకు అర్థం నిర్గుణ బ్రహ్మము అని చెప్పడం సాధ్య పడదు.

'ప్రతిష్ఠా' అంటే నిలిచే స్థానము, లేదా ఆశ్రయము అని అర్థము. 'దీని యందు ఆశ్రయమును కలిగి ఉంది' అనే వ్యుత్పత్తి చేత 'ప్రతిష్ఠా' అంటే 'నిలిచే స్థానం' అని అర్థము ***( ప్రతితిష్ఠతి అస్మిన్ ఇతి ప్రతిష్ఠా )***. కనుక, 'అహం' శబ్దముతో తనను భగవద్గీతలో శ్రీకృష్ణుడు రెండు విధాలుగా నిర్దేశించి చెప్పుకోవడం చేత, ఆ రెండు కోణాల నుండి రెండు విధాలుగా ఇక్కడ కూడా 'అహం' శబ్దార్థమును చెప్పవలసింది ఉంటుంది. అంతేకాదు. 'అహం' బ్రహ్మమునకు ప్రతిష్ఠ అనడం వల్ల 'బ్రహ్మ' శబ్దార్థాన్ని కూడా వాటికి అనుగుణం గానే రెండు విధాలుగా చెప్పవలసి ఉంటుంది. అంతకన్నా ముఖ్యంగా, ***బ్రహ్మ భూయాయ కల్పతే*** - బ్రహ్మత్వమును పొందుటకు అర్హు డగుచున్నాడు అనేది ఎలాగో కూడా నిర్ధారణ చేయవలసి ఉంటుంది ***( కుతః ఏతత్ ? )***. కనుక ఈ శ్లోకాన్ని ఆచార్యుల వారి భాష్యానుసారం రెండు కోణాల నుండి వివరించే ప్రయత్నం చేస్తాను.

**అహం ప్రత్యగాత్మా**

మొదటి అర్థాన్ని బట్టి 'అహం' పదానికి ప్రత్యగాత్మ అని అర్థం. ఇలా చూచినపుడు 'నేను (అహం) బ్రహ్మమునకు ప్రతిష్ఠను' అనే అర్థం వస్తుంది. బ్రహ్మము, లేదా పరమాత్మకు ప్రత్యగాత్మ ప్రతిష్ఠ, లేదా ఆశ్రయము అని అర్థం ***( బ్రహ్మణః పరమాత్మనః ప్రతిష్ఠా అహం ప్రత్యగాత్మా )***. ఎప్పుడైతే ప్రత్యగాత్మ పరమాత్మకు ప్రతిష్ఠ అని చెప్పబడిందో, ఇక ఆ తరువాత, ప్రత్యగాత్మయే పరమాత్మ అని నిర్ధారణ చేయవలసి ఉంటుంది.

అదలా ప్రక్కన పెడితే, ప్రత్యగాత్మ 'బ్రహ్మ'కు ప్రతిష్ఠ అన్నప్పుడు, ప్రత్యగాత్మ ఏ 'బ్రహ్మ'కు ప్రతిష్ఠ? అనే ప్రశ్న ఉదయిస్తుంది ***( కీదృశస్య బ్రహ్మణః? )***. దానికి సమాధానంగా అమృతము, అవ్యయము, శాశ్వతము, ధర్మము లేక జ్ఞానయోగ రూప ధర్మము, సుఖ స్వరూపము, నిత్యము అయిన బ్రహ్మమునకు, లేదా పరమాత్మకు ప్రత్యగాత్మ యైన 'అహం' ప్రతిష్ఠ అనే విషయం శ్లోకం లోనే ఉంది.

పరబ్రహ్మము లేదా పరమాత్మ ఆనంద, అమృతాది స్వభావం కలవాడు కావడం చేత, అట్టి పరమాత్మకు ప్రత్యగాత్మ ప్రతిష్ఠ అని ఎప్పుడైతే చెప్పబడిందో, అప్పుడు సమ్యక్ జ్ఞానం చేత ప్రత్యగాత్మ పరమాత్మయే అనేది నిశ్చయ మవుతుంది ***( ఆనంద రూపస్య , అమృతాది స్వభావస్య పరబ్రహ్మణః ప్రత్యగాత్మా ప్రతిష్ఠా! సమ్యక్ జ్ఞానేన పరమాత్మ తయా నిశ్చీయతే )***. ప్రత్యగాత్మ పరమాత్మ కన్నా భిన్నుడు కాడు కనుక, అచంచల భక్తి చేత గుణాతీతుడైన ప్రత్యగాత్మ బ్రహ్మత్వమును, లేదా పరమాత్మత్వమును పొందడానికి అర్హు డగుచున్నాడు అని





చెప్పడం జరిగింది ***( తదేతత్ 'బ్రహ్మ భూయాయ కల్పతే' ఇత్యుక్తమ్ )***. పూర్వ శ్లోకంలో 'మాం' అని తనను తాను నిర్దేశించుకొనిన గీతాచార్యుడు, ప్రస్తుత శ్లోకంలో 'అహం' అని నిర్దేశించు కుంటున్నాడు. 'మాం' అంటే సర్వభూత హృదయాశ్రితు డైన ఈశ్వరుడు లేదా పరమేశ్వరుడు అని అర్థం చెప్పుకున్నాం. ఇక్కడ 'అహం' అంటే ప్రత్యగాత్మ అని అర్థం చేసుకున్నాం. కనుక, శ్రీకృష్ణుని దివ్య రూపంలో శోభించే ప్రత్యగాత్మ బ్రహ్మకు ప్రతిష్ఠ అని తెలిపోయింది. కనుక, 'అచంచల భక్తి భావంతో శ్రీకృష్ణుని సేవిస్తే, గుణాలను అధిగమించి బ్రహ్మ భావమును పొందడం జరుగుతుంది' అని ఈ శ్లోకానికి మూలమైన బీజ ప్రశ్నకు సమాధానం చెప్పినట్లైంది. కాని, భక్తి చేత గుణాలను అధిగమించి ఉండవచ్చు. దానిని అర్థం చేసుకోగలం. అంతమాత్రాన అది బ్రహ్మ అభిన్నత్వ జ్ఞానానికి ఎలా హేతువైంది? అనే సంశయం మాత్రం ఇంకా స్పష్టంగా తొలగినట్లు లేదు.

బ్రహ్మము మాయోపాధిని పొంది ఈశ్వరత్వముతో శోభిస్తాడని ముందే విస్తారంగా చెప్పుకొని ఉన్నాం. మాయోపాధి కలవాడే ఈశ్వరుడు. ఈశ్వరునికి ఈశ్వరత్వం ఉంటుంది. కనుకనే అతడు సర్వజ్ఞుడు; సర్వాంతర్యామి; సర్వశక్తిమంతుడు. మాయావి అయిన ఈశ్వరుడు మాయాశక్తితో కూడి భక్తులను అనుగ్రహించ డానికి అనేక రూపాలను ధరిస్తాడు.

***అనేన జీవేనాత్మనా అనుప్రవిశ్య నామరూపే వ్యాకరణాని*** - బ్రహ్మమే సర్వ జీవుల యందు ప్రవేశించి, నామరూపాలను వ్యక్తం చేస్తూ ఉపాధుల యందు జ్ఞాతగా తెలుస్తూ ఉంది అని శ్రుతి ప్రమాణము. కనుక, ఘటోపాధి భంగం కాగానే ఘటాకాశమునకు మహాకాశత్వము ప్రాప్తించినట్లు, జ్ఞాత యైన ఆత్మవిదునకు ఉపాధి ఉపరమించ గానే, బ్రహ్మభావము ఉపపన్న మవుతూ ఉంది. జ్ఞాతకు బ్రహ్మమునకు శ్రుతి అభేదమును చెప్పినందున, బ్రహ్మమునకు ప్రతిష్ఠగా తెలుస్తున్న ప్రత్యగాత్మకు బ్రహ్మభావము యుక్తమే అని గ్రహించ వలసి ఉంటుంది. శ్రీకృష్ణుడు అనే ప్రత్యగాత్మ ఈశ్వర శక్తియే. ఈశ్వరుడు, ఈశ్వర శక్తి వేరు కానందున ఈశ్వరశక్తి యైన ప్రత్యగాత్మ బ్రహ్మమే ***( శక్తి శక్తిమతోః అనన్యత్వాత్ ఇత్యభిప్రాయః )***. ఈ విధంగా 'అహం' శబ్దానికి ప్రత్యగాత్మ అని, 'బ్రహ్మ' శబ్దానికి శుద్ధ బ్రహ్మ మనే అర్థాలను గ్రహించి వ్యాఖ్యానించడం సమంజసము. శ్రుతి సమ్మతము.

**అహం పరమాత్మా**

'అహం' అంటే పరమాత్మ, లేక పరబ్రహ్మము. నిరుపాధిక సత్తా స్వరూపము. నిర్గుణ పరబ్రహ్మము అని అర్థం. 'బ్రహ్మ' శబ్దానికి సవికల్పకము, సాకారము అయిన సగుణ బ్రహ్మము అని అర్థము. కనుక, సగుణ బ్రహ్మము నకు నిర్గుణ పరబ్రహ్మమైన నేను (అహం) ప్రతిష్ఠ, లేదా ఆశ్రయము ***( బ్రహ్మ శబ్ద వాచ్యత్వాత్ సవికల్పకం బ్రహ్మ , తస్య బ్రహ్మణః నిర్వికల్పకః అహమేవ , న అన్యః , ప్రతిష్ఠా ఆశ్రయః )*** అని అర్థము. కనుక సోపాధిక బ్రహ్మమునకు నిరుపాధిక మైన నేను (అహం) ఆశ్రయము. ఇది రెండవ అర్థము. మరి సవికార బ్రహ్మము ఎలాంటిది?

సోపాధిక బ్రహ్మము, లేదా సగుణ బ్రహ్మము అమృతము. అంటే మరణము లేనిది ***( అమృతస్య అమరణ ధర్మకస్య )***. అవ్యయము అంటే వ్యయ రహిత మైనది ***( అవ్యయస్య వ్యయ రహితస్య )***. శాశ్వత మైనది. అంటే నిత్యమైనది ***( శాశ్వతస్య నిత్యస్య )***. ధర్మ మైనది. అంటే జ్ఞాన నిష్ఠా రూపమైనది ***( ధర్మస్య జ్ఞాన నిష్ఠా లక్షణస్య )***. అవ్యభిచరితమైన సుఖ స్వరూపము. అంటే, అనంతానంద స్వరూపము ***( సుఖస్య తజ్జనితస్య ఐకాన్తికస్య ప్రతిష్ఠా అహమ్ )*** అయిన సవికల్పక బ్రహ్మమునకు నిర్వికల్పక బ్రహ్మము నైన నేనే ***( అహమేవ )*** ఆశ్రయము ***(ప్రతిష్ఠా)*** అని అర్థము.

కార్య రూపంలో ఏది గోచరించినా, దానికి కార్యారంభము నందు సత్తామాత్రమైన కారణము ఉండి తీరాలి. కార్యము ఏదైనా అది కారణము నందే సుప్రతిష్ఠమై ఉంటుంది. అంటే కారణమునే ఆశ్రయముగా కలిగి ఉంటుంది. కారణ సత్తా కన్నా వేరుగా కార్య సత్తా ఉండ లేదు.

ప్రపంచము కార్య రూపంలో తెలుస్తూ ఉంది. కార్య రూపమైన ఈ మాయా ప్రపంచానికి ఈశ్వరుడైన సగుణ బ్రహ్మము మాయావిగా శోభిస్తూ, మాయను తన అధీనంలో ఉంచుకొని, ఈశ్వరత్వంతో సృష్టి కార్యాన్ని సాగిస్తున్నాడు.

కార్యమైన దృశ్యమాన జగదుత్పత్తికి ముందు కారణ రూపంలో సద్రూప చైతన్యం ఏకమై, అద్వయమై భాసిస్తూ ఉండింది. అది ఏకము, అద్వయము కనుక నిర్గుణము. కార్యరూపమైన జగత్తుకు, కార్యరూప జగద్వ్యాపారాలను సాగించే ఈశ్వరునకు కార్యారంభంలో సద్రూపము, నిర్గుణము, అద్వితీయమైన బ్రహ్మమే ఉండింది. సాకార ప్రపంచానికి, సగుణ బ్రహ్మమునకు నిర్గుణ నిరాకార పరబ్రహ్మమే ఆశ్రయంగా ఉంది ***(సగుణ బ్రహ్మణః అహం నిరాకార పరమాత్మా ప్రతిష్ఠా)*** అనేది రెండవ అర్థము. అచంచలమైన భక్తియోగము చేత సవికల్పక బ్రహ్మమును పొందిన భక్తుడు, కార్యమైన సగుణ బ్రహ్మము తన కాశ్రయమైన నిర్గుణ బ్రహ్మమునకు, లేదా పరమాత్మకు అన్యం కానందున, భక్తి చేత గుణములను అధిగమించిన భక్తుడు బ్రహ్మత్వమునకు అర్హు డగుటయే గాక బ్రహ్మమే అగుచున్నాడు.

**శ్లో॥ సర్వేషా మేవ వస్తూనాం భావార్థో భవతి స్థితః।**
**తస్యాపి భగవాన్ కృష్ణః కి మత ద్వస్తు రూప్యతామ్॥**

సమస్తములైన కార్య వస్తువులకు భావార్థమైన పరమార్థ వస్తువు సత్తా రూపంగా ఉంది. కార్య సత్తా కారణ సత్తా కన్నా వేరుగా ఉండలేదు కదా! మరి అట్టి సత్తా రూపుడైన శ్రీకృష్ణ పరమాత్మ కంటే అన్యమైన పారమార్థిక వస్తువు ఏముంది? ***( కిం అతత్ వస్తు ? )***. కనుక శ్రీకృష్ణుడే 'అహం' శబ్దము చేత సర్వమునకు ప్రతిష్ఠగా శోభిస్తున్నాడు అని భాగవతంలో శుక యోగీంద్రుని అమృత భాషణము.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
గుణత్రయ విభాగయోగో నామ చతుర్దశోఽధ్యాయః

**ఈ విధంగా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రము, శ్రీకృష్ణార్జున సంవాదము అయిన భగవద్గీత యందు గుణత్రయ విభాగయోగ మనే పద్నాల్గవ అధ్యాయము.**





# చైతన్య భగవద్గీత

## అథ పంచదశోఽధ్యాయః - పదిహేనవ అధ్యాయము

## పురుషోత్తమ ప్రాప్తి యోగః - పురుషోత్తమ ప్రాప్తి యోగము

### సందర్భము

***ఫలమత ఉపపత్తేః*** - కర్మఫలము పరమేశ్వరుని వల్లనే కలుగుతుంది *( బ్రహ్మసూత్రం ; 3-2-38 )*. కర్మలు ఆచరించే వారికి కర్మఫలము, జ్ఞానవంతులకు జ్ఞానఫలము పరమేశ్వరుని వల్లనే కలుగుతూ ఉన్నాయి. ఫలప్రదాత భగవంతుడు కావడం చేత, ఎవరైతే అచంచలమైన భక్తితో పరమేశ్వరుని సేవిస్తారో, వారు భగవదనుగ్రహం చేత బ్రహ్మత్వమునకు అర్హులై మోక్షాన్ని పొందుతారు అని ప్రవచించి పూర్వాధ్యాయాన్ని ముగించాడు గీతాచార్యుడు.

జీవునికి భక్తియోగము వలన బ్రహ్మభావము ఎలా ఏర్పడుతుంది? అనే శంకను నివారిస్తూ, తానే బ్రహ్మమునకు ఆశ్రయము ***(బ్రహ్మణః ప్రతిష్ఠా అహ మేవ)*** అని కూడా చెప్పడం జరిగింది.

గుణయుతుడైన వాడు జీవుడై నరు డయ్యాడు. గుణాతీతుడైన వాడు దేవుడై నారాయణు డవుతాడు. ప్రకృతి తాదాత్మ్యంతో జీవుడు పురుషు డయ్యాడు. గుణయుతమైన ప్రకృతి నుండి విడిపడి పురుషుడైన జీవుడు పురుషోత్తముడు కావాలి. మానవుడు మాధవుడు కావాలి. బద్ధుడు ముక్తుడు కావాలి.

సత్త్వగుణ ప్రధానుడైన సాత్త్వికుడు జ్ఞాన ప్రభావంతో అంతర్ముఖుడు. రజోగుణ ప్రధానుడైన రాజసుడు కర్మ ప్రవృత్తి చేత బహిర్ముఖుడు. తమోగుణ ప్రధానుడైన తామసుడు మోహ ప్రభావం చేత నిర్ముఖుడు. ఈ త్రిగుణాలను భగవ దనుగ్రహం చేత అధిగమించిన వాడు భగవన్ముఖుడు. గుణాతీతుడు. ఇలా గుణాతీతులైన వారు మోక్షాన్ని పొందుతారు ***( మాం ఈశ్వరం యే సేవన్తే తే మదనుగ్రహాత్ జ్ఞాన ప్రాప్తి క్రమేణ గుణాతీతాః మోక్షమ్ గచ్ఛన్తి ! )***. పరమేశ్వరుని కృప వలన భక్తుడు గుణములను అధిగమించి, జ్ఞానప్రాప్తి క్రమంలో ముక్తిని పొందేటప్పుడు, ఇక పరమాత్మ తత్త్వమును చక్కగా గ్రహించిన వారి విషయం ప్రత్యేకించి చెప్పేదేముంటుంది? అని వ్యాఖ్యానించారు పంచదశాధ్యాయ భాష్య పీఠికలో శ్రీ శంకరాచార్యస్వామి ***(కిము వక్తవ్యమ్ ఆత్మనః తత్త్వ మేవ సమ్యక్ విజానన్తః )***. ఈ కారణం చేత ఆత్మతత్త్వాన్ని వివరించ డానికి భగవానుడు ఈ పదిహేనవ అధ్యాయాన్ని ప్రారంభిస్తున్నాడు.

### అధ్యాయ నామ వైభవము

ఇది పదిహేనవ అధ్యాయము. 'పురుషోత్తమ ప్రాప్తి యోగము' అని అధ్యాయ నామము. ఈ నామంలో నాలుగు పదాలు ఉన్నాయి. ఒకటి పురుషుడు; రెండు ఉత్తమము; మూడు ప్రాప్తి ; నాలుగు యోగము. ఈ నాలుగు పదాలు కలిసి 'పురుషోత్తమ ప్రాప్తి యోగము' అయింది. 'పురుషోత్తమ' అనే దానిని సమాస పదంగా గ్రహిస్తే, అధ్యాయ నామం మూడు పదాలతో ఉంటుంది.

పురుషుడు అంటే సాధారణంగా మగవాడు అనే అర్థాన్ని గ్రహిస్తూ ఉంటాము. కాని, 'పురుషః' శబ్దార్థాన్ని గ్రహిస్తే, అది లింగభేదం లేకుండా సర్వ మానవులకు వర్తిస్తుంది.